

నీ(మీ)నీడ నాచోటు!

డిసెంబరులో విడుదల

రాజశ్రీ శాంతారాం

నటించిన

వి. శాంతారాం (ప్రై.) లి. వారు సమర్పించు

ఈస్ట్‌మన్ కలర్ చిత్రం

# గీత్ గాయా పత్థరోంనే

(హిందీ)

డైరక్షన్
వి. శాంతారాం

మ్యూజిక్
రామ్‌లాల్

నవరంగ్
(Air Cooled)
హైదరాబాద్

✲

నటరాజ్
(Air Cooled)
సికింద్రాబాద్

తెలంగాణా: విజయా రిలీజ్

ఆంధ్ర: విజయా పిక్చర్స్

# ఈ సంచికలో



ముఖచిత్రం "నా వెనుక నీ బాట.. "

చిత్రకారుడు వడ్డాది పాపయ్య


Member of Audit Bureau of
Circulation Ltd




'హాంటింప్లైం' కథ నా హృదయం కదిలించివేసింది. నాయొక్క సానుభూతి శారదకు వెంటనే అందజేసాను నా హృదయంతో! 'కాగితంముక్క' కథ చివరి వరకు సస్పెన్సులో ముంచి వేసింది. కాగితంముక్క పోగానే ఉత్తరంలో ఆ సంగతి తెలియక దిగులుగారిపోయాను. 'రంభా చక్రపాణీయం, ఓట్టితల్లి, పొగలేని నిప్పు, ఫలశృతి' కథలు నాకు బాగా నచ్చాయి. రచయితలకు నా అభినందనలు. యువలో పాపయ్యగారు చిత్రించిన తొమ్మిది చిత్రాలు నచ్చాయి. ఎక్కువగా 'హిమగిరి తనయ' నాకు నచ్చింది.

'నౌకాభంగం' నవల చాలా బాగుంది. ముఖచిత్రం వేరే బాగుండని చెప్పక్కర లేదు.

జె. ఎల్. వి. శాస్త్రి
శ్రీకాకుళం

యువ దీపావళి ప్రత్యేక సంచికలో ప్రచురించి యుండే అన్ని కథలకంటే "జ్యోతి" కథ దీపావళికి జ్యోతివంటికథ. రచయితలకు ధన్యవాదాలు.

వి. ఎస్. కృష్ణయ్య.
కోలార్.

# చిత్రవార్తలు



న్యూఢిల్లీ ఆలిండియా రేడియో నవంబరు 14 న ఏర్పాటుచేసిన సంగీత నృత్య కార్యక్రమాలలో చిన్నపిల్లలు "చాచా నెహ్రూ యాద్ తుమ్హారీ" అనే బృంద గానం పాడుతున్న దృశ్యం.



నాగార్జునకొండవద్ద పునర్నిర్మింపబడిన ఒకనాటి స్నానాల రేవు

# యువ

సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 11 డిసెంబరు 1964 సంచిక 6


కొత్త ఉక్కు ఫాక్టరీని ఏ రాష్ట్రంలో పెట్టాలనే విషయం, రాష్ట్ర అవసరాల దృష్టిలోగాని, ఉక్కు-ఫాక్టరీ గల సదుపాయాల దృష్టిలోగాని కాకుండా, కేవలం స్వార్థపరత్వం రాజకీయతంత్రం దృష్టిలో ఆలోచించడం, ఆందోళన చెయ్యడం లోకి దిగింది.

కేంద్ర ప్రభుత్వపు ప్రాజెక్టులు సుమారు పదింటిదాకా ఇప్పటికే మదరాసు రాష్ట్రంలో స్థాపింపబడినవి. దక్షిణదేశాన్ని ఉత్తరాదివారు సవతితల్లి ప్రేమతో చూస్తున్నారనే ఆందోళనను అన్ని పార్టీల గొంతుకలతోనూ సాగించి, గత ఇరవై సంవత్సరాలలోనూ, మదరాసు రాష్ట్రం అనేక విధాలుగా లాభాలను పొందింది.

దక్షిణదేశం ఎక్కడివరకు? మదరాసునుంచి కన్యాకుమారివరకా? అయితే, యీ ప్రాంతాన్ని దక్షిణదేశం అనడం ఎందుకు? మదరాసు రాష్ట్రం అనే అన వచ్చును కదా! అలా అనకపోవడానికి కారణం స్పష్టంగా కనబడుతూనే వుంది. మదరాసు రాష్ట్రాన్ని కేంద్ర ప్రభుత్వం సరిగా చూటడం లేదంటే, ఎవరైనా నవ్వు తారు. వింధ్యపర్వతాలకు దక్షిణాన వున్న ప్రాంతాన్ని అంతటినీ, దక్షిణదేశంగానే ఉత్తరాదివారు పరిగణిస్తారు. అంచేత, దక్షిణదేశంపట్ల కేంద్ర ప్రభుత్వం శీతకన్ను వేసిందంటే, నిజమే ననిపిస్తుంది. అలా అని, దక్షిణదేశం అంటే తమిళదేశమే నన్నట్టుగా వాదించి, కేంద్ర పరిశ్రమలను మదరాసులోనే స్థాపించేటట్టు చేసికోవడం మదరాసు ప్రభుత్వానికి అలవాటయింది. ఈ విధంగా చెయ్యడం వల్ల, మధ్య ప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, కేరళ రాష్ట్రాల అభివృద్ధికి నిరోధం కలుగు

తున్నది. వింధ్యపర్వతాలకు దక్షిణాన వున్న రాష్ట్రాలలో పారిశ్రామికంగా చాలా ముందుకు వచ్చిన రాష్ట్రాలు మదరాసు, మైసూరు రాష్ట్రాలు.

కేంద్ర ప్రభుత్వపు ప్రాజెక్టులూ, పరిశ్రమలూ మొదలైనవాటి స్థాపనను గురించి, ఇకముందు ఏ ప్రసక్తి వచ్చినా, పేరు పేరు వరసనా రాష్ట్రాలను ప్రత్యేకం పేర్కొని, ఏ రాష్ట్రం వెనకబడి వుందో దానిలో కొత్త పరిశ్రమలను స్థాపించాలనే నిర్ణయం జరగాలి గాని, దేశం మొత్తాన్ని ఉత్తరదేశం, దక్షిణదేశాలుగా భాగించి, ఉత్తరదేశం అంటే మహారాష్ట్ర గుజరాత్ రాష్ట్రాలనీ, దక్షిణదేశం అంటే మదరాసు రాష్ట్రం అనీ పరిగణించడం ఎంతమాత్రం పనికిరాదు.

మదరాసు రాష్ట్రం పారిశ్రామికంగా చాలాముందుకు వచ్చింది. ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలలో కూడా, మదరాసు రాష్ట్రంలో నివసిస్తూ వున్నట్టే మనుష్యులు నివసిస్తున్నారు. వారికీ పరిశ్రమలు కావాలి. వారూ బాగు పడాలి. అంచేత, మదరాసు, మైసూరు రాష్ట్రాలతో సమానంగా పారిశ్రామికాభి వృద్ధి యీ రాష్ట్రాలలో కూడా ఏర్పడేవరకూ, కేంద్ర ప్రభుత్వం దక్షిణదేశంలో పెట్టదలచిన పరిశ్రమ లన్నీ ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలలోనే పెట్టాలి. ఈ విషయంలో యీ మూడురాష్ట్రాలలోని పార్లమెంటు సభ్యులు ఏమాత్రం మెత్తబడకూడదు.

ఇప్పుడు మన రాష్ట్ర ప్రభుత్వమూ, మన పార్లమెంటు సభ్యులూ పట్టు పట్టవలసిన విషయం, ఉక్కు ఫాక్టరీని గురించి, కొత్త ఉక్కుఫాక్టరీని సేలంవద్ద స్థాపించవలసిం దని మదరాసు ప్రభుత్వం పట్టుపడుతున్నది. సేలంవద్ద ఉక్కు ఫాక్టరీని కేంద్రప్రభుత్వం స్థాపించక పోయినట్లయితే, తామే స్థాపిస్తామని కూడా మదరాసు ప్రభుత్వం బెదరిస్తున్నది. ఎన్నో పరిశ్రమలను తాము ముందు ఆరంభించడం, కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి వాటికి సంపూర్ణ సహాయాన్ని పొందడం, మదరాసు ప్రభుత్వం ఒక చక్కని మార్గంగా కనిపెట్టింది; ఆ మార్గంలో నడుస్తున్నది. అంచేత, ఉక్కు ఫాక్టరీకికూడా యీ మార్గాన్నే అవలంబించాలని చూస్తున్నది. మదరాసు ప్రభుత్వం సేలంలో ఉక్కు ఫాక్టరీని స్థాపిస్తే, మైసూరులో తామూ ఉక్కు ఫాక్టరీని స్థాపిస్తామని మైసూరు ముఖ్యమంత్రి నిజలింగప్పగారు బెదరిస్తున్నారు. ఇక ఆంధ్రుల మాట ఏమిటి ? ఆంధ్రదేశంమాట ఏమిటి ? ఆంధ్ర నాయకుల మాట ఏమిటి ?

ఏమైనా సరే. కొత్త ఉక్కుఫాక్టరీని ఆంధ్రదేశంలోనే పెట్టాలి. కేంద్ర ప్రభుత్వాన్ని మనం ఒత్తిడి చెయ్యాలి. మొదట ఆంధ్రదేశంలో పెట్టిన తరువాత, క్రమంగా ఇంకా ఎక్కువగా ఉక్కు ఫాక్టరీలు అవసరమైతే మైసూరు, మదరాసు రాష్ట్రాలలో కూడా పెట్టుకోవచ్చును. ఉక్కు ఫాక్టరీని కోరండంలో మనం దురాశ

చూపడం లేదు. అన్యాయంగా, అనర్హతతో. మనం ఇలా కోరడంలేదు. మన రాష్ట్రంలో దొరికే ముడిఇనుము శ్రేష్ఠమైన తరగతికి చెందనదని రుజువైంది. ఉక్కు ఫాక్టరీని పెట్టడానికి తగిన వసతు లన్నీ మన కున్నవి. పైగా, తగినన్ని పరిశ్రమలు లేక మన రాష్ట్రం కృషి చేస్తున్నది.

ఇటీవల తిరుపతిలో. భారత ప్రధానమంత్రి లాల్‌బహదూర్‌శాస్త్రి. ఉక్కు పరిశ్రమశాఖామంత్రి శ్రీ సంజీవరెడ్డిని ప్రశంసిస్తూ, ఆంధ్ర దేశంలో శ్రీ సంజీవ రెడ్డి ఉక్కు ఫాక్టరీని స్థాపించగలరేమో అన్నారు. కాని, అలా అన్న వెంటనే తమ మాటను దిద్దుకొని తాము ఛలోక్తిగా మాత్రమే అలా అన్నా మన్నారు. ఛలోక్తిగా అన్నా, ఫలోక్తిగా అన్నా. ఆ మాటను నిజం చెయ్యవలసిం దని, ప్రధానమంత్రిని ఆంధ్రు లంతా అడగాలి.

సేలం ఉక్కు ఫాక్టరీ విషయంలో ఉదాసీనత చూపుతున్నా రనే నెపంతో, శ్రీ సంజీవరెడ్డిమీద మదరాసు మంత్రులూ, పార్లమెంటు సభ్యులూ కోరచూపులు చూస్తున్నారు. సుప్రీంకోర్టులో ఎన్నికల పిటిషను విషయమై ఇవ్వబడిన తీర్పు శ్రీ సంజీవరెడ్డిగారికి వ్యతిరేకంగా వున్నందున, ఆయన రాష్ట్ర ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇవ్వడం జరిగిం దనీ, అలాంటి వ్యక్తిని కేంద్ర మంత్రిగా తీసుకోకూడ దనీ ఆ మధ్య కొందరు పార్లమెంటు సభ్యులు ప్రధాన మంత్రికి ఇచ్చిన పిటిషనుకు, చాలామంది మదరాసువారి ప్రోద్బలమే కారణ మని వదంతులు ఉన్నాయి. ఇదే నిజమైతే. గురివిందగింజ సామెత జ్ఞాపకం వస్తున్నది.

ముంద్రాకు లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషను అప్పు యివ్వడం విషయంలో టి. టి. కృష్ణమాచారిగారిని గురించి, ఒక న్యాయమూర్తి ప్రకటించిన అభిప్రాయం వల్ల టి. టి. కృష్ణమాచారిగారు పూర్వం తమ మంత్రిపదవికి రాజీనామా ఇవ్వలేదా? మరి, మళ్ళీ మంత్రిగా ఆయనను నియమించడం జరిగిందే? పార్లమెంటు సభ్యులు, యీవిషయమై పిటిషను పెట్టలేదేమి? ఇలాంటి అభ్యంతరం, ఆంధ్రుడికి మాత్రమేనా?

ఎక్కువ శోచనీయమైన సంగతి ఏమిటంటే, శ్రీ సంజీవరెడ్డిగారికి ప్రతికూలంగా కొందరు ఆంధ్రులుకూడా పని చెయ్యడం.

ఆంధ్రుల తరఫున ఆందోళన చెయ్యడానికి ఒక ఇంగ్లీషుపత్రిక లేదు; ఆంధ్ర నాయకులలో ఐక్యత లేదు.

ఆంధ్రులకు వ్యతిరేకంగా, ఆంధ్రాభ్యుదయానికి వ్యతిరేకంగా ఆందోళన చెయ్యడానికి ఎన్నో ఇంగ్లీషు పత్రికలు ఉన్నాయి; చుట్టుప్రక్కల వున్న రాష్ట్రాలలోని నాయకులమధ్య యీ విషయంలో ఎంతో ఐకమత్యత ఉన్నది.

ఇవన్నీ చూసిఅయినా మనం జాగరూకతతో మెలగవద్దా!





# పనిలేని మంగలి

ప్రేమబంధం కేవలమూ ప్రేమికుల మధ్యనే ఉంటుంది. ఒక అమ్మాయీ, ఒక అబ్బాయీ ఒకరి నొకరు చూసి, ఒకరి నొకరు తెలుసుకుని, ఒకరి నొకరు ప్రేమించుకోటానికి సాధారణంగా మూడోవాడి అనుమతీ, సలహా, సహకారమూ, ప్రేరణా వగైరాలతో నిమిత్తంలేదు.

వివాహబంధం అలాంటిదికాదు. దానికి ఎందరి ప్రమేయమో ఉంటుంది. అమ్మాయి తల్లికీ, తండ్రికీ, అన్నకూ, చెల్లెలికీ, తమ్ముడికీ అబ్బాయి నచ్చాలి. అబ్బాయి హోదా నచ్చాలి. అబ్బాయి ఆస్తినా, వాళ్ళ ఇల్లూ, గృహాలంకరాలూ, అబ్బాయికి కాబోస్తూ, తల్లికన్న ఎక్కువగా ఉంటున్న పిన్నీ – అంతా నచ్చాలి. ఇవన్నీ వివాహబంధంలో పేటలు! వాటిలో ఏ పేట బలహీనంగా ఉన్నా వివాహబంధం దుర్బలమవుతుంది.

వివాహబంధం సాంఘిక స్వభావం కలది. పరువుగా బతుకుతూ సాంఘిక సంబంధాలను గౌరవించే అమ్మాయీ, అబ్బాయీ ప్రేమబంధాన్ని సంఘపరంగా చేసి వివాహబంధంగా మార్చేస్తారు. (సంఘనియమాలను ధిక్కరించేవాళ్ళు మిగిలిన సాంఘిక బంధాలన్నిటినీ తెంపేసుకుని యథేచ్ఛగా ప్రేమలోనే జలకాలాడవచ్చుగాక; వాళ్ళకథ వేరు).

ప్రేమబంధం వివాహబంధానికి జోడించటంలో రెంటికీ సమన్వయం కుదరకపోతే చిక్కులు తప్పవు. రెంటి మధ్యా ఘర్షణ ఆరంభమవుతుంది. ప్రేమబంధం సంస్కారాల సామరస్యం ద్వారా ఏర్పడుతుంది. వివాహబంధం భిన్నసంస్కారాలను ఏకం చెయ్యకపోగా, వాటిమధ్య గల వైరుధ్యంద్వారా నలిగిపోతుంది.

తనకన్న ఉన్నత స్థితిపరుడ్ని ప్రేమించి పెళ్ళాడిన అమ్మాయి అతని జీవితాన్ని, అందులోని కష్టనష్టాలనూ పంచుకోవటానికి సంతోషంగా ఒప్పుకుంటుంది. కాని ఐశ్వర్యమదంతో మాట్లాడే తల్లినోరు కట్టలేదు. తల్లి సంస్కారం తన సంస్కారం కాదు;

అయినా తల్లి తల్లికాకుండాపోదు. అది సంఘ నియమాలవల్ల ఏర్పడిన బంధం. తల్లికి చెప్పగలదు, కాని వినేటట్టు చెయ్య లేదు. తల్లితో తాను సరిపెట్టుకో గలదే గాని భర్తను సరిపెట్టుకోమని శాసించ లేదు. ("నామీద ప్రేముకొద్దీ మా అమ్మను సహించు." అని భార్య భర్తతో అంటే అనవచ్చు; ప్రేమపేరిట త్యాగాలు చెయ్యమన్నట్టే ఇలాటి ఆంక్షకూడా పెట్టవచ్చు. కాని అది చచ్చు సినిమా డయలాగవుతుంది. కాని సంస్కారం గల పాత్రయొక్క లక్షణంకాదు.)

అయితే అల్లుడు అత్తగారి పేలాపనలు సహించాలన్న సాంఘికనియమం ఎక్కడాలేదు. ఆ భార్య తనమాట తల్లిచేత ఎంత వినిపించగలదో భర్తచేతా అంతే వినిపించగలదు. సంఘం గోదాలో తల్లి సంస్కృతికీ, భర్త సంస్కృతికీ లడాయి సాగితే మధ్య నలగటంతప్ప ఆమె చేయగలది ఏమీలేదు. ఇద్దరికీ ఆమె కావాలి; ఆమెను తమవేపు లాగటాని కిద్దరూ యావచ్ఛక్తీ ఉపయోగించి ఆమెను జరాసంధుణ్ణి చీల్చినట్టు చీల్చ యత్నిస్తారు.

ఈ ప్రచ్ఛన్న సమర సంఘర్షణలో ముందు తెగిపోయేది వివాహబంధం.

ప్రేమించుకున్నవాళ్ళు కాస్తా విడిపోతారు. ఈ ఏర్పాటును చట్టరీత్యా ఖరారు చేసి, లీగల్‌గా భర్తనుంచి విడాకులు పొందమని అమ్మాయికి అయిన వాళ్ళు సలహా ఇస్తారు. వాళ్ళ దృష్టిలో ప్రేమబంధ మనేదానికి విలువలేదు.

కాని ప్రేమబంధం ఎక్కడ తెగింది? భార్యాభర్తలు ఒకరి కొకరు ద్రోహం చేసుకోలేదు (సినిమాల్లోలాగా); ఒకరి మీద ఒకరు లేనిపోని రంకులు కట్టుకో లేదు; అర్ధోక్తులు (మాత్రమే) విని ఒకరి నొకరు శంకించలేదు. భర్త దృష్టిలో భార్య ఒక తప్పుచేసింది — ఆమె సాంఘిక బంధాలను తెంచేసుకోలేదు; వాటిని తెంచేసుకుని అచ్చగా ప్రేమబంధానికే కట్టుబడి ఉండలేదు. కాని భర్త చేసినది మాత్రం ఏమిటి? అతను తన భార్య తాలూకు సాంఘిక బంధాలను ఉపలక్షించి అచ్చగా ప్రేమబంధాన్నే నమ్ముకుని ఉన్నట్టయితే భార్య మనస్సుకూ, ప్రాణానికీ హాయి కలిగించి ఉండేవాడు. అతను తన భార్యలో చూసిన తప్పునే తనలోకూడా చూసినట్టయితే ఆమె పులిలాగా అతనిపై కలియబడవలసిన పరిస్థితి ఏర్పడి ఉండకపోను. అటువంటి దానికి ఆమెను పురికొల్పినదికూడా ప్రేమే — అవమానానికి గురి అయిన ప్రేమ.

కనక ప్రేమబంధం అలాగే ఉండిపోయింది, పైకి కనిపించకుండా, నివురు కప్పిన నిప్పులాగా. తన పక్షాన ప్రేమ బంధం తెగలేదని ఆమెకు తెలుసు. భర్త పక్షాన కూడా అదేపరిస్థితి అని తెలియ వచ్చింది. ఆమె ఎమ్మెపరీక్షకుకూర్చుంటే అతను రిజల్టుకోసం తహతహలాడాట్ట!

ఫస్టుక్లాసులో పాసయిందంటే, తానే పాసైనంతగా సంతోషించాట్ట!

అయినప్పటికీ ఆమె కేదో భ్రమ_ వివాహబంధం తెగిపోయినతరవాత తన కేదో మనశ్శాంతి ఉంటుందని ! అది భ్రమ అనీ తెలుసుకోవడమే ఆమె నేర్చుకునే గుణపాఠం. సాంఘిక సంబంధాలన్నిటిలోనూ అశాంతి ఉన్నది. మొగుణ్ణి వదిలేసిరాగానే అయినవాళ్ళే సర్కసు జంతువును చూసినట్టు చూశారు ! తరవాత విడాకులకు దావా వెయ్యటానికి పత్రాలపై సంతకాలు పెట్టుకున్నారు. మనశ్శాంతికోసం పెట్టింది మనశ్శాంతికి ఆస్కారం లేదని తెలుసుకుని పత్రాలు చించేసింది. మళ్ళీపెళ్లి చేసేసుకోమన్నారు_ సంఘ నియమాలలో ఆమె కున్న విశ్వాసంలో వాళ్ళకు శతాంశంలేదు ! పుట్టింటి వాతావరణంలో శాంతి లేక ఉద్యోగం కోసం పల్లెటూళ్లు పట్టిపోయింది. అక్కడా శాంతిలేదు. వివాహబంధాన్ని తెంచుకోవటంవల్ల తనకు ఒరిగిన దేమీ లేదు, ప్రేమబంధం నిష్ప్రయోజనం కావటంతప్ప తిరిగి భర్త దగ్గిరికి వచ్చేసింది ప్రేమబంధాన్ని పాటించక పోవటం తప్పయిందని భర్తా, వివాహబంధాన్ని పాటించకపోవటం తప్పయిందని భార్యాకూడా తెలుసుకున్నారు.

* * *

తెలుగు సాంఘిక చిత్రాలలో నిజమైన సంస్కారం గల పాత్ర ఉండటం చాలా అరుదు, ప్రేమను గురించీ, త్యాగాన్ని గురించీ కృతక సంస్కారాన్ని ప్రదర్శించే పాత్రలు కొల్లలు. అందుచేత భరణీవారి "వివాహబంధం" చూసినప్పుడు ప్రాణం లేచివచ్చినట్టనిపించింది. అయితే, కృతక సంస్కారమూ, అశ్లీలధ్వనితో కూడిన ప్రేమ యుగళగీతాలూ, దారుణ ప్రమాణాలూ ఆవీ ఉంటేనేగాని ప్రేక్షకదేవతలు చిత్రాలను ఆశీర్వదించరని వినికిడి. అందుచేత, వాస్తవ మనస్తత్వాలూ, నిజమైన సంస్కారం గల పాత్రలూ, లోతైన సాంఘిక సమస్యా గల ఈ చిత్రాన్ని భరణీవాళ్లు ఎన్నిగుండెలతో తీశారా అని ఆశ్చర్యంకూడా కలిగింది.

మంచికథను తప్పుడు నటనతోనూ, డైరెక్టరుతోనూ ఖూనీ చెయ్యవచ్చు. ("కన్యాశుల్కం" చూశాంగదా!) కాని వివాహబంధంలో సాంకేతిక, కళా సంస్కృతులు ఇతివృత్తానికి అనుగుణంగా ఉన్నాయి.

నటనమాటకు వస్తే మన సినిమా చిత్రాలలో మంచినటన అనదగినది చాలా అరుదుగా ఉంటున్నది. దానికి కారణం మన సినిమా కథలలోని పాత్రలు కృత్రిమంగా ఉండటం ; సన్నివేశాలలో సహజత్వం లోపించడం. ఇతను హీరో, ఈమె హీరోయిన్ అని ప్రేక్షకులకు చిత్రం పూర్తికాకపూర్వమే తెలిసిపోయింది. వాళ్ళు తెరమీద ఒకరినొకరు

చూసుకోగానే గ్లాసెడు మంచినీళ్ళయినా అడగకుండా అమాంతం ప్రేమించు కుంటారు. వాళ్ళిద్దరిమధ్యా ప్రేమ ఏర్పడ టానికి ప్రత్యేక కారణ మేమీ ఉండదు-వాళ్ళు హీరో హిరోయినులు కావటం తప్ప. ప్రేమించుకోవటం విషయంలో లాగే సినిమాపాత్రలు ఏడవటం విషయం లోనూ, కోపం వచ్చి రంకెలు పెట్టటం విషయంలోనూ, ఆనందంతో అల్లీ బిల్లీ తిరగటం విషయంలోనూ మితిమీరిన తొందరపాటూ, ఆత్మనిగ్రహ రాహిత్యమూ చూపిస్తాయి.

అలాటిపాత్రలను సమర్థులైన నటులు కూడా "బాగా" నటించటం కాస్త కష్టమే. దానికి తగ్గట్టు మన నటులలో తారత్వానికీ, నటనా సామర్థ్యానికీ పొంతనలేదు. తాము చేసినదే గొప్ప నటనగా, తమ నోట వచ్చినదే గొప్ప వాచికంగా చలామణీ అవుతున్న తారలు మనకు లేకపోలేదు.

ప్రతి నరానా పాత్రను లీనంచేసి నటించగల నటి భానుమతి అని "వివాహ బంధం" ఒక్కటి చూసి చెప్పవచ్చు. "భారతి" పాత్రయొక్క మనస్తత్వంలో ప్రతి సున్నితమైన మార్పునూ ఆమె తన నటనలో స్పష్టం చేసింది. వాచికం విషయంలోకూడా భానుమతితో పోటీ చెయ్యగలవారు ఒకరిద్దరుకూడా గట్టిగా లేరని పనిలేనిమంగలి దృఢవిశ్వాసం. సంభాషణలతాలూకు వాక్యాలను నటులు ఉచ్చరించేటప్పుడు వాక్యార్థంకూడా సమగ్రంగా వ్యక్తం చెయ్యలేని మేటినటులు మన కున్నా రన్నది అబద్ధంకాదు. వాక్యార్థంతోబాటు పాత్రయొక్క మానసిక స్థితినికూడా సమగ్రంగా వ్యక్తం చెయ్యగలదే ఉత్తమ తరగతి వాచికాభినయం. అది భానుమతికి కరతాలామలకం.

చిత్రానికి డైరెక్ట రంటూ ఒక డుండి, నటులు సరిగా అభినయించేటట్టూ, సంభాషణలు సరిగా చెప్పేటట్టూ చూసేమాట నిజమే. కాని డైరెక్టరు చెప్పి చేయించుకోలేని నటనా, వాచికమూ ప్రదర్శించట మే నటుల కళావైశిష్ట్యం.

రామారావు "ప్రొఫెసరు" పాత్రను కూడా ఎంతోసమర్థతతో నిర్వహించాడు. తన వ్యక్తిత్వాన్ని పాత్రలో లీనం చెయ్యటమనేది రామారావు అనేకసార్లు ప్రదర్శించిన విద్యే. భార్య క్రోధ కోపోద్రేకాలతో తనపైన కలియబడిన ఘట్టంలో రామారావు ఒక్కమాటగాని, ఒక్క ఆంగిక సంచలనంకాని లేకుండా ఆశ్చర్యమూ, కోపమూ, నిగ్రహమూ ప్రదర్శించిన తీరు పనిలేనిమంగలిని ఆశ్చర్యచకితుణ్ణి చేసింది.

ఒక నటుడుగాని, నటిగాని తమ పాత్రలను "అద్భుతంగా" నిర్వహించారని తేలికగా అనెయ్యవచ్చు. కాని దానికి గీటురాయి ఏమిటి? ఆ పాత్రను ఆ నటుడుగాని, నటిగాని తప్ప వేరొకరు నటించగా విమర్శకుడు ఊహించలేకపోవటం "అద్భుతనటన" అన్నదానికి

ప్రమాణం. వివాహబంధంలో నాయికా నాయక పాత్రలను భానుమతీ రామారావులు కాక మరొకరు ధరించిఉంటే ఎట్లా ఉండేదీ పనిలేనిమంగలి ఊహకు అందకుండా ఉన్నది.

* * *

ఇది రాయటానికి పూనుకున్నది "వివాహబంధం" చిత్రాన్ని సమీక్షించటానికికాదు — సాహిత్య గౌరవం గల ఒక తెలుగుచిత్రాన్ని గురించి పనిలేని మంగలికి కలిగిన భావాలు "యువ" పాఠకులతో పంచుకోవటానికిమాత్రమే.

ఈ సాహిత్య గౌరవాన్ని చిత్రానికి కలిగించటంలో తోడ్పడిన పిచ్చేశ్వరరావు కౌశలాన్నిగురించి చెప్పకుండా ఉండట మెలాగ?

చిత్రానికి రచన పునాది. రచన అన్నది కత్తిమీది సాము. ''పడికట్టురాళ్ళ'' లాటి సన్నివేశాలూ, పాత్రలూ, మనస్తత్వాలూ, ట్రీట్‌మెంటూ గల చిత్రాలకు రాసేవాడికి తడువుకో నవసరం లేకుండా ''పడికట్టు రాళ్ళ'' లాటి సంభాషణలూ, సమాధానాలూ సినిమా మార్కెట్టులో కొల్లలుగా ఉన్నాయి. కాని సజీవ పాత్రలు ఏక్షణాన, ఏసందర్భంలో తమ ఉద్రేకాలను ఎంతమోతాదులో ప్రదర్శించేదీ తూచి రాయటానికీ, వాస్తవికతను కాపాడుకోవటానికీ, వీటితోబాటు రసస్ఫూర్తి సాధించడానికీసిద్ధహస్తంకావాలి. ఒక్క పొర్లుమాట — ఒక్క మోతాదును మించిన వికారపదం — పాత్రనూ, సన్నివేశాన్నికూడా ఖూనీ చేసెయ్యవచ్చు. అటువంటి పొరపాటు పొరపాటునకూడా దొర్లకుండా రచనచేసిన పిచ్చేశ్వరరావు రచన ఎంతో గొప్ప దనాలి.

మొత్తంమీద భరణీసంస్థ ఆంధ్రులకు ఎంతమంచి సాంఘికచిత్రం అందించింది! సాధారణంగా తెలుగుచిత్రాలు చూసి వాటిలో ఉండే ఘోరమైన లోపాలు జనానికి ఏవగింపు కలిగిస్తే పాపం చిత్రనిర్మాత లెంత నష్టపోతారోగదా అని భయపడే పనిలేనిమంగలి, ఈసారి ''వివాహబంధం'' లాటి ఉత్తమచిత్రాన్ని జనం ఆదరించకపోతే తెలుగుసినిమా కళకు భవిష్యత్తు ఏమిటోగదా అని భయపడే స్థితిలోపడ్డాడు.





రా హు వు




చెన్నకేశవులు అన్నిటికీ తెగించి మరీ కూచున్నాడు. బాగా పదునుపెట్టి వెంట తెచ్చుకున్న గీతకత్తి, గడ్డివాము నానుకునివున్న వేపచెట్టు కొమ్మల్లోంచి తొంగిచూసిన చంద్రుడికళ్ళను జిగేలు మనిపించింది. అతడు చేరగిలబడి కూచున్న గడ్డివామివెనక పందికొక్కులో, వెంట్రవలో గుర్రుగుర్రుమంటూ చావు బతుకుల పోరాటం చేస్తున్నవి. వామి చుట్టూవున్న చిళ్ళకంప కొమ్మల రెమ్మల మధ్య గూడుకట్టుకున్న గువ్వ పిట్టల జంట బెదిరి కుర్ కుర్ మన్నది.

చెన్నకేశవులు కూచున్నచోటునుంచి లేచి, చిళ్ళకంచె దగ్గిరకుపోయి మోకాళ్ళమీద వంగి డొంకకేసి కళ్ళు చికిలించిచూశాడు డొంక నిర్మానుష్యంగా

వున్నది. డొంకకు రెండువైపులా చిత్తవొత్తుగా పెరిగిన ఈత చెట్ల చీకటినీడలకేసి పరీక్షగా చూశాడు. అక్కడేదో ఆకారం ఒకటి హఠాత్తుగా ఒక ఈతచెట్టుకిందనుంచి దెయ్యంలా గెంతి లేచినిలబడి, అతడున్నచోటుకేసి, గబగబా నడిచిరావటం కనిపించిందతడికి.

"పారబడ్డాను. ఇద్దరనుకున్నాను, ఒక్కళ్లాగే వుంది." అనుకుంటూ కేశవులు తలకుచుట్టుకున్న తుండుగుడ్డను ఊడదీసి, అందులో గీతకత్తిని భద్రంగా చుట్టి పట్టుకొని, నక్కుతూ వెళ్ళి, గడ్డివామికి ఒకపక్కగా వంగినిలబడ్డాడు.

ఈతచెట్ల నీడలవాటునుంచి పిశాచంలా కప్పిగంతేసిబయలుదేరిన ఆకారం సూటిగా పెళ్లకించెదగ్గరకు వచ్చి, లోపలకొచ్చేదారికి అడ్డంగా పెట్టిన వాసాల్లోనుంచి లోపలకు దూరుతూ, "కేశవులూ, జాగ్రత్తరోయ్, గీతకత్తితో మెడ తెగేశేవ్!" అంటూ కేకవేసింది.

కేక వింటూనే, ఆ గొంతు గుర్తుపట్టిన చెన్నకేశవులు వామిచాటునుంచి బయటికొస్తూ, "ఎవర్రా...బొబ్బిలా? గీతకత్తేంటి?" అన్నాడు.

బొబ్బిలి పిచ్చెత్తినవాడిలా కాండ్రించి నవ్వుతూ, "తెలుసురోయ్, కేశవులూ నీ యవారం అంతా తెలుసురోయ్ అరకోసెడంలో చెట్టుకింద పొంగి కూచున్న నాకు, వెన్నెలంది ఆ గీతకత్తి మెరవటం కంటబడింది. ఆ పళాన లేచి బయల్దేరాను. ఆహా! మనోడే కేశవులు అన్న దయిర్యంతో!" అన్నాడు.

"ఇక్కడికి రాటానికి దయిర్యం ఎందుకు? మనం యిరోదోళ్ళం కాదే!" అన్నాడు కేశవులు.

"మనం కావనుకో, నువ్వు కాపలా ఏసినావ్ ఎవ్వరో నీకు తెలిస్తే సిక్కలేదు. ఆళ్ళే నేననుకొని, నీకటి మాటున కత్తిసురుతావేమో అని బయపడ్డాను" అంటూ బొబ్బిలి, వామిలోగడ్డిని చేతుల్తో తడువుతూ, ఒకచోటఆగి, "యిక్కడేగా నీ దాపరికం. ఎన్నికాయలు దాశావ్? నా కోటి సాలు." అంటూ గడ్డిలోనుంచి రెండు సీసాలు బయటికి లాగాడు.

కేశవులుముఖం కందగడ్డలా అయింది. కళ్ళు చింతనిప్పుల్లా కణకణమన్నాయి. అతడు ఒక్కఎగురున వెళ్ళి, బొబ్బిలి చేతుల్లోనుంచి, రెండు సీసా కాయలూ లాక్కొని, "రోజూ రాత్రేళ నాకన్నుగప్పి దొంగమేత మేసేవాళ్ళలో నువ్వుకూడా వున్నావా?" అని అడిగాడు.

"నేనా! ఛీ ఛీ. ఆ దగుల్బాజీ వెధవలిద్దరితోనే యాకమవుతా ననుకున్నావా? ఏంమాటరోయ్, కేశవులూ!" అన్నాడు బొబ్బిలి కాసకోపంగా.

"వాళ్ళల్లోఓడివికాపోతే, సీకీకాయలు వామిలో ఒక్కడ దాచింది ఎలా తెలిసింది? వాళ్ళిద్దరన్న మాట ఎలా ఎరిక?" అని నిలదీశడిగాడు కేశవులు.




"వీడు బొబ్బిలికాదురా, బెబ్బులి! అదేరా, మాఅయ్య పెట్టినపేరు నిలుపుకొస్తున్నా. యీ ముప్ఫై ఏళ్ళనుంచీ దొంగసారా అమ్మకు బతకటమే నీశం. ఆది దొంగతనంగా తాగిపోటం అంతకన్నా నీశం," అన్నాడు యీసడింపుగా.

"అయితే, యీ గొడవంతా నీకెలా తెలిసింది?" అన్నాడు కేశవులు కొంచెం స్థిమితపడుతూ.

"నిన్న తెల్లారుజామున బస్తీకి పోతూంటే, ఆళ్ళిద్దరూ ఆ దొంక మలుపులో నా కెదురుపడ్డారు. ఇద్దరూ తూలిపడి లేస్తున్నారనుకో, లొల్లాయి పదాలుకూడా పాడుతున్నారు. నిలదీసి అడిగి, టలాయించబోతే, చాచి రెండిచ్చుకున్నాను. అంతా చెప్పేశారు. నువ్వెవరికోసమో వామిలో దాశిపోతున్న రెండుకాయలూ పదిరోజులుగా వాళ్ళు దొంగచాటుగావచ్చి తాగేశిపోతున్నారట. ప్రాణాలు తీసేస్తానని సెప్పాను. ఇక యిటుకేసి రామన్నారు. ఆమాట నిలుపుకుంటారో లేదో సూద్దామని కొంతా... ఏదోకాస్తకుతెక్కి కొంతా, ఆఈతచెట్లెనక కావలా ఏశాను. నీసేతిలో గీతకత్తి తళుక్కుమన్నది. ఆ అహా, మనోడే ఆళ్ళగొంతులు కోసెయ్యటానికి రడీగా వున్నాడని తెలుసుకుని యిటొచ్చాను. నువ్వేమో నన్నే దొంగముండావాడికింద కట్టి మాట్టాడేస్తన్నావు" అన్నాడు బొబ్బిలి గుక్కతిప్పుకోకుండా.

"ఇదంతా నమ్మమంటావురా, బొబ్బిలీ! నా మీద ఒట్టేనా? సరే, ఆ దొంగలంజీ

కొడుకు లిద్దర్నీ చూశావు, ఆళ్ళు సెప్పిందంతా యిన్నావు ఇక పద . . రేపు కోరట్లో నువ్వు నాకు సాచ్చీకం పలకాల." అంటూ కేశవులు, కాపుసారా కాయలు రెంటినీ తిరిగి గడ్డివాములో దాచబోయాడు.

బొబ్బిలి ఒక్క ఎగురున వెళ్ళి, కేశవులు చేతిలోంచి ఒకసారాకాయి వూడలాక్కుని, "ఆ కోరటూ, సాచ్చీకం మాట సరేలేరా, కేశవులూ! దొంగసారా అమ్ముకునేవాడివి కోరటులో కెలా పోతావ్? ముందు కాస్త గొంతు తడి సేసుకోనీ!'' అంటూ కాయకు బిగించిన మొక్కజొన్నబెండు మూతను ఆత్రంగా గుంజబోయాడు

చెన్నకేశవులు బరిశె పోటు తిన్న వాడిలా ఒక గావుకేక పెట్టి, ''చస్తావురో బొబ్బిలీ, తాక్కు తాక్కు... తాక్కు!'' అంటూ బొబ్బిలిమీద కలియబడ్డాడు.

ఆ సరికి బొబ్బిలికి రోషం, కోపం గుండెలకు ఎగదన్నింది. కేశవులు వాలకం అతడికి చిర్రెత్తించింది. చేతులో వున్న సారకాయితో కేశవులు గుండెల్లో గట్టిగా ఒకపోటు పొడిచి, అతడు వెనక్కు పడబోయేంతలో ఆపి, జుట్టు పట్టుకుని, "ఏరా, నాతో పరాచికాలతో మొదలెట్టి కు సీపట్టుకే తయారయ్యావా? నీ క్కావలసింది ఎదవడబ్బులే గందా. ఇదో, రొండీనున్నై తీసేసుకో. కాపు సారా అమ్ముకు బతికే పెక్కులకొడుకువి, నా మీద కలబడతావా? చిల్చేస్తాను, అంటూ అరిచాడు

కేశవులు అటూయిటూ గుంజుకుని, బొబ్బిలి చేతిలోంచి జుట్టువిడిపించుకుని వగరుస్తూ, "నేను డబ్బుకోసం గడితినే వాణ్ణనుకోకురా, బొబ్బిలీ అసలు సంగతేందో చెప్పేస్తాను......అరె, మూత తియ్యకు, ఇక్కడ వామిలో నేను రహస్యంగా దాచుకుపోయిన సారా, దొంగతనంగావచ్చి తాగిపోయే ఆళ్ళెవరినీ అతమార్చేందుకు,ఆ సారాలో యియ్యాళ ఎలికమందు కలిపాను. పెద్ద ఒట్టు,'' అన్నాడు.

"దొంగసారా యాపారంవోడి ఒట్టూ సొట్టూ ఎవణ్ణమ్ముతాడ్రా? ఎలిక మందు కలిపినోడివి అలా వూరుకోక, గీత కత్తెందుకు పట్టు కిక్కడ కూచున్నావ్? ఎహే, పోరా చుంచుమొహం." అంటూ బొబ్బిలి సీసామూత వూడలాగి, తాగేందుకు సీసా పైకెత్తాడు.

ఈసారి కేశవులు గుండెలు బద్దలయ్యేంత పెద్దగా, చుట్టుపక్కల కోసెడు దూరం వినపడేంత బిగ్గరగా ఒక్క కేక పెట్టి, బొబ్బిలిమీదికి లంఘించాడు. బొబ్బిలి ఆసరికే సీసాఎత్తి అందులోని సారా దాదాపుసగం గడగడా తాగిసేశాడు. కాపు సారాల రుచీ వాసనా బాగా తెలిసిన అతగాడికక్కా—యిందులో ఏదో కొత్త రకం వాసనా రుచీవున్నట్టు కనిపించింది. అంతలో కేశవులు అతడిమీద ఎను

బోతులా విరుచుకు పడ్డాడు. ఆ ధాటికి తట్టుకోలేక వెనక్కు పడబోయిన బొబ్బిలి, ఓ తృటికాలం కాళ్ళు నిలదొక్కుకుని, చేతిలోని సారాసీసా బాగా పైకెత్తి వూపి బలంగా, కేశవులు తలకేసి ఒక్క విసురు విసిరాడు. కాని, అదృష్టంకొద్దీ ఆ దెబ్బ కేశవులి తలమీద కాక, భుజంమీదపడింది. కేశవులు ఒకచావుకేకపెట్టి, బొబ్బిలిని అమ్మనాలీ బూతులు



తిడుతూ, చాపచుట్టలా ధబీమని కింద పడిపోయాడు.

బొబ్బిలి యిదేం గమనించే స్థితిలో లేడు. సారా కడుపులోకిపోయి ఒకటీ రెండు నిమిషాలయిందో లేదో— అతడికి గుండె ల్నెవరో పటకారుతోపట్టి గుంజినట్టు బాధకలిగింది. గొంతు ఆర్చుకుపోసాగింది. కళ్ళు పైర్లుకమ్మినై. అతడు రెండు చేతుల్తో గొంతుపట్టుకుని ఎగశ్వాసా దిగశ్వాసా అయిపోతూ, "కేశవులూ, నువు సెప్పింది, నిజం!" అంటూ గడ్డివామిని ఆసరాగా పట్టుకు నిలబడబోయి, కాళ్ళుతేలిపోగా, నేలమీద బోర్లాపడిపోయాడు.

బొబ్బిలికి స్పృహ వచ్చినట్టయి. పరిసరజ్ఞానం తెలిసేసరికి, అతడు ముత్రాసోళ్ళ తాటితోపుకేసి నడుస్తున్నాడు ఆసరికి చంద్రుడు ఆకాశ మధ్యంనుంచి కిందికి బాగా దిగజారి, దాని అంచుపట్టుకు వేలాడుతున్నాడు. "ఇంటికెళ్ళే దారొదిలి, యీ దెయ్యాలతోపు కేసెందుకొచ్చానబ్బా!'' అనుకున్నాడు బొబ్బిలి. అతనికి దెయ్యాలభయం జాస్తి.

"ఎలికమందు కలిపిన సారా తాగి బయటిపడ్డాను. ఇంకా భూమ్మీద నూకలున్నయన్నమాట! ఇంటికే పోదాం. ఈ దెయ్యాలతోపులో కెందుకు?" అనుకుంటూ బొబ్బిలి వెనక్కు తిరగబోయాడు అంతలో తాటితోపు అంచునవున్న పెద్ద సరిగెనచెట్టుకొమ్మలు కిరకిర మన్నవి.

గుండె ఆగినంతపనై బొబ్బిలి అటుకేసి చూశాడు. అక్కడ కొమ్మలమీద నల్లని ముసుగులు కప్పుకూర్చున్నట్టున్న ఆకారాలు నాలుగైదు దతడికి కనిపించినై. బొబ్బిలికి గుండె ఆగిపోయినంతపనైంది. గిరుక్కున వెనక్కు తిరిగి దౌడుతీయబోయాడు. ఏదో ఆకారం ఒకటి దారికి అడ్డం నిలబడినట్టయింది. బొబ్బిలి కెవ్వుమని కేకవేశాడు.

"అంత బెదిరిపోతావేం, బెబ్బులీ! నే నెవరనుకున్నావ్? ధర్మయ్యని. ఆ వాములదొడ్లో ఒళ్ళు పై తెలియకండా పడున్న నిన్ను, యిక్కడదాకా చేతిఆసరాతో నడిపించుకొచ్చింది నేనే!" అన్నదా ఆకారం.

''ఎవరూ? ధర్మయ్యా? దెయ్యాలపోతు ధర్మయ్యా? చచ్చాన్రో బాబో!'' అంటూ బొబ్బిలి కీసుమని ఒక్కెగురెగిరాడు.

దెయ్యాలపోతు ధర్మయ్య, బొబ్బిలిని అంత ఎత్తున గాలిలో అలాగే పట్టుకుని సుతారంగా భూమ్మీద ఎత్తి కుదేస్తూ. "ఎందుకంత గాభరా పడిపోతావ్, బెబ్బులీ?" అని ప్రశ్నించాడు.

బొబ్బిలి నిలువెల్లా వణికిపోతూ, బొంగురు పోయిన గొంతుతో, "నువ్వు దెయ్యానివి. నాలుగైదేళ్ళ క్రితం నీశవం యీ ముత్రాసోళ్ళ తాటితోపు మధ్యన్న దిగుడుబావిలో తేలటం నేను చూశాను," అన్నాడు.




"అదంతా కనికట్టు! నేచేసిన పంపకందెబ్బ!" అన్నాడు ధర్మయ్య కోరమీసాలు మెలివేస్తూ.

"ఏం కనికట్టు? ఏదో చాతబడి చేశావని. మారయ్యగారి కుమారయ్య నీ పళ్ళూడగొట్టి, పలుగుతో గుండెల్లో పొడిసి ఆ దిగుడుబావిలో పారెయ్యలేదా?" అన్నాడు బొబ్బిలి, ధర్మయ్య ముఖంలోకి గుచ్చిగుచ్చి చూస్తూ.

"అదంతా కనికట్టు! నీ మేలుకే చెబుతున్నాను, నామాట నమ్ము. అదుగో, ఆ కనబడే దిరిశెనచెట్టుమీదో కుంకుడు చెట్టుమీదో దాక్కుందాం పద," అంటూ ధర్మయ్య, బొబ్బిలిచేయి పట్టుకున్నాడు.

బొబ్బిలి గుండె బితుకు బితుకుమంటూ ధర్మయ్య చెప్పిన దిరిశెనచెట్టుకేసి చూశాడు. ఆ చెట్టుకొమ్మల్లో నాలుగాకారాలు కూచునివున్నవి. తను అటుకేసి వస్తున్నప్పుడు చూసినట్టు, వాటికేమీ నల్లని ముసుగుల్లేవు, దయ్యాలమాదిరిగా.

"నే నింతకుముందా కొమ్మలమీద నల్లగా ముసుగులు కప్పుకున్న నాలుగు దెయ్యాల్ని చూశాను," అన్నాడు బొబ్బిలి.

"అదంతా నీ భ్రమ బెబ్బులీ! ఎలుకల మందు కలిపిన సారాతాగి నీ కళ్ళు చెదిరిపోయి అలాంటి భ్రమ కల్పించినై. ఇప్పుడు జాగ్రత్తగా చూడు ... తెలుస్తున్నదా? వాళ్ళు మనలాంటివాళ్ళే," అన్నాడు ధర్మయ్య.

గాతా త్తుగా బొబ్బిలికి మరింత పెద్ద నూనం కలిగింది. ఈ దెయ్యాల తు ధర్మయ్య తనని ఇంటికెళ్ళకుండా తపేందు కింత శ్రమెందుకు పడుతున్నాడు ఆ నలుగురూ మనుషులైతే, యీ చీకటి రాత్రివేళ చెట్టుకొమ్మలెక్కి ఎందు కూర్చున్నారు?

ఇలాంటి అనుమానాలేవేవో బొబ్బిలి మనసులో కదులుతున్నట్టు గ్రహించిన వాడిలా ధర్మయ్య పెద్దగా నవ్వి, "నీ కింకా కొత్త ... అంటే ... ఈ హత్యలు చేయటం...పోలీసోళ్ళకు దొర కకుండా దాక్కోవటం ... తెలిసిందా? ఆ కొమ్మల్లోవున్న నలుగురూ నీకన్న తక్కువ తినోళ్ళేంకాదు. నీవు చెన్న కేశవుల్ని చంపినట్టే, వాళ్ళూ తలా ఒకణ్ణి చంపారు. పోలీసులకి దొరక్కుండా యీ తాటి తోపులోచేరి చెట్లకొమ్మల్లో దాక్కుని కాలం గడుపుతున్నారు. నువ్వూ, ఉరి శిక్ష తప్పుకోవాలంటే, యిక్కడ మాతో పాటు కొన్నాళ్ళపాటు కాలక్షేపం చెయ్యక తప్పదు," అన్నాడు.

తను చెన్నకేశవుల్ని సారాపీసాపెట్టి గట్టిగా నెత్తిమీద కొట్టినసంగతి అప్పటి గ్గాని బొబ్బిలికి గుర్తురాలేదు. వాడు నిజంగా చచ్చుంటాడా?

"కేశవులు నిజంగా సచ్చాడా ధర్మయ్యా?" అన్నాడు బొబ్బిలి.

"ఇంకా తెలీదు. చచ్చే వుండొచ్చు. నువ్వూ, వాడూ వాములదొడ్లో చేసిన ఆపిమహిరావణ యుద్ధం విని. గూడెంవాళ్ళు లాంతర్లూ, కర్రలూ తీసు కుని అక్కడ కొచ్చిపడ్డారు. వాళ్లొచ్చే సరికే నువ్వు యింత నెత్తురూ, యిన్ని పేగులూ వెళ్ళగక్కుని, ప్రాణం కడ ముట్టిపడున్నావు. కేశవులు కొనూపి రితో కుస్తీపట్లు పడుతూండగా, డోలీలో పడేసి వాళ్ళతన్ని బస్తీకి మోసుకు పోయారు," అన్నాడు ధర్మయ్య.

"మరి నన్నెలా వదిలారు వాళ్ళు?" అని ప్రశ్నించాడు బొబ్బిలి అనుమానంగా భయంగా ధర్మయ్య ముఖంలోకి చూస్తూ.

"అక్కడే ధర్మయ్య తెలివితేటలు బయటపడింది, దెయ్యాలపోతుగా నా మంత్రశక్తి ఎలాంటి వనుకున్నావ్? కనికట్టుచేసి ఆ గూడెంవాళ్ళందరి కళ్ళూ కప్పి, నిన్ను ఆ చిళ్ల కంచె మీదుగా దాటించి, యిక్కడికి తీసుకొచ్చాను." అన్నాడు ధర్మయ్య, పెద్దగా ఖాండ్రించి ఉమ్మేతూ.

"నాకంతా ఏదో అయోమయంగా, తిక్కతిక్కగా, మగత మగతగా వుంది, ధర్మయ్యా," అన్నాడు బొబ్బిలి, దిరిశెన చెట్టు కొమ్మలకేసి బిత్తరచూపులు చూస్తూ.

"ఉండదా మరి, బెబ్బులీ!" అంటూ ధర్మయ్య, బొబ్బిలిభుజంమీద చేయి వేసి, తాటితోపుకేసి నడిపిస్తూ, "ఆ చెన్న కేశవులు గాడు ఆ కాపుసారాకాయల్లో




మాంచి ఘాటైన మోతాదులో ఎలుక మందు కలిపాడన్న మాట మరిచిపోకు. ఆ సారా ఒక్క గుక్కెడు తాగుంటే ఎలుక్కాదు, ఎలుగ్గొడయినా నాలుక వెళ్ళపెట్టి మరీ చచ్చూరుకునేది. ఏదైతే నేం, నువ్వు కేశవులుమీద పగ తీర్చు కున్నావు. తొందరపాటులో నువ్వు కొట్టినదెబ్బ అతగాడి తలమీదినుంచి జారి, గూటిమీద బలంగా తగిలింది. వాడి గూడు మోకాళ్ళదగ్గరకు దిగజారి పోయిందనుకో. వాడు బతకడు, బతికినా అవిటి బతుకే," అన్నాడు.

"వాడు బతికితేనే బాగు, ధర్మయ్యా. నాకు ఉరిశిక్ష తప్పుద్ది," అన్నాడు బొబ్బిలి ఏడుపుగొంతు పెట్టి.

దిరిశెనచెట్టు కొమ్మలు బలమైన గాలితాకిడి తిన్నట్టు కిర్రుకిర్రుమన్నవి. ఆ వెంటనే ఒక పెద్దగొంతు, "ఎవర్రా, ఆ రోనేవాలా? తిను, తాగు, పాడు," అన్నది.

బొబ్బిలి తలెత్తి కొమ్మల్లోకి చూస్తూ, "వాడు గారడీ బుడేసాయిబు కాదూ! వాడుచచ్చి రెండు మూడేళ్ళయిందిగందా. యానాది యీరడు పట్టుకొచ్చి కుండలో దాచిన తాసుపామును, తాగిన మైకంలో ముద్దెట్టుకోపోతే కాటుదెబ్బతిని చచ్చాడ గందా?" అన్నాడు బెదరిపోతూ.

"మనం సచ్చామో, బతికేఉన్నామో తెలిస్తే హిక లేందేదిబే! హది తెలీకేగా హీ రెట్టూ కొమ్మల్ పట్కో హేల్లాట్టం. హీ లోకమే బడా జాదూ. మన కవీ కట్టిన ఒఘల్ ఘన్నా జారేట్టు పా, విన్నావ్? అదొక్కటే సత్తెం? పా,

మన్నావ్ ?" అన్నాడు గారడీ బుడే సాయిబు.

"ధర్మయ్య, అంత ఏదో యిది యిడిగా వుంది ఆ బుడేసాయిబు చావటం నాకు తెలుసు. ఆ పాడేది దెయ్యంపాట," అన్నాడు బొబ్బిలి.

అంతవరకూ తగ్గుస్థాయిలో పాడు కుంటున్న గారడీ బుడేసాయిబు, బొబ్బిలి మాటలు వింటూనే. "వా వా వా వా!" అంటూ విరగబడి నవ్వి, పెద్దగా గొంతెత్తి పాటకు లంకించుకున్నాడు.

వాణ్ణి రప్పున్నాన్నాది – వీణ్ణి రప్పున్నాన్నాది
పిద్దన్న రప్పున్నీ – నిద్దరోయిందో,
నిలా నిలా నిలభండీ హ్వాబ్బ దానిసోకో
డభల్ ఫన్నా జాకెట్టూ –

"నువ్వూ, నీపాటా తగలడా, వూరు కోరా బుడే," అన్నాడు ధర్మయ్య విసుక్కుంటూ. బుడేసాయిబు పాటాపి హిహిహీ అంటూ నవ్వసాగాడు.

"ఇక్కడంతా నానా కళ్మలంచేరింది, బెబ్బులీ. వీళ్ళ వెకిలిచేష్టల్ని భరించటం మహాకష్టం. అందులో కొత్తగావచ్చిన వాడివి. ఓ వారంరోజులుగడిస్తే అంతా నీకూ అలవాటైపోద్దిలే," అంటూ ధర్మయ్య, బొబ్బిలి చేయిపట్టుకుని, చరిచెనచెట్టు కొమ్మలమీదికి ఎగిరాడు ఆశ్చర్యం! బొబ్బిలి అతడితోపాటు గాలిలో తేలిపోయి, చెట్టుకొమ్మమీద లబడ్డాడు.

"అంతా కల్లా వుంది ధర్మయ్యా. మనిషి పక్షిలా ఎగిరి కొమ్మెక్కటం ఏంటి ?" అన్నాడు బొబ్బిలి.

"అంతా, నువ్వుతాగిన ఎలుకమందు కలిపిన కాపుసారా కల్పిస్తున్న భ్రమ. గాభరాపడకు." అన్నాడు ధర్మయ్య బుజ్జగిస్తున్నట్టు.

"అరే భాయ్, నువ్వు చేశ్నా గడ బిడేంటి బే ? ఆడి పెళ్ళాన్ని మోయించి కేళ్ళల్ని సంపావ్, బులో దీన్ దీన్," అంటూ చప్పట్లు చరిచాడు బుడేసాయిబు.

ధర్మయ్య అక్కడ కొమ్మలమీద వున్న అందరికేసీ ఓమారు చూసి, బొబ్బిలి చూడకుండా ఏదో సైగచేశాడు. ఆ వెంటనే అందరూ గప్‌చిప్ అయి పోయారు.

తాటితోపుకు దాపుల్న ఎవరో మాట్లాడుకుంటున్న ధ్వని వినబడింది. కొమ్మలమీద వున్నవాళ్ళంతా ఒక్కసారి తలలువంచి కిందికి చూశారు. ఉదయిస్తున్న సూర్యకాంతిధాటికి, చెట్టుకింద గూడుకట్టుకున్న చీకటి గుయ్యారం, తోపులోని పాడుబడ్డ ముత్రాసోళ్ళ లంక లాంటి ఇంటికేసి పరిగెత్తింది.

"తెల్లవారుతున్నది. ఇక మనం యీ కొమ్మల్లో వుండటం ప్రమాదం. ముత్రాసోళ్ళ పాడుకొంపలోకి పదండి," అంటూ ధర్మయ్య లేచాడు

"అమ్మో, నేనక్కడికి రాను ఆ కొంపలో పట్టపగలే దెయ్యాలు కుస్తీ



నేలకరవక, హాహా అని నవ్వుతాడేం?" అన్నాడు బొబ్బిలి.

"అంతా కనికట్టు!" అన్నాడు ధర్మయ్య, మీసాలు ఎగదువ్వుకుంటూ.

"ఉహుఁ. నాకు నమ్మబుద్ధవటంలేదు!" అన్నాడు బొబ్బిలి.

పగలూ, రాత్రీ — వెన్నెలా, చీకటీ— దిరిశనచెట్టుకొమ్మలూ, ముత్రాసోళ్ళ పాడుకొంపలో ఆటకా — వీటి మధ్య బతుకుగడచిపోవడంతో బొబ్బిలికి, తనా తాటితోపులోకివచ్చి ఎంతకాలంఅయిందో తెలియలేదు. దెయ్యాలపోతు ధర్మయ్యా, గారిడీ బుడేసాయిబూ తతిమ్మావాళ్ళు కూడా, రోజులూ నెలలూ లెక్కపెట్టుకుంటున్నట్టులేదు.

"ఎన్నాళ్ళిలా దొంగబతుకు బతకటం? నే నెళ్ళి పోలీసోళ్ళకు పట్టుబడిపోతా," అన్నా డొకరొజున బొబ్బిలి, ధర్మయ్యతో.

"నీ కిక్కడొచ్చిన కష్ట మేమిటి? రో జెలాగడవటం అన్న బాధలేదు. ఆకలి లేదు, దప్పి కాలేదు. అసలు నీకుఊళ్ళో

పెళ్ళాం బిడ్డలుకూడా లేరాయె. ఇక్కడ మాతోటే హాయిగా కాలక్షేపంచెయ్యి." అన్నాడు ధర్మయ్యా.

ఆకలీ దప్పిక ల్లేవన్న ధర్మయ్యా మాట వింటూనే బొబ్బిలి బెంబేలుపడి పోయాడు. మనిషన్న తరవాత ఆకలీ దప్పికలు లేకపోవట మేమిటి ?

బొబ్బిలి వాలకం చూసి ధర్మయ్యా చిరునవ్వు నవ్వుతూ, "అంత గాభరా పడిపోకు. అంతా కనికట్టు! కొంచెం ఆగు యిప్పేస్తాను,'' అన్నాడు

కొద్ది రోజులు గడిచినై. ఒకనాటి మిట్టమధ్యాన్నం ఉడసరి లగ్నంవేళ. పాడుపడ్డ యింటిముందున్న దిగుడు బావి వైపునుంచి యికయికలూ పక పకలూ అటకమీదున్న బొబ్బిలికి విని పించినై ఆశ్చర్యపడుతూ అతడు బయ టికి తొంగిచూశాడు చెన్నకేశవులు చంకకర్ర ఆసరాతో కుంటుకుంటూ నడుస్తూ, మధ్యమధ్య దాన్ని పైకెత్తి, ముందు వస్తూన్న ఎరికలరత్తి నడ్డిమీద సుతారంగా పొడుస్తున్నాడు అది, "హోయ్ మావో!" అంటూ కోపగిం చుకోబోయి కిలకిలమని నవ్వేస్తున్నది

అది చూస్తూనే బొబ్బిలి గుండెలు భగ్గుమన్నవి. తన దొంగబతుక్కు కారకుడైన దుర్మార్గుడు బతికుండటమే గాక, సొంత సొమ్మయినట్టుగా రత్తితో సరసాలాడుతున్నాడు.

"ధర్మయ్యా! ఒక అత్యకి రెం డుతుండవ్ ; ఆ కేశవులుగాడు మనం అనుకున్నట్టు సావకపోగా, రత్తితో సరసా లాడేస్తున్నాడు. అణ్ణిప్పుడు విలు వునా పేల్చేస్తాను." అంటూ బొబ్బిలి హుమ్మని లేచి నిలబడ్డాడు.

"అణ్ణి చంపటం నీవల్ల కాదు, పట్టు" అన్నాడు ధర్మయ్యా.

బొబ్బిలి నివ్వెరపోతూ, "పట్ట టమే ?" అన్నాడు

"కవిక ట్టిప్పేస్తున్నాను బెబ్బులీ, కాస్త శాంతంగా వుండు మరీ రోష పడ్డావంటే నెత్తురు గుండెలకెదగట్టి ప్రమాదం తేవచ్చు. మనకు మనుషుల్ని కొట్టీ, పొడిచీ చంపే శక్తి లేదు కావా లంటే పట్టుకుని కొన్నాళ్ళ పాటు ఏడి పించి, నానాహింసా పెట్టొచ్చు. తెలి సిందా ?" అన్నాడు ధర్మయ్యా అతి గంభీరంగా.

"అంటే నేను సచ్చిపోయానన్న మాట, దెయ్యా నన్నమాట! ఈ సంగతి మొదట్లోనే ఎందుకు సెప్పావుకాదు, ధర్మయ్యా," అంటూ బొబ్బిలి బావురు మన్నాడు

ధర్మయ్యా అతడి భుజంమీద చేయి వేసి అనునయిస్తూ. "ఆ చెప్పక పోవటం నీమంచికే. హఠాత్తుగా ఆదుర్వార్త చెప్పేస్తే గుండె పగిలి చస్తావని భయపడ్డాను," అన్నాడు.




## ఉపక్రమణిక

మోహిని గుండెలు బాదుకుంటూ, జుట్టు పీక్కుంటూ, ఎవరిని గురించో ఆలోచించుకుంటూ ఏడుస్తున్నది. ఏడుస్తూ మధ్య మధ్య నవ్వుతున్నది. నవ్వుతూ నవ్వుతూ ఏడుస్తున్నది. ఆమె మతి చెడింది, ఇంకా చెడుతున్నది. ఆమె ఇప్పుడు మోహినే కాదు. ఎందుకామె కీ దుఃఖం ? వినండి.

చీకటిరాత్రి త్వరలోనే తెల్లవారబోతున్నది. చాలా సేపటికింద వర్షం పడింది మళ్ళీ వర్షంవచ్చే లక్షణాలున్నాయి. నదీతీరాన కప్పలు అరుస్తున్నాయి. నదిలో అలలు గలగలమంటున్నాయి. నదీతీరాన ఒక మవిషి కూర్చుని, ఏదో ఆలోచిస్తూ నదిమీదికి చూస్తున్నాడు.

పదునైన కత్తి చేతబట్టి, కళ్ళు చింతనిప్పుల్లాగా మెరుస్తూ, మోహిని అతన్ని వెనుకగా, నిశ్శబ్దంగా, అడుగులో అడుగు వేసుకుంటూ సమీపించింది. ఆమె పిశాచి లాగున్నది.

అతను వెనక్కు తిరిగిచూడకుండానే, "మళ్ళీ వచ్చావా, మోహినీ ? దగ్గిరికి రాకు. నన్ను చంపుతావా ? నువే చావగలవు జాగ్రత్త," అన్నాడు.

---

పాంచకడీదేవ్

---

ఆమె హతాశురాలై ఆగిపోయి, "నే నిదివరకే చచ్చాను. ఇది చావు కాదా? కాని నువు మళ్ళీ చావుతప్పించుకున్నావు, వినోద్. ఇప్పటికి తప్పించుకున్నావు. కాని, చూస్తుండు, మరో రోజు వస్తుంది — ఈ కత్తి నీ గుండెల్లో దిగబడే రోజు!" అన్నది.

వినోద్‌లాల్ వెటకారంగా నవ్వి, "బెదరటానికి నేను అయిదేళ్ళ పాపాయి ననుకున్నావా, మోహినీ?" అన్నాడు. ఆమె ఏమీ అనకపోవటం చూసి అతను, "చూడు, మోహినీ, నువ్వీ ప్రయత్నం మాను. నువు నన్ను చంపలేవు. కాని నేను తలుచుకుంటే ని న్నీక్షణం చంపగలను. ఆ సంగతి నీకు తెలుసు. నువు నాకు పగ దాని వవుతావనికూడా నాకు తెలుసు. అయినా నిన్ను బతకనిచ్చాను. నీకు భయపడి కాదు. ప్రాణాలకుసైతం తెగించి నన్ను పట్టుకోవటానికి తిరుగుతున్న పోలీసులకే నేను భయపడను. నిన్నూ, నీ చేతిలో కత్తినీ చూసి భయపడతానా? నేను నిన్ను ప్రేమించాను. వెనకటిలాగా మళ్ళీ సుఖపెడతాను, పెద్దమేడ — దాసీలు — ఏది కోరితే అది — నీ కేలోపమూ ఉండదు. ఎందుకిలా శ్రమపడుతూ తిరుగుతావు?" అన్నాడు.

అతనిమాటలు వింటున్నకొద్దీ మోహిని క్రోధోద్రేకం పొంది, "దుర్మార్గుడా! పాపీ! నీబొల్లి మాట లింకా నమ్ముతాననుకున్నావా? ఒకప్పుడు నిన్నునమ్మి మోస పోయి, మతభ్రష్టురాలినై, సర్వనాశనం పొందాను. ఒక విధవరాలి డబ్బు కాజేసి బిచ్చగత్తెను చేసినందుకు ఫలితం ఉండదనుకున్నావా? పదేళ్ళ క్రితం — నేను పద్దెనిమిదేళ్ళ దాన్నై, వయసు ముమ్మరంలో — నా దుర్బలహృదయాన్ని అవలీలగా వశపరచుకుని, నా మెడకు ఉచ్చుతగిలించి, నన్ను నరకంలోకి తీసుకుపోయావు. కన్నతండ్రితోకూడా చెప్పకుండా, కుక్కలాగా నీవెంట వచ్చేశాను. నాకు నాభర్త పెట్టిన ఏడువేల రూపాయల నగలూ రెండేళ్ళలో కాజేసి, నన్ను తన్ని లాగివేశావు. తరవాత ఎనిమిదేళ్ళపాటు నీజాడ తెలియరాలేదు. నువు మరొకతెను చేపట్టావనీ, ఆమెకూడా నీలాటి పిశాచమేననీ, నువు తిరిగివచ్చాక తెలిసింది. నీసుఖాన్ని నేను నిర్లిప్తంగా చూస్తూ చేతులుముడుచుకు కూర్చుంటా ననుకున్నావా? ఈ కత్తితో పగతీర్చుకు తీరుతాను. నేను మామూలు స్త్రీ ననుకుని పొరపడకు. నావంటి పాపాత్మురా లెంతకైనా తెగించగలదు. ఆ సంగతి నువే చూస్తావు!" అంటూ ఆమె కత్తి ఆడిస్తూ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

వినోదబాబు తెల్లవారేదాకా అక్కడే కూర్చున్నాడు.

# 2

గొప్ప అపరాధ పరిశోధకుడుగా అరిందముణ్ణి హుగ్లీజిల్లాలో ఎరగనివాళ్ళు లేరు. దొంగలకూ, బందిపోటులకూ, హంతకులకూ అతను పక్కలో బల్లెం. అపరాధ పరిశోధనలో అతను అపజయం ఎరగడు. అతని ప్రతిభ అద్వితీయమైనది. అతనికి కలిగిన ఒక భయంకర సంఘటనే ఈ కథకు ఇతివృత్తం.

అరిందముడు హుగ్లీ జిల్లాలోని కామదేవపురంలోని నివసించేవాడు. ఒకనాటి తెల్లవారు జామున, అక్కడి ఠాణాకు అధికారి అయిన యోగీంద్రనాథుడు అతన్ని చూడవచ్చి అతన్ని ఠాణాకు తీసుకుపోయాడు. ఠాణా అరిందముడి ఇంటికి ఎంతో దూరంలేదు.

ఇద్దరూ తాళంవేసి ఉన్న ఒక గది తెరిచి లోపల ప్రవేశించారు. గదిలో ఒక మూల ఒక తరిహా చెక్కపెట్టె ఉన్నది. యోగీంద్రు డా పెట్టెమూత తెరిచి అరిందముడికి చూపాడు. ఆ పెట్టెలో సుమారు పన్నెండేళ్ళ వయసుగల ఆడపిల్ల శవం ఉన్నది. ఆమె శరీరంనిండా నూరుకత్తిపోట్లున్నాయి. కుడిచెయ్యి పూర్తిగా నరకబడింది.

అరిందము డా శవాన్ని పైకితీసి, కిటికీలోనుంచి వచ్చే ఉదయకిరణకాంతిలో జాగ్రత్తగా పరిశీలించాడు. ఆ శవం పోలీసులకు దొరికిన వైనమంతా యోగీంద్రుడు అరిందముడికి వివరించి చెప్పాడు.

కిందటి రాత్రి రెండుగంటలవేళ ఒక హిందూస్థానీవాడు ఆ పెట్టెను నెత్తిన పెట్టుకుని ఠాణాపక్కగా పోతుంటే రాందీన్ అనే పోలీసువాడు చూసి, అనుమానించి, యోగీంద్రుడికి కబురుచేశాడు. ఆ మనిషిని పట్టుకు రమ్మని యోగీంద్రు డాజ్ఞాపించిన మీదట రాందీన్ ఆ మనిషిని పెట్టెతో సహా తెచ్చాడు. యోగీంద్రు డా పెట్టె తెరవటానికి తాళంచెవి అడిగితే హిందూస్థానీవాడు తన దగ్గిర లేదన్నాడు. వాడు దొంగ అయి ఉంటాడని అనుమానించి యోగీంద్రుడు వాణ్ణి ప్రశ్నించాడు. ఆ ప్రశ్నలకు సమాధానంగా వాడు, తా నా పెట్టెను అరిందముడి వద్దనుంచి తెస్తున్నట్టు చెప్పాడు. యోగేంద్రుడామాటలు నమ్మలేక పెట్టెను గదిలో పెట్టించి, ఆ మనిషిని అక్కడే ఉండమన్నాడు. అరిందముడి మనిషే అనుకుని అతను వాడిపైన ఎవరినీ కాపలా పెట్టలేదు.

తెల్లవారి చూసేసరికి వాడి జాడలేదు. పెట్టెపైన రక్తపు మరకలు కనిపించాయి. పెట్టె పగలగొట్టిచూస్తే లోపల శవం వున్నది.

పెట్టె మోసుకొచ్చిన హిందూస్తానీవాణ్ణి యోగీంద్ర ఇలా వర్ణించాడు; వాడి వయసు ముప్ఫై ఉంటుంది. మనిషి వికృతంగా ఉంటాడు. చప్పున చూడగానే మనిషనికూడా అనిపించడు, పెద్దముక్కు; చిన్నకళ్ళు, బలిష్ఠుడు; నల్లగా ఉంటాడు; నెత్తిన వాలుగైడు కత్తిగాటు మచ్చలున్నాయి.

శవం తలలో రెండుమూడు తలపిన్నులు వెండివి ఉన్నాయి. అరిందముడు వాటిని తీసుకున్నాడు.

ఆ సమయంలో పారా వాడు వచ్చి యోగీంద్రుడి కొక ఉత్తరం అందజేశాడు. అతను దాన్ని చదువుకుని అరిందముడి కిచ్చాడు. అందులో ఇలా ఉన్నది.




"యోగీంద్రబాబూ, నువ్వు నన్నెరుగుదువు. నేను. నిన్నెరుగుదును, నువు నన్ను పట్టుకోవడాని కెలాగో ప్రయత్నిస్తావు. పోలీసు పనిలో ఉన్న నీకది విధ్యుక్త ధర్మం. పెట్టెలో నువ్వు చూసిన బాలికను నేనే చంపాను. ఆ బాలిక ఎవరో, ఎందుకువచ్చిందో, నేనామె నెందుకు చంపానో చచ్చినా నువ్వు తెలుసుకోలేవు. నీ మిత్రుడు అరిందముడి సహాయం తీసుకుంటావని నాకు తెలుసు. కాని పదిమంది అరిందములుకూడా ఏమీచేయలేరు. ఈపిల్లని చంపినట్టే మరికొందరినికూడా చంపబో తున్నాను. ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు ఆ హత్యలుచేస్తానో నీకు చెప్పనవసరములేదు. ఈవారం లోపల, నేను తలపెట్టినపని ముగుస్తుంది. ముందు అరిందముణ్ణి, తరవాత నిన్నూ చంపేస్తాను. కనుక మీరిద్దరూ జాగ్రత్తగా ఉండండి. మీవంటి వాళ్ళను ఒకరిద్దరిన్నీ చంపకపోతే ఇంక నాగొప్పతనమేమిటి? ఈ ఉత్తరం చదివేటప్పుడు



నీ మొకం చూడలని ఉన్నది గాని, ఆ కోరికను ఒకందుకు అణచుకున్నాను. హంతకుని పట్టుకోవటానికి ప్రయత్నించబోతున్నావా? ఒకటి రెండు రోజులలో చావనున్న నీ కెందుకు శ్రమ? ఈలోపల అరిందముడి హంతకుణ్ణి వెతికేపని కూడా నీకు కలుగుతుంది — ఇట్లు, నీ పరిచిత శత్రువు."

అరిందముడా ఉత్తరం చదివి, ఏమీ అనకుండానే యోగీంద్రుడికి తిరిగి ఇచ్చాడు.

"వ్యవహారం ఎంత దారుణంగా ఉన్నదో చూశారా?" అన్నాడు యోగీంద్రుడు.

"ఇతను సామాన్యుడుకాడు. ఎలాటి వాడైనా పట్టుకునే ప్రయత్నం చెయ్యవలసిందే. మీ రిద్దరూ ఒకరి నొకరు తెలిసినట్టు కనిపిస్తుంది. బాగా ఎరిగినవాడే ఈపని చెయ్యటం ఆశ్చర్యం," అన్నాడు అరిందముడు.

"నే నెరిగినవారిలో ఇత నెవడో స్ఫురించటంలేదు. మిమ్మల్ని కూడా చంపుతానంటాడు. మీ కెవరైనా శత్రువు లున్నారా?"

"దొంగలూ, మోసగాళ్ళూ, హంతకులూ అయినవాళ్ళంతా నా శత్రువులే. ఇతను కూడా ఆబాపతే అయిఉంటాడు. ఎవడైతేనేం? అతన్ని సాధించి పట్టితీరాలి".

అరిందముడు డాపెట్టెలోనుంచి ఒక నల్ల బనీనూ, కోటూ, విరిగిపోయిన నల్లని చేతికర్రా పైకితీశాడు. కోటంతా నెత్తురుతో తడిపి ఉంది. అరిందముడు వాటిని పరిశీలించి, హత్యచేసినప్పుడు హంతకుడు కోటు ధరించాడు. ఎందుచేతనో ఈ కర్ర విరిగింది. దాన్ని కూడా ఈ పెట్టెలోనే పెట్టాడు. అతను అయిదున్నర అడుగుల ఎత్తు మనిషి అని తోస్తుంది. పెద్ద ఛాతీ, వెడల్పయిన భుజాలు, చిన్నపొట్ట—స్థూలకాయుడు కాడు. నుదురు కొస్త పెద్దది. తల వెంట్రుకలు పొట్టివి. గడ్డమూ మీసాలూ ఉన్నట్టుతోచదు. తెల్లటి మనిషి. హత్య జరిగిన ప్రదేశంలో చూస్తే అతన్ని గురించి ఇంకా వివరాలు తెలిసి ఉండేవి," అన్నాడు.

అరిందముడు ఈ వివరాలన్నీ ఎలా ఊహించాడో యోగీంద్రుడికి బోధపడలేదు. అందుచేత అరిందముడు తన ఊహలకు ఆధారాలు చెప్పాడు. చేతికర్ర హంతకుడిదే అయిఉంటే అతను సుమారు అయిదున్నర అడుగులమనిషి అయిఉండాలి. అంతకన్న పొట్టివాడి కది పెద్దది, పొడుగువాడికి చిన్నదీనూ. కోటునుబట్టి హంతకుడి రొమ్మూ, భుజాలూ, పొట్టా ఎలాఉండేదీ తెలిసిపోతున్నది. హత్య చేసినప్పుడు హంతకుడు తన ముఖానా, తలమీదా పడ్డ రక్తాన్ని కోటుతో తుడుచుకున్నాడు. అతని వెంట్రుకలు కొన్ని కోటుగుండీలకు చిక్కుకున్నాయి. ఆ వెంట్రుకలు మీసాలూ, గడ్డమూ కావు, అవి అతనికి ఉన్నట్టయితే వాటితాలూకు వెంట్రుకలుకూడా ఒకటి రెండు కనిపించి ఉండేవే. ఇక అతని శరీరవర్ణం మాట — అతను నల్లని కోటూ, నల్లని చేతికర్రకూడా ధరించాడు. అతనివయసు నలభై మించిఉండాలి. ఆ వయసువాళ్ళే ఇలాటి దారుణకృత్యాలు చేసేది.

''హంతకుడు దొరికిన తరవాతగాని మీఊహ ఎంతవరకు నిజమో తెలియదు." అన్నాడు యోగీంద్రుడు.

అరిందముడు సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.




# ప్రథమ ఖండం

అర్ధరాత్రివేళ, ఎడతెగని వర్షంలో, భయంకరంగా మెరుపులు మెరుస్తూ, మధ్య మధ్య పిడుగులు పడుతూండగా, ఒక పద్నాలుగేళ్ళ బాలిక విశాలమైన మైదానం మీదుగా పరిగెత్తిపోతున్నది. ఎవరికైనా తాను కనబడతానేమోన్న భయంతో ఆమె మెరుపు మెరిసినప్పుడాగి చుట్టూ కలయజూస్తూ, తిరిగి చీకటి ఆవరించినప్పుడు ముందుకు పోతున్నది.

ఆమె అలా ఎంతసేపటినుంచీ అలా పరుగెత్తుతున్నదో తెలీదు. ఆమె బట్టలన్నీ తడిసిపోయి. ఆమె శ్వాస పెద్దచప్పుడు చేస్తున్నది మధ్యమధ్య పడిలేస్తున్నది. అప్పుడప్పుడూ ఆమెకాళ్ళు ఒక్కఅడుగైనా ముందుకు వేయలేనట్టుగా ఉన్నాయి. అయినా ఆమె ప్రాణాలరచేతపట్టుకున్న దానిలాగా పరిగెత్తుతున్నది.

చివరకామె ఒక చిన్నగ్రామం చేరుకున్నది. గ్రామమంతా నిర్జీవంగాఉంది. ఊరి మధ్య ఒక కోమటిఅంగడి మాత్రం తెరిచివుంది అక్కడ దీపం వెలుగుతున్నది హుక్కాతాగుతూ, పేకాడుతూ, నలుగురైదుగురు కథలు చెప్పుకుంటూ, హాస్యాలాడుకుంటున్నారు. చలికి వణుకుతూ వానకు తడిసి పాలిపోయిఉన్న ఆపిల్ల. "బాబూ, గోస్వామి ఎక్కడుండేదీ చెబుతారా?" అని అంగడిలోనివాళ్ళ నడిగింది.

ఎవరూ మాట్లాడలేదు. ఆ సమయాన అక్కడివారిలో ఒకడు దయ్యంకథ ఒకటి చెబుతున్నాడు

అంగడిదారు మండలుడు కొంచెం సాహసించి, "ఎవరు నువ్వు ? ఎక్కడినుంచి వస్తున్నావు?" అని ఆ పిల్లని అడిగాడు.

''చాలా అలసిపోయాను నిలబడలేను గోస్వామి ఉండేచోటు చెప్పండి. పెద్ద కష్టంలో ఉన్నాను." అన్న దాపిల్ల, మండలుడి ప్రశ్నకు సమాధానం చెప్పక

"గోస్వామి మఠంలో నీ కెవరుకావాలి? ఆ మఠం చాలాదూరం ఉన్నది. ఈ చీకట్లో, ఈ వానలో ఒక్కత్తెవూ ఎందుకు పోవటం. దారి తప్పుతావు." అన్నాడు మరొకడు, హలధరుడనేవాడు.

ఆపిల్ల చీకట్లోకి పరిగెత్తిపోయింది

దయ్యంకథ చెబుతూండిన హిరణ్యచంద్రుడు, "ఆ ఉరిపోసుకు చచ్చిన గొల్లపిల్లే ఇది. ఆరోజు నాకు వెదురుతోటలో కనిపించింది, మళ్ళీ కనిపించిందిప్పుడు''అన్నాడు

"ఛీ, ఛీ! ఆపిల్ల అందమెక్కడ? అదెక్కడ?" అన్నా డొకడు.

''దాని కేమిటి? దయ్యాలు కావాలనుకున్నట్టు మారిపోతాయి ''

''ఈ కబుర్లు కట్టిపెట్టండి గోసాయి మఠంలో ఎవరికూతురో అయిఉంటుంది. అత్తింటి పోరుపడలేక పుట్టింటికి పారిపోతున్నది." అన్నాడు మండలుడు.

హుక్కా, పేకాటా, కథలూ, సంగీతాలూ అన్నీ మానేసి ఆ అంగడిలోవాళ్లు ఈ విషయమే మాట్లాడుకుంటూండగా అక్కడికి మరొకమనిషి వచ్చాడు. మనిషి అమిత వికారంగా ఉన్నాడు; కారునలుపు శరీరం; బలమైన అవయవాలు, చింత నిప్పుల్లాంటి పెద్దకళ్ళు; గొగ్గిపళ్ళు; బుర్రముక్కు.

భయంకరంగాఉన్న ఈ మనిషి కర్కశకంఠంతో, ''ఇటుగా ఎవతె అయినా వెళ్ళిందా?'' అని అడిగాడు

ఎవరూ సమాధాన మివ్వకపోయేసరికి, ఆ మనిషి వాళ్ళకు కత్తిచూపించి, "మీకు మాటపడిపోయిందా? నిజం చెప్పకపోతే ఇదుగో!" అన్నాడు.

హలధరుడు వణుకుతున్న గొంతుతో,"అరగంటక్రితం ఎవతో పెద్దచెరువుగట్టు మీదుగా గోసాయి మఠంకేసి పోతూ కనిపించింది,'' అన్నాడు వెంటనే కొత్త వ్యక్తి ఆ దిక్కుగా పరిగెత్తాడు.

హలధరుడు మిగిలిన వాళ్ళతో, ''దీని కేమంటారో చెప్పండి!'' అన్నాడు.

"ఏమీ తెలియటంలేదు ఇందులో ఏదోరహస్యం ఉన్నది," అన్నాడు మండలుడు.




"ఇదంతా భూతాలపనే !" అన్నాడు హిరణ్యచంద్రుడు.

తాను చూసినది భూతాలనా, మనుష్యులనా అని వారింకా చర్చించుకుంటుండగానే దూరంనుంచి ఆడది కెవ్వున అరవటమూ, "రక్షించండి ! హత్య !" అని ఆక్రోశించటమూ వారికి వినిపించింది.

మండలుడు చప్పునలేచి, "లెండి : అందరమూ పోయి ఆ పిల్లను రక్షింతాం !" అన్నాడు. అందరికీ తలా ఒక చేతికర్ర ఇస్తూ, ఉన్న అయిదుగురిలో ఇద్దరు దిగబడిపోగా, ముగ్గురు లాంతరలు పట్టుకుని చెరువుగట్టువెంబడి బయలుదేరారు. వాన వెలిసింది.

వాళ్లు చెరువుగట్లన్నీ అరగంటసేపు వెతికారు. కాని ఆపిల్లగాని, ఆమె శవంగాని వారికి కనిపించలేదు. ఇంతలో వారికి అవతలి గట్టుమీద ఎవరో పోతూ ఉండటం కనిపించింది. వారు ఆ మనిషికేసివెళ్ళి, లాంతర్ల వెలుగున మఠాధిపతి అయిన యదునాథగోస్వామిని గుర్తించి, నమస్కారాలు చేశారు.

"ఈ అపరాత్రివేళ్ళ మీ రిక్కడ తిరుగుతున్నా రేమిటి ?" అని గోస్వామి వారి నడిగినమీదట వారు ఆయనకు జరిగినదంతా చెప్పారు.

"నే నీ తోవనవస్తూంటే దారిలో నాకొక నెత్తురుగుడ్డ కనిపించింది." అన్నా డాయన.

"దయచేసి ఆ బట్టను చూపించండి, నేను గుర్తించగలను." అన్నాడు మండలుడు.

వాళ్లు ఒత్తిడిచేసినమీదట గోస్వామి వాళ్ళను చెట్లమధ్యకు తీసుకుపోయి నెత్తురు గుడ్డనుచూపాడు. దానితోబాటు అక్కడ ఒక పొడుగైనకత్తి, వెండి తలపిన్నులూ ఉన్నాయి. బట్ట ఆ పిల్లదేనని మండలుడు పోల్చుకున్నాడు. ఆ పిల్లను ఎవరో హత్యచేశారని స్పష్టం కాగానే వారందరికీ భయం కలిగింది. యదునాథ గోస్వామి కూడా భయపడ్డాడు. వారు అక్కడనుండి శీఘ్రంగా వెనక్కు తిరిగిపోయారు

# 2

హుగ్లీజిల్లాలో జీవనపాలుని ఉద్యానమంటే అందరికీ తెలుసు. ఈ కథ జరిగే నాటి కదంతా అడవిలాగా పెరిగిపోయి, పట్టపగలే హత్యలుచెయ్యటానికి వీలుగా ఉంది. తోటకు ఉత్తరాన శిథిలమైన ఒక పురాతన భవనం ఉన్నది. అక్కడి కెవరూ పోరు.

ఆ భవనంలోని ఒకగదిలో ఒక అందగత్తె అయిన బాలిక దుఃఖిస్తూ కూర్చుని ఉన్నది. ఆమె నెవరో ఆ గదిలో ఖైదీగాఉంచారు. సూర్యుడస్తమించి, చుట్టూఉన్న అడవిని చీకట్లాక్రమించే సమయంలో ఆమెఉన్న గదిలోకి ఒక మనిషి ప్రవేశించి, ఆమె పడుకునే నులకమంచంమీద కూర్చున్నాడు.

అతనివయస్సు నలభైకి తక్కువఉండదు, కాని ముప్పైకూడాలేనట్టు కనబడతాడు. బలిష్ఠమైన శరీరం; ఎత్తయిన ఛాతీ; తెల్లని శరీరచ్ఛాయ.

"రేవతీ, నామాట ఎందుకు కాదంటావు? నీకోసం నే నింతబాధపడుతున్నా నీకు జాలి లేదే?" అన్నాడతను.

"నిన్ను పెళ్ళాడి వైభోగం వెలగబెట్టేకన్న ఇలాగే చెరలో ఉండటమే నాకిష్టం." అన్న దామె.

"నాకు భార్యవు కాకపోతే ఉంపుడుకత్తె వవుతావు! నువ్వా దేవేంద్రుణ్ణి మరవలేకపోవటంచేత నా మాటలు వినిపించుకోకుండా ఉన్నావు. సరే, త్వరలోనే వాడితల నరికి తెచ్చి నీ ముందు పడేస్తాను, చూస్తూండు" అన్నాడతను.

ఈమాటలకా పిల్ల ఏడవసాగింది. ఆమె అతని ముందు మోకరించి, "కేశవబాబు, తల్లితండ్రులు లేని అనాథను. నా పైన నీకు కొంచెమైనా జాలి లేదా? మా చిన్నాన్నకూ నీకూ ఎంత స్నేహం! నా కీ కష్టాలు కలిగించటం నీకు న్యాయమేనా? రోజూ మాయింటికి వచ్చేవాడివి, నన్నూ నా చెల్లెలినీ ఎంతో




వాత్సల్యంతో చూసేవాడివి. నీ కిలాటి ఆలోచన ఉన్నదని ఎన్నడూ అనుకోలేదు. నన్ను మా యింటికి చేర్చు. నీకు పుణ్యం ఉంటుంది. ఈ జరిగినది నే నెవ్వరికీ చెప్పను !" అన్నది.

అతను ఆమెను బలాత్కారంగా ఆలింగనం చేసుకోపోయాడు. ఆమె దుఃఖం కోపంగా మారింది. ఆమె కళ్ళు నిప్పులు రాల్చుతూ "ఛీ, నీచుడా ! రాక్షసుడా ! నీ మొగం చూస్తేనే పాపం !" అని తిరగబడింది.

కేశవచంద్రుడు నివ్వెరపోయి నిలుచునిఉన్న సమయంలో ఆమె బయటికి పరిగెత్తి పోయింది. అతను ఆమెను వెన్నాడే ఉద్దేశంతో ద్వారందాకా వచ్చేసరికి, ఒక స్త్రీ అతన్ని బలంకొద్దీ లోపలికి తోసేసి, తలుపు మూసి, బయట గొళ్ళెం పెట్టేసింది.

"మోహినీ ! ఏమిటిది? తలుపు తియ్యి ! చంపకు !'' అంటూ కేశవచంద్రుడు తలుపును బలంగా తన్నసాగాడు. కాని అవి ఇనపతలుపులు.

మోహిని కిటికీలోంచి అతన్ని చూస్తూ. "ఇంక నువ్వు నన్ను చంపేకాలం వెళ్ళిపోయింది. నువ్వు చచ్చేసమయం వచ్చింది. ఇది మామూలు చావు. ఆకలికి మాడి కొంచెం కొంచెగా చావు ! అదే నీకు సరియైనచావు. నీ చావుకోసమే నేను బతికి వున్నాను,'' అన్నది.

"ఇప్పటికైనా తలుపుతియ్యి. లేకపోతే నీ ప్రాణానికే మొప్పం!''

"నన్ను భయపెడతావా? నాకు చావుభయం లేదు."

''నేను నిన్ను క్షమించను సుమా!"

"క్షమించమని నిన్నెవరూ అడగబోవటంలేదులే!"

మోహిని గదికి తాళంపెట్టి, తాళపుచెవి అరణ్యంలోకి విసిరివేసి, రేవతిని తన వెంట అరణ్యంలోకి తీసుకుపోయింది కొంతదూరంవెళ్ళి వారొక మర్రిచెట్టుకింద కూర్చున్నారు. అక్కడ రేవతి తన కథఅంతా మోహినికి చెప్పింది.

''అయితే ఇప్పు డేం చేస్తావు? ఇంటి కెలా పోతావు? వేణీమాధవపురం ఇరవై కోసులున్నది ఒంటరిగా పోలేవు. హుగ్లీ జిల్లాలో బంధువు లెవరూ లేరా?" అని మోహిని అడిగింది

"దగ్గరబంధువు లెవరూ లేరు. చందన నగరంలో గోసాయి మఠంలో మా గురువుగా రున్నారు ఆయనను చూసినట్టయితే నాకు సహాయం దొరకవచ్చు." అన్నది రేవతి.

''ఆ ఊరైనా రెండుకోసులకు పైగావున్నది. మబ్బులు ముంచుకొస్తున్నాయి. వర్షంవస్తే చిక్కు. ధైర్యంఉండి పోతానంటే నీకు దారిచెబుతాను."

"నువ్వుండే దెక్కడా? ఈ రాత్రికి నేను నీ వెంటఉంటే?''

"నే నొకచోట అని ఉండను. రాత్రింబగళ్ళు అడవులవెంట తిరుగుతాను."

''నీ కెవరూ లేరా?"

"మొగుడున్నాడు,"

"ఎక్కడున్నాడు?"

"అక్కడే ఉన్నాడు. నిన్ను నా సవితి చేయదలిచినవాడే నా మొగుడు.''

"ఆయనేనా? ఎంత మంచిమొగుడు!" అన్నది రేవతి ఆశ్చర్యంతో.

మోహిని తన కత్తితీసి రేవతికి చూపించి, "అంత మంచిమొగుడు గనకనే ఈ కత్తిపట్టి తిరుగుతున్నాను. అతనిగుండెలో గుచ్చి, నా గుండెలో గుచ్చుకున్న నాడు ఈ కత్తే మా ఇద్దరి రక్తాలనూ ఏకంచేస్తుంది. నీకు దారిచూపుతాను పద.

[redacted]

# 3

కేశవచంద్రుడు గదిలో బందీ అయిపోయాడు. బయట కారుచీకటి. ఉరుముల తోనూ, మెరుపులతోనూ పెద్దపెట్టున వర్షం ఆరంభమయింది. కొంతసేపటికి బయటి నుంచి, "రేవతీ, రేవతీ!" అన్న పిలుపు వినపడింది.




కేశవచంద్రుడికి ప్రాణం లేచివచ్చి నట్టయింది.

"ఎవరదీ? గౌరచంద్రుడా?" అన్నా డతను.

"మీ రిక్కడే ఉన్నారా? తలుపు తియ్యండి. చాలా విషయాలు చెప్పాలి," అన్నాడు గౌరచంద్రుడు,

"బయట గొళ్ళెంపెట్టిఉంది. నువే తియ్యి."

గౌరచంద్రుడు గొళ్ళాన్ని చీకట్లో తడివి, "తాళం వేసిఉందే, తాళాపుచెవి మీ దగ్గిరఉందా?" అన్నాడు.

"అయితే తాళం పగలగొట్టు."

"ఏమయిందేం?"

"ఇంకేంకావాలి? సర్వనాశనమయింది. పిట్ట ఎగిరిపోయింది."

గౌరచంద్రుడు ఒక విరిగిపోయిన కిటికీబాపతు ఇనపకమ్మీ తెచ్చి, దాంతో తాళం పగలగొట్టి, తలుపు తెరిచాడు.

కేశవచంద్రుడు బయటికి వచ్చి రేవతి పారిపోయిన వృత్తాంతం చెప్పాడు

"ఎంతపని జరిగిందీ! రేవతిని వెతికి వెంటనే పట్టుకోవాలి," అన్నాడు గౌరచంద్రుడు.

ఎందుకింత ఆలస్యంగా వచ్చావు? ఒకగంట ముందువస్తే ఇంత జరిగేదికాదు గద. నిన్ను చంపెయ్యాలన్నంత మండిపోతున్నది," అన్నాడు కేశవచంద్రుడు.

"ఇంటో ఉండకుండా ఇక్కడికి పడివచ్చి మిమ్మల్ని విడిపించటమే నాతప్పు."

"నీమూలంగానే నా పనులన్నీ పాడయేలాగున్నాయి. పెద్దమ్మవు దాపరించావు. గంటలో అయేపని పదిగంటలుచేస్తావు !"

నేను పెందలాడే బయలుదేరాను. కాస్తా, కూస్తా ? ఇరవైకోసుల దూర మాయె. ముందు మీయింటికెళ్ళాను. మీ రక్కడ లేరు. తాలిరాజుద్దీనింటికెళ్ళి ఆయన కూతురి నడిగితే, ముక్కూ మూతీ తిప్పి మీరు లేరన్నది. అక్కడ నించి వస్తున్నాను."

"ఇంతకూ వెళ్ళినపని ఏమయింది ? అతగా దేమంటాడు ?"

"నన్ను ఒంటరిగా గదిలోకి తీసుకుపోయాడు. దాన్ని అతనికిచ్చేశాను. సంతోషంగా చూసుకున్నాడు."

"డబ్బుమాట ??"

"అదే వచ్చిన చిక్కు. రెండుపనులూ పూర్తి అయితేగాని డబ్బిచ్చేటట్టులేదు. మీరేమో అతడికొకపని చేసిపెట్టి కొంతడబ్బు తీసుకుని ఉపాయంగా అతడి జమీందారీ కాజెయ్యాలనుకున్నారు. కాని అతను మహా గడుసువాడు. పని పూర్తి అయినాక మాట్లాడుదామంటున్నాడు."

"ఇంత ప్రయత్నమూ వృథాయే ?"

"నే నప్పుడే చెప్పాను కదండీ ? మీరు వినిపించుకోలేదు. ఒక్కసారే ఇరవై వేలూ వాడుసుకుందా మనుకున్నారు. మీకు తెలీని దేముంది ? అతిలోభం పాప హేతువు."

"ఒక్కొక్క పనికీ పదేసి వేలివ్వాలని చెప్పలేదా ? రెండు పనులకూ ఇరవై వేలు."

"ఇరవై వేలూ రెండు దఫాలుగా ఇవ్వాలని ఎక్కడున్నదీ ? ఇప్పటి పరిస్థితి చూస్తే మనకు ఇరవై పైసలుకూడా దక్కేట్టులేదు."

కేశవచంద్రుడు కొంచెం ఆలోచించి, "గౌరచంద్రా, నువు పద. రేవతిని ఎలాగైనా పట్టుకోవాలి. సాధ్యమైనంతవరకు ప్రాణాలతోనే పట్టుకో; గందరగోళం జరిగేట్టయితే ఆమెను చంపేసి, కళేబరాన్నయినా పట్టుకురా. ఏ విధంగానైనా సరే రేవతి నా కళ్ళపడాలి. లేకపోతే ఆ ఇరవై వేలూ చెయ్యిజారిపోతాయి. నేను మోహినిని వెతుకుతాను, నువు రేవతిని వెతుకు. నేనే మోహినికి ఆశ చూపాను. కాని నే ననుకున్నట్టు కాకుండా మోహిని నాకు శత్రువై కూర్చున్నది." అన్నాడు.




"అలాటి ఇలాటి శత్రువుకాదు, ప్రాణశత్రువు! ఆ శత్రువు కోసం వెదకక్కర్లేదు. ఇక్కడే ఉన్నది. నిన్ను వెన్నాడుతూనే ఉన్నది, వినోద్," అని అరణ్యం మధ్య నుంచి స్త్రీ కంఠం పలికింది అది మోహిని కంఠం. కేశవచంద్రుడు – అతడే వినోదుడుకూడా – ఆ గొంతును గుర్తించి చీకట్లోకి తీక్షణంగా చూశాడు. వర్షమింకా కురుస్తూనే ఉన్నది ఉరుములు ఉరుముతున్నాయి.

"ఇక్కడే ఉన్నాను. కనిపించటం లేదా?" అన్నది మోహిని, చెట్లమధ్య నుంచి ఇవతలికి వస్తూ. కేశవచంద్రుడు గర్జిస్తూ ఆమెను పట్టుకోబోయాడు. కాని ఆమె తప్పించుకుని అరణ్యంలోకి పారిపోయింది. ఇద్దరూ కలిసి ఎంతసేపు వెతికినా ఆమె కనిపించలేదు.

"ఇద్దరమూ ఒకపనే చెయ్యటం నిష్ప్రయోజనం. నువు రేవతిసంగతిచూడు. నేనీ పిశాచిని చంపిగాని మరొకపని చెయ్యను," అని కేశవచంద్రుడు గౌరచంద్రుణ్ణి పంపేశాడు.

# 4

చెరువుదగ్గిర పడిఉన్న నెత్తురుబట్ట సంగతీ, పొడుగైన కత్తి సంగతీ తెల్లవారేసరికి ఊరంతా తెలిసి గగ్గోలుపుట్టింది. తెల్లవారుతూనే ఇనస్పెక్టరు యోగీంద్రుడూ,

డిటెక్టివ్ అరిందముడూ హత్యజరిగిన చోటికి వచ్చారు. వాళ్ళవెంట అయిదారుగురు పోలీసులుకూడా ఉన్నారు.

మండలుడు మొదలైనవాళ్ళు చెప్పినదంతా అరిందముడు రాసుకున్నాడు. ఆయన అడిగిన ప్రశ్నలకు వాళ్ళు యధార్థమైన సమాధానా లిచ్చారు. చదువుకున్నవాళ్ళు కాక పోవడంచేత వాళ్ళకు అబద్ధాలు కల్పించటం చేతకాదు.

అరిందముడు యదునాథగోస్వామినికూడా ప్రశ్నించాడు.

"ఆ చీకటిలో ఆరాత్రివేళ మీ రిటుగా ఎందుకు రావటం జరిగింది?"

"గోస్వామి మఠంలో నా చెల్లెలున్నది. చూడబోయి తిరిగివచ్చాను."

"నెత్తురుబట్టను మీరే చూశారా? మీకెవరైనా చూపించారా?"

"నా వెంట ఎవరూలేరు. నేనే చూశాను."

"మీరేదైనా పనిఉండి చెట్లలోకి వెళ్ళితే ఆబట్ట కనబడిందా?"

"చెట్లమధ్య నా కేంపనీ?"

"మీరు తోవన వెళుతుంటే అడవిలో పడిఉన్న ఈ నెత్తురుబట్ట చీకట్లో మీకెలా కనిపించింది?"

"మెరుపు మెరిస్తే కనబడింది."

"పగటిపూటకూడా దారినుంచి చూస్తే కనిపించని ఈబట్ట మీకు మెరుపు కాంతిలో కనిపింటమేగాక, అది రక్త వస్త్రమనికూడా తెలిసిందంటే, నలభై దాటిన మీకింత సూక్ష్మదృష్టి ఉండటం ఆశ్చర్యంకాదూ?"

"అయితే నే నబద్ధమాడుతున్నా నంటారా?"

"ఇం కే మనుకోమన్నారు? ఒకవేళ మీరు నిజమే చెబుతున్నారేమో గాని, మాకు నమ్మకం కలగటంలేదు. మండలుడు చెప్పే మాటల్లాగా మీ మాటలో నిజమని పించటం లేదు. మీరు చెప్పేదాన్ని బట్టి మేము పనిచెయ్యాలిగద. అలాటప్పుడు మీ మాటల్లో విశ్వాసంలేకుంటా మేమేంచెయ్యగలం? మీ మాటలు చూస్తే ఈ హత్యలో మీకూ్కడా ఏదో సంబంధమున్నట్టు తోస్తుంది. ఆ సంగతి తరవాత చూస్తాం."

యదునాథుడికి కోపంవచ్చి, "మీరు నన్ను హంతకుణ్ణి కూడా చెయ్యగలరు, పోలీసులు; ఏమైనా చెయ్యగలరు" అన్నాడు.

అరిందముడు నవ్వి, "ఎందుకో్ౖకపడతారు? మిమ్మల్ని పట్టుకోవటం లేదు. మీ యిష్టం వచ్చిన చోటికి పోవచ్చు, మిమ్మల్ని అడిగే దింకేమీ లేదు," అన్నాడు.

యదుధునాడు మొఖం మాడ్చుకుని వెళ్ళిపోయాడు.

"అరిందంబాబూ, హత్యలో ఇతనుకూడా ఉన్నాడని అనుమానిస్తున్నారా?" అని యోగీంద్రు డడిగాడు

"అసలు హత్యే జరగందే! ఈ పిల్లను హత్య చేశా రనుకుంటున్నావా?" అన్నాడు అరిందముడు.

"ఈ రక్తవస్త్రం? ఎవడో కత్తి పట్టుకుని పిల్లవెంట పరిగెత్తాడు? మీ ఉద్దేశ మేమిటి?"

"నేను గ్రహించగలిగినమట్టు కాపిల్ల చావలేదు. ఈ గ్రామంలోనే ఎవరి ఇంటనో ఉన్నది."

"అలా అనుకోవటాని కాధారం?"

"రెండు మూడు నమ్మకమైన ఆధారా లున్నాయి, ఒకటి: ఇక్కడ బురదలో అడుగుజాడ లున్నాయి; ఒక్కటీ ఆ పిల్లది కాదు."

"హంతకు డామెను ఇంకెక్కడో చంపి, కత్తినీ, నెత్తురుబట్టనూ కనపడకుండా చెట్లమధ్య దాచవచ్చుగా?"

"రెండు: ఇక్కడ నాలుగురకాల కాలిగుర్తులే ఉన్నాయి. మండలుడూ, మరిద్దరూ ఇక్కడికి వచ్చారు. గోస్వామికూడా వచ్చాడు. వాళ్ళ కాళ్ళగుర్తులుతప్ప అయిదోమనిషి గుర్తులు లేవు. అంటే హత్యజరిగిం దనుకుంటే, ఈ నలుగురిలో ఒకడు హంతకుడు కావాలి."

అరిందముడు యోగీంద్రుడికి నలుగురు మనుషుల కాళ్ళగుర్తులు వేరు వేరుగా చూపించాడు. అతను తరవాత ఇలాచెప్పాడు; "మూడు : నెత్తురు బట్టమీద ఎలా ఉందో చూడు – ఎవరో చిలికినట్టున్నది. మనిషిని పొడిచినప్పుడు రక్తం చిమ్మితే బట్ట ఇలా తడవదు. హంతకుడి దుస్తులిలా తడవవచ్చు. అది అలావుంచి, హత్య అయిన మనిషివస్త్రాన్ని ఇలా పారెయ్యవలసిన అవసరమేమిటి? శవాన్ని మోసేవారికి బట్ట బరువా? ఇంక కత్తిని చూద్దాం. అది హంతకు లుపయోగించే కత్తే. కాని దాని పైన రక్తపుమరక లెందుకు లేవూ? వానకు రక్తం కడుగుకుపోయిం దనుకున్నా, దాని అడుభాగానైనా రక్తం ఉండాలిగా?"

చిన్న చిన్న ఆధారాలతో అరిందము డెంతదూరం ఊహించాడో చూసి ఆశ్చర్య పడి యోగీంద్రుడు, "హత్య జరిగాక, ఆ పిల్ల బతికేవుంటే, మీకు యదునాథుడిపై అనుమానం దేనికీ?" అని అడిగాడు.

"హత్య జరిగనంత మాత్రాన అనుమానించరాదని ఎక్కడ ఉన్నదీ? అతను హత్యచేశా డనికాదు, నా కతనిపై అనుమానం; అతను అబద్ధమాడాడు. అడవిలోకి

తాను ఒక్కసారే ప్రవేశించినట్టు చెప్పాడు. కాని అడుగుజాడలను బట్టి అతను రెండుసార్లు వచ్చి వెళ్ళినట్టు స్పష్టమవుతున్నది. మిగిలిన ముగ్గురూ ఇక్కడికి ఒకసారే వచ్చివెళ్ళారు. యదునాథుడు రెండుసార్లు వచ్చివెళ్ళాడు. ఇవిగో అతని అడుగుజాడలు. పోతే ఈ తలపిన్నులు మన కింకొక కేసులో పనికివస్తాయి. రెండు రోజులక్రితం మన కొక శవం దొరికిందే. ఆ హత్యకూ ఈ కేసుకూ సంబంధం ఉన్నట్టు దొరికింది. ఆ పెట్టెలో దొరికిన పిన్నులూ, ఇవీ ఒకటే రకం."

అరిందముడు తన జేబులోనుంచి పాత పిన్నులను తీసి కొత్తవాటితో కలిపేసి, "వీటిని వేరుచేయగలవా?" అన్నాడు.

"అన్నీ ఒకలాగే ఉన్నాయి," అన్నాడు యోగీంద్రుడు.

అరిందముడు తన నోటుబుక్కులోనుంచి ఒక చీరెముక్క తీసి, "ఇది మనకు పెట్టెలో దొరికిన శవంచీరెనుంచి తీసినది. దీనిపైనఉన్న గుర్తుకూడా ఈ నెత్తురు బట్టమీది గుర్తును పోలిఉన్నది. ఈ రెండు రహస్యాలను కలిపి తేలికగా గ్రహించవచ్చు," అన్నాడు.

తరవాత వారక్కడినుంచి వెళ్ళిపోయారు. కత్తి, నెత్తురుబట్టా ఠాణాకుచేరాయి

ఆరోజు సాయంకాలానికి అరిందముడు ఒంటరిగా యదునాథుడి ఇంటికేసి వెళ్ళాడు. అది చాలా పాతఇల్లు. అందులో అయిదారు గదులున్నాయి. ఇంటిచుట్టూ తుప్పలు చిందరవందరగా ఉన్నాయి. అరిందముడు ఇంటి వెనకతట్టున ఉండగా ఒక కిటికీలోనుంచి సుమారు ఇరవైఏళ్ళ వయసుగల అందమైనపిల్ల కనిపించి, అంతలోనే అదృశ్యమయింది. అంతలోనే ఒక వయసుమళ్ళిన స్త్రీ కనిపించి మాయమయింది. రెండవ స్త్రీ యదునాథుడి భార్య అయిఉంటుంది. మొదటిపిల్ల ఎవరు? ఆమెను మరొకసారి చూద్దామంటే కనిపించలేదు. ఇంటి వెనకభాగంలో అదేపనిగా నిలబడటం భావ్యంకాదని అతను ఇంటిముందుపక్కకు వచ్చాడు. యదునాథుణ్ణి చూసిపోవాలనే ఉద్దేశం.

ముందువైపు వాకిలీ, కిటికీలుకూడా మూసిఉన్నాయి. వాకిలివద్దకు వెళ్ళేసరికి, లోపల ఎవరో మాట్లాడుకుంటున్నట్టు వినపడింది. అరిందముడు కిటికీవద్ద చెవిపెట్టి ఆలకించాడు. లోపల ఏదో గూడుపుఠాణీ జరుగుతున్నది. అతను కిటికీతలుపుల సందుల్లోనుంచి చూశాడు. లోపల ఇద్దరున్నారు. ఒకడు యదునాథగోస్వామి రెండోవాడి వీపుమాత్రమే కనిపిస్తున్నది. ఎవరైనదీ తెలియడంలేదు.

లోపలి రహస్య సంభాషణ ఒక గంట సేపు సాగింది. అరిందము డా సంభాషణ అంతా శ్రద్ధగా విన్నాడు. అతను వీథికేసిచూస్తే చీకటి బాగా పడింది. అష్టమి




చంద్రుడు పడమటికి పోతున్నాడు అతను తిరిగి కిటికీ సందుల్లోనుంచి చూసేసరికి యదునాథుడు దీపంముందేదో ఉత్తరం రాస్తున్నాడు. రెండోవాడి వికృతాకారం దీపంవెలుతురులో నిలబడిఉండడం కనపడింది ఆ మనిషిని పూర్వం ఆరిందము డెరగడు. లోపల జరిగిన సంభాషణ ఆలకించాడు గనక, ఆ ఉత్తరం ఎందుకో అతనికి తెలిసింది.

ఉత్తరం పూర్తికాగానే రెండోవాడు దాన్ని తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. ఇక ఆ మనిషి బయటికివస్తాడని గ్రహించి ఆరిందము డొక పొదచాటుకుపోయి దాక్కున్నాడు. ఆ వికృతాకారుడు బయటికి వచ్చి, ఒకసారి చుట్టూ కలయజూసి తన దారిన బయలుదేరాడు. అరిందముడు కొంచెం వెనకగా అతన్ని అనుసరిస్తూ క్రమంగా సమీపించాడు. ఆ మనిషి ఒకటి రెండుసార్లు వెనక్కు తిరిగి అరిందముణ్ణి చూశాడు గాని, ఏమీ మాట్లాడలేదు.

ఇద్దరూ చాలాదూరం వెళ్ళాక అరిందముడు బిచ్చగాడిలాగా, "బాబూ!" అని పిలిచి, తమ ర్నెన్నడూ చూడలేదుగాని, మీ మోహం చూస్తుంటే పొగడా లని పిస్తోందండీ! తమరు చాలా – చాలా –" అన్నాడు.

"ఎవరు నువు?" అని ఆ మనిషిని ఆశ్చర్యంగా అడిగాడు.

అరిందముడు కొంచెం బిగ్గరగా, "తమర్ని చూస్తేనే నా కెంతో ఇదిగా ఉంది. తమరు చాలా – చాలా –" అన్నాడు.

"చాలా, చాలా ఏమిటి? దయ గలవాణ్ణా? అందం గలవాణ్ణా? మాట పూర్తి చెయ్యవేం?"

"అదేంకాదండీ. తమరు చాలా గొప్ప దగుల్బాజీ, గొప్ప లుచ్ఛా, తమర్ని పొగడాలంటే మాటలు రావటంలేదు!" అంటూ అరిందముడా మనిషిని మరింత సమీపించి అతని మొహాన్ని శ్రద్ధగా పరికించాడు.

ఆ మనిషి పరమ వికారంగా నవ్వుతూ, "పిచ్చివాడివా?" అన్నాడు.

"మీ రన్నారుగాని, నన్నింతవరకూ ఎవరూ అనలేదు పోనీండి. ఏం, ఇవాళకూడా బయలుదేరారు? నిన్న ఒకపని పూర్తయిందిగా? ఇవాళకూడా ఎవరి గుండెల్లోనన్నా పొడవబోతున్నారా?"

"నీ మాటలు నా కేమీ అర్థంకాలేదు."

"ఎందు కర్థం కాదులెండి? అంత భయంకర హత్య జరిగింది కదా, — ఆమూకీ ఏమైనా చిక్కిందా?"

"నే నిక్కడివాణ్ణి కాను. నువు డిటెక్టివువా?"

"కాకపోతే మీ వెంటపడతానాండీ? నాకు తెలుసు, మీరే ఆ అమ్మాయిని చంపారు!"

"నేనా, నా కేమీ తెలీదు."

"మండలుడి అంగడిదగ్గరికి మొన్నరాత్రి వచ్చింది మీరుకాదూ?"

"మండలు డెవడో నాకు తెలీదు."

"తెలీకపోతే మరిచిఉండాలి. మండలుడు మిమ్మల్నే వర్ణించిచెప్పాడు."

"అబద్ధం. అయితే నా కా హత్యవిషయం కొన్ని సంగతులు తెలుసు. నీ కాపిల్ల శవం చూపిస్తాను. దాన్ని సంపాదిస్తే నీకు బహుమానం వస్తుంది కాబోలు. నా కేమైనా ఇస్తావా?"

"మీ రంత ఉపకారమే చెయ్యాలిగాని, బహుమానాని కేం భాగ్యం."

"చూడూ, నేను నిన్నరాత్రి చెరువుగట్టుమీదుగా వస్తూంటే పడమటివైపు అడవిలో ఒకపిల్ల శవం కనిపించింది. నాతో వస్తే చూపిస్తా."

"మరైతే ఈ సంగతి పోలీసులకు చెప్పారుకారేం?"

"ఆఁ, వాళ్లు చంపుకుతింటారు. నాతో వస్తావా?"

"పదండి."

ఇద్దరూ కలిసి చాలాదూరం పోయి ఒక నిర్జనప్రాంతం చేరారు. అక్కడ పట్టపగలు హత్యజరిగినా ఎవరికీ తెలీదు.




"శవం కనిపిస్తున్నదా ?" అన్నాడు రెండోవాడు.

"నువు న న్నిక్కడి కెందుకు తెచ్చావో చెప్పు," అన్నాడు అరిందముడు.

"ఇదుగో చెబుతాను," అంటూ ఆమనిషి పొడుగైన కత్తి పైకి తీసి అరిందముడి పైన పడబోయాడు.

అరిందముడు భయపడ్డట్టు నటిస్తూ, చేతులు జోడించి," చంపొద్దు, చంపొద్దు; మీ దాసుణ్ణి !'' అన్నాడు.

"నా ప్రశ్నలకు సరిగా సమాధానం చెప్పు, ని న్నేమీ చెయ్యను. ను వ్వెవరు ? నీ పే రేమిటి ? ఎక్కడ ఉంటావు ? ఏం చేస్తావు ? ఎందుకు నా వెంటపడ్డావు ?"

"ఎవరినో కనిపిస్తోంది గదా! మనిషిని. పేరంత గొప్పపేరు కాదు-యముడు. నే నుండేది దొంగలూ, హంతకులూ ఉండే ప్రాంతాల సమీపంలోనే. నాపని నీవంటి దుర్మార్గుల్ని పట్టుకోవటం. నిన్ను పట్టుకుందామనే వెంబడించాను.''

''ఏం ? నే నేమన్నా హంతకుణ్ణా ?''

''కాకపోతే కత్తి పట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు ?''

రెండోమనిషి కత్తిఎత్తి అరిందముణ్ణి కొట్టబోయాడు. మళ్ళా అరిందముడు భయం నటించి, దణ్ణాలు పెట్టి తప్పించుకున్నాడు.

"ను వ్వుండే దెక్కడ ?" అని రెండోమనిషి గద్దించాడు.

"చెబుతాను, బాబూ, చెబుతాను. ఆ కొబ్బరితోట ఉందా? దాని పక్కగా చూస్తే దూరాన ఆ తాటితోపుందా ?" అంటూ అరిందముడు వేలితో చూపించాడు.

రెండోమనిషి అటుకేసే చూస్తూ, "తాటితోపేదీ ?" అన్నాడు.

అంతలోనే అరిందము డతనిచేతిలోని కత్తి లాగేసుకుని, అతనికాలిపై తన కాలుంచి గట్టిగా నొక్కిపెట్టి, ముందుకు ఒక్కతోపు తోశాడు. ఆ మనిషి గట్టిగా కేకపెట్టి పడిపోయాడు. వెంటనే అరిందము డతని గుండెలమీద కూర్చుని, ఎడమ చేత అతనిపీక గట్టిగా నొక్కాడు.

"నిన్ను చంపమన్నావా? వదలమన్నావా? పోనీ వదిలిపెట్టేస్తానులే. ఇంతటితో తప్పించుకున్నానని సంబరపడకు: ఎప్పుడు రావాలంటే అప్పుడు నిన్ను పట్టుకో గలను. తిన్నగా ఇంటికిపో!" అని అరిందము డామనిషి గుండెలపైనుంచి లేచాడు.

ఆ మనిషి బతుకుజీవుడా అని అక్కడినుంచి జారుకున్నాడు.

మర్నాడు మిట్టమధ్యాన్నంవేళ అరిందముడు వేషం వేసుకుని యదునాథుడి ఇంటికి మళ్ళీ వెళ్లాడు. అతను మారువేషం వెయ్యటంలో ఎంత ఘటికు డంటే అతన్ని బాగా ఎరిగున్నవాళ్ళుకూడా పోల్చుకోలేరు. అతను వెళ్ళేసరికి యదునాథు డప్పుడే భోంచేసి, తాంబూలం నములుతూ, హుక్కా తాగుతున్నాడు.

అరిందముడు ఆయాసం అభినయిస్తూ, "మాట రాకుండాఉంది. యదునాథ గోస్వామి ఎక్కడుంటాడు, కాస్త చెబుతారా ?" అని అడిగాడు.

"నేనే యదునాథగోస్వామిని. ఏం ? ఎక్కణ్ణుంచి వస్తున్నావు ?" అన్నాడు యదునాథుడు.

అరిందముడు ఆపసోపాలు పడుతూ, "దూరంనుంచే వస్తున్నా. మా శిష్యు డింటి నుంచే; గొప్పవాడు. శివాలయ ప్రతిష్ఠ చేశాడు. దాహం! దాహం!" అన్నాడు.

"ను వ్వెవరు ?"

"చెబుతా! కాస్త మంచినీళ్ళు! దాహం. నాలుక పీక్కుపోతున్నది."

మంచినీళ్ళు తీసుకురావటానికి గోస్వామి లోపలికి వెళ్లాడు. కిటికీవద్ద నిలబడి ఉన్న సుందరి అరిందముడికి కనబడింది. ఇంతలో గోస్వామి నీరు తెచ్చాడు. అరిందము డా నీటిని ఒక్క గుక్కలో తాగేశాడు.

"ఎవరివద్దనుంచి వస్తున్నావు?" అని గోస్వామి ఆదరంగా అడిగాడు.

"అంతా చెబుతాను; బాబూ, త్వరపడకండి. చాలా ఆయాసంగా ఉంది. కాళ్ళూ చేతులూ పీక్కుపోతున్నాయి. తల తిరుగుతున్నది. సన్నిపాతం కాదుగద? ఇం కాసిని .

మంచినీళ్లు! ఎంతదాహం!" అన్నా డరిందముడు. అతను కూర్చున్నచోటే పడిపోయి మట్టిలో పొర్లసాగాడు. చివరకు కొయ్యబారిపోయాడు.

యదునాథుడు భయపడి, భార్యను పిలిచి, ఆ వచ్చినవాడికి విసురుతూ ఉండమని చెప్పి, వైద్యుడికోసం పరిగెత్తాడు. అతని భార్య అరిందముడికి విసురుతూ కూర్చుంది. అతను మంచినీరు కావా లన్నాడు. ఆమె లేవబోతే విసరటం మానవ ద్దన్నాడు. ఆమె లోపలఉన్న పిల్లను పిలిచి, ఆమెచేతికి విసనకర్ర ఇచ్చి విసురుతూ ఉండమని, తాను నీళ్ళు తేవటానికి లోపలికి వెళ్ళింది.

అరిందముడి ఎత్తు పారింది. అత నాపిల్లతో మెల్లిగా, "యదునాథగోస్వామి నీ కేమౌతాడు?" అన్నాడు. ఆపిల్ల మాట్లాడలేదు. "నాకు తెలుసులే నీ కేమీ కాడు. భయపడకు. నాదగ్గిర ఏమీ దాచకు. నీకోసం మళ్ళీ ఉచ్చులు వేస్తున్నారు. మళ్లీ నీ కొక ఆపద రానున్నది. గౌరచంద్రు డ్నెరుగుదువా? కేశవచంద్రు డనే జమీందారు నెరుగుదువా?"

"ఎరుగుదును," అన్న దామె భయపడుతూ.

"నువు మళ్ళీ వాడిచేతికి చిక్కబోతున్నావు. ఈ కుట్రలో యదునాథుడుకూడా ఉన్నాడు. నిన్న సాయంకాలం గౌరచంద్రు డిక్కడికి వచ్చి యదునాథుడితో మాట్లాడి వెళ్లాడు. ఈరాత్రే నిన్ను కేశవచంద్రుడి కప్పగించబోతున్నారు. ఈ ఉత్తరం చూడు." అంటూ అరిందము డామె కో ఉత్తర మిచ్చాడు.

ఆమె ఉత్తరాన్ని ఇలా చదువుకున్నది.

"అయ్యా, నేను మిమ్మల్నెరగనుగాని మీ సంగతి గౌరచంద్రుడు చెప్పాడు. రేవతిని మీ కిచ్చి పెళ్ళి చేద్దామని ఆమె పినతండ్రి గోపాలచంద్రు డనుకుని, ఆమెను మీ వద్దకు పంపాడు. కాని ఆమె ఒప్పుకోలేదు. ఆమె తప్పించుకుని పారిపోయింది. ఆడపిల్లలకు చిన్నతనంలోనే పెళ్ళి చెయ్యకపోతే ఇదే చిక్కు. ఆమె మిమ్మల్ని గురించి ఏమేమో చెప్పింది, కాని నేను నమ్మలేదు. గౌరచంద్రుడు నూటయాభై రూపాయలు నా చేతిలో పెట్టి రేవతిని తీసుకుపోదా మనుకున్నాడు. మీవంటి గొప్ప వారి వివాహానికి నాకు ముట్టవలసిన గురుదక్షిణ అదేనా ? ఈ ఉత్తరం అందగానే అయిదువందలు పంపండి రేవతిని మీ వద్దకు పంపేస్తాను. ఆశీర్వాదాలు. శ్రీ యదునాథశర్మ."

ఈ ఉత్తరం చదివేసరికి రేవతికి తల తిరిగిపోయింది. యదునాథుడు తమకు గురువుగనక అతని దస్తూరి ఆమె పోల్చుకున్నది.

"మీకు ఉత్తరం ఎలా దొరికింది ?" అని ఆమె అరిందముణ్ణి అడిగింది.

అరిందము డామెతో గౌరచంద్రుడి సంగతి చెప్పి, నిర్జనప్రదేశంలో అతని పీక నొక్కిపట్టి అతని జేబులోనుంచి ఉత్తరం సంగ్రహించిన సంగతి వివరించాడు తాను పోలీసుపని చేస్తానని, రేవతి కష్టాలు తొలగించటం తన పనికి కలిసి వస్తుందనీ అన్నాడు.

"మీరు చేసేది పోలీసుపని అయితే, దొరికిన గౌరచంద్రుణ్ణెందుకు విడిచి పెట్టారు?'' అని రేవతి అడిగింది.

''వాడెక్కడికి పోతాడు? వాడు చేసిన నేరం పూర్తిగా తెలుసుకోకుండా పట్టుకో కూడదు. అతన్ని పోనిచ్చానని నాపై నీకేమీ అనుమానం వద్దు. నా వల్ల నీకే అపకారమూ జరగదు," అన్నాడు అరిందముడు.

రేవతి అతనికి తన కథంతా చెప్పింది.

వాళ్ళది వేణీమాధవపురం. మూడేళ్ళ క్రితం ఆమె తల్లీ, రెండేళ్ళ కిత్రం తండ్రీ మరణించాడు. రేవతీ, ఆమె చెల్లెలు రోహిణీ తమ పినతండ్రి గోపాలచంద్రుడి రక్షణలో ఉంటున్నారు. గోపాలచంద్రుడు తన అన్నగారితో విరోధం పెట్టుకుని భాగాలుపడి, తనవంతు సగం జమీందారీ పోగొట్టుకున్నాడు తరవాత అన్నగారు తమ్ముడిపై జాలిపడి తన ఆస్తిలో నాలుగోవంతు తమ్ముడి కిచ్చాడు; అప్పటి నుంచీ గోపాలచంద్రుడు అన్నపై భయభక్తులు కలిగిఉంటూ, అన్న పోయాక అతని కూతుళ్ళను సొంత కూతుళ్ళలాగే చూసుకుంటూ, జమిందారీ వ్యవహారం కూడా చూస్తున్నాడు.

"నన్నెలాగైనా మా పినతండ్రి దగ్గిరికి చేర్చారంటే నాకు మహోపకారం చేసినవారవుతారు," అన్నది రేవతి అరిందముడితో.

"దాని కేం భాగ్యం. కాని ఇప్పుడు నీకీ దుస్థితి ఎలా కలిగింది?'' అని అరిందము డడిగాడు.

"అ మధ్య కేశవచంద్రు డనేవాడు మా పినతండ్రి ఇంటికి రావటం సాగించాడు. అతను చాలా తియ్యటి కబుర్లు చెబుతాడు. మా పినతండ్రి అతని స్నేహం బాగా మరిగాడు. అతను ఏనాడన్నా రాకపోతే మా పినతండ్రి తకతకలాడిపోయి కబురు చేసేవాడు. కానీ వాడు మనిషికాదు, పిశాచం. వారంరోజుల క్రితం నా కేదో మత్తుమందు పెట్టి, ఒళ్లు తెలియని స్థితిలో నన్నెత్తుకొచ్చాడు. నాకు తెలిసేసరికి నేను గంగానదీతీరాన ఒక ఓడలో ఉన్నాను. అందులో కేశవచంద్రుడితోబాటు ఇంకా నలుగురైదుగు రున్నారు. ఒడ్డున భయంకరమైన అరణ్యం ఉన్నది. ఈ గౌరచంద్రుడు మాత్రం ఒడ్డున ఉండి, ''ఈ పిల్లకు స్పృహ వచ్చిన ట్టున్నది.

మంచినీళ్లు! ఎంతదాహం!" అన్నా డరిందముడు. అతను కూర్చున్నచోటే పడిపోయి మట్టిలో పొర్లసాగాడు. చివరకు కొయ్యబారిపోయాడు.

యదునాథుడు భయపడి, భార్యను పిలిచి, ఆ వచ్చినవాడికి విసురుతూ ఉండమని చెప్పి, వైద్యుడికోసం పరిగెత్తాడు. అతని భార్య అరిందముడికి విసురుతూ కూర్చుంది. అతను మంచినీరు కావా లన్నాడు. ఆమె లేవబోతే విసరటం మానవ ద్దన్నాడు. ఆమె లోపలఉన్న పిల్లను పిలిచి, ఆమెచేతికి విసనకర్ర ఇచ్చి విసురుతూ ఉండమని, తాను నీళ్ళు తేవటానికి లోపలికి వెళ్ళింది.

అరిందముడి ఎత్తు పారింది. అత నాపిల్లతో మెల్లిగా, "యదునాథగోస్వామి నీ కేమౌతాడు?" అన్నాడు. ఆపిల్ల మాట్లాడలేదు. "నాకు తెలుసులే నీ కేమీ కాడు. భయపడకు. నాదగ్గిర ఏమీ దాచకు. నీకోసం మళ్ళీ ఉచ్చులు వేస్తున్నారు. మళ్లీ నీ కొక ఆపద రానున్నది. గౌరచంద్రు డెరుగుదువా? కేశవచంద్రు డనే జమీందారు నెరుగుదువా?"

"ఎరుగుదును," అన్న దామె భయపడుతూ.

"నువు మళ్ళీ వాడిచేతికి చిక్కబోతున్నావు. ఈ కుట్రలో యదునాథుడుకూడా ఉన్నాడు. నిన్న సాయంకాలం గౌరచంద్రు డిక్కడికి వచ్చి యదునాథునితో మాట్లాడి వెళ్లాడు. ఈరాత్రే నిన్ను కేశవచంద్రుడి కప్పగించబోతున్నారు. ఈ ఉత్తరం చూడు," అంటూ అరిందము డామె కో ఉత్తర మిచ్చాడు.

ఆమె ఉత్తరాన్ని ఇలా చదువుకున్నది.

"అయ్యా, నేను మిమ్మ ల్నెరగనుగాని మీ సంగతి గౌరచంద్రుడు చెప్పాడు. రేవతిని మీ కిచ్చి పెళ్ళి చేద్దామని ఆమె పినతండ్రి గోపాలచంద్రు డనుకుని, ఆమెను మీ వద్దకు పంపాడు. కాని ఆమె ఒప్పుకోలేదు. ఆమె తప్పించుకుని పారిపోయింది. ఆడపిల్లలకు చిన్నతనంలోనే పెళ్ళి చెయ్యకపోతే ఇదే చిక్కు. ఆమె మిమ్మల్ని గురించి ఏమేమో చెప్పింది; కాని నేను నమ్మలేదు. గౌరచంద్రుడు నూటయాభై రూపాయలు నా చేతిలో పెట్టి రేవతిని తీసుకుపోదా మనుకున్నాడు. మీవంటి గొప్ప వారి వివాహానికి నాకు ముట్టవలసిన గురుదక్షిణ అదేనా? ఈ ఉత్తరం అందగానే అయిదువందలు పంపండి రేవతిని మీ వద్దకు పంపేస్తాను. ఆశీర్వాదాలు. శ్రీ యదునాథశర్మ."

ఈ ఉత్తరం చదివేసరికి రేవతికి తల తిరిగిపోయింది. యదునాథుడు తమకు గురువుగనక అతని దస్తూరి ఆమె పోల్చుకున్నది.

"మీకు ఉత్తరం ఎలా దొరికింది?" అని ఆమె అరిందముణ్ణి అడిగింది.

అరిందము డామెతో గౌరచంద్రుడి సంగతి చెప్పి, నిర్జనప్రదేశంలో అతని పీక నొక్కిపట్టి అతని జేబులోనుంచి ఉత్తరం సంగ్రహించిన సంగతి వివరించాడు తాను పోలీసుపని చేస్తానని, రేవతి కష్టాలు తొలగించటం తన పనికి కలిసి వస్తుందనీ అన్నాడు.

"మీరు చేసేది పోలీసుపని అయితే, దొరికిన గౌరచంద్రుణ్ణెందుకు విడిచి పెట్టారు ?'' అని రేవతి అడిగింది.

''వా డెక్కడికి పోతాడు ? వాడు చేసిన నేరం పూర్తిగా తెలుసుకోకుండా పట్టుకో కూడదు. అతన్ని పోనిచ్చానని నాపై నీకేమీ అనుమానం వద్దు. నా వల్ల నీకే అపకారమూ జరగదు," అన్నాడు అరిందముడు.

రేవతి అతనికి తన కథంతా చెప్పింది.

వాళ్ళది వేణీమాధవపురం. మూడేళ్ళ క్రితం ఆమె తల్లీ, రెండేళ్ళ క్రితం తండ్రీ మరణించారు. రేవతీ, ఆమె చెల్లెలు రోహిణీ తమ పినతండ్రి గోపాలచంద్రుడి రక్షణలో ఉంటున్నారు. గోపాలచంద్రుడు తన అన్నగారితో విరోధం పెట్టుకుని భాగాలుపడి, తనవంతు సగం జమీందారీ పోగొట్టుకున్నాడు తరవాత అన్నగారు తమ్ముడిపై జాలిపడి తన ఆస్తిలో నాలుగోవంతు తమ్ముడి కిచ్చాడు; అప్పటి నుంచీ గోపాలచంద్రుడు అన్నపై భయభక్తులు కలిగిఉంటూ, అన్న పోయాక అతని కూతుళ్ళను సొంత కూతుళ్ళలాగే చూసుకుంటూ, జమిందారీ వ్యవహారం కూడా చూస్తున్నాడు.

"నన్నెలాగైనా మా పినతండ్రి దగ్గిరికి చేర్చారంటే నాకు మహోపకారం చేసినవా రవుతారు," అన్నది రేవతి అరిందముడితో.

"దాని కేం భాగ్యం. కాని ఇప్పుడు నీకీ దుస్థితి ఎలా కలిగింది ?'' అని అరిందము డడిగాడు.

"అ మధ్య కేశవచంద్రు డనేవాడు మా పినతండ్రి ఇంటికి రావటం సాగించాడు. అతను చాలా తియ్యటి కబుర్లు చెబుతాడు. మా పినతండ్రి అతని స్నేహం బాగా మరిగాడు. అతను ఏనాడన్నా రాకపోతే మా పినతండ్రి తకతకలాడిపోయి కబురు చేసేవాడు. కానీ వాడు మనిషికాదు, పిశాచం. వారంరోజుల క్రితం నా కేదో మత్తుమందు పెట్టి, ఒళ్లు తెలియని స్థితిలో నన్నెత్తుకొచ్చాడు. నాకు తెలిసేసరికి నేను గంగానదీతీరాన ఒక ఓడలో ఉన్నాను. అందులో కేశవచంద్రుడితోబాటు ఇంకా నలుగురైదుగు రున్నారు. ఒడ్డున భయంకరమైన అరణ్యం ఉన్నది. ఈ గౌరచంద్రుడు మాత్రం ఒడ్డున ఉండి, ''ఈ పిల్లకు స్పృహ వచ్చిన ట్టున్నది.




ఈమె నెక్కడికి తీసుకుపోవాలి?" అని అడిగాడు. అతని కంఠం వింటే భయమయింది. అయితే కేశవచంద్రుడు నా దగ్గిరికి వచ్చి, నా ముక్కుదగ్గిర రుమాలుతో విసిరాడు. నాకు మళ్ళీ తెలివి తప్పింది. తిరిగి నాకు స్పృహ వచ్చేటప్పటికి నేను అరణ్యం మధ్య ఒక పాడుపడిన కొంపలో ఖైదీగా ఉన్నాను. రోజూ కేశవచంద్రుడు వచ్చేవాడు. బలాత్కారంగానైనా సరే నన్ను పెళ్ళాడటానికే ఇలా చేశానని నాతో అన్నాడు. అనేక రకాల నన్ను భయపెట్టాడు. కాని అతన్ని పెళ్ళాడేకన్న చావటం మేలని నాకు తోచింది. అందుచేత నేను పెళ్ళికి ఒప్పుకోలేదు. గౌరచంద్రుణ్ణి నాకు కాపలాపెట్టాడు. చివరకు కేశవచంద్రుడిభార్యే నన్ను ఖైమ విడిపించింది. అడివిలోపడివచ్చి ఈ ఊరు చేరాను. కుంభవర్షం కురుస్తున్నది, గోస్వామిమఠంలో మా గురువుగారైన గోస్వామిగారి దగ్గిరికి పోదామని దోవ అడగటానికొక అంగడివద్దకు వెళ్లాను. అంగడిలో ఉన్న వాళ్ళు నాకు దోవ చెప్పారు. నేను చెరువుగట్టు చేరేసరికి వెనకనుంచి గౌరచంద్రుడు వచ్చాడు. అతనికి కనబడకుండా నే నొక పొదచాటున దాగాను. అతను నన్ను చూడక ముందుకు వెళ్ళిపోయాడు. నే నెలాగో ఈ గ్రామానికి చేరుకున్నాను. నా చీరెచెంగు పొదకు తగులుకున్నది. గౌరచంద్రుడే అనుకుని ఏడవసాగాను. వెనక్కు తిరిగి చూడటానిక్కూడా భయంవేసింది. నేను ఏడుస్తూ పడబోయేసరికి యదునాథ

స్వామి వచ్చి నన్ను పట్టుకున్నాడు. నేను పడటంలో తలకు దెబ్బతగిలి రక్తం కారింది. గోస్వామికి నా సంగతంతా చెప్పి, నన్ను వారింట రెండురోజు లుండ నిమ్మన్నాను. ఆయన సరే నని నన్ను ఇక్కడికి తెచ్చాడు. ఆయన తన పాతఇంట ఉండటం లేదట; దాన్ని తన చెల్లెలి కిచ్చి ఇక్కడ ఉంటున్నాడని నాకు తెలిసింది. నేను చచ్చిపోయినానని తెలిస్తే నాకోసం ఎవరూ వెతకరనే ఉద్దేశంతో, రక్తంతో తడిసిన బట్టా, ఒక కత్తీ, నా తలపిన్నులూ తెచ్చి — నేను కెవ్వున అరిచినచోట చెట్లమధ్య పారేశాడు. డబ్బుకోసం యదునాథుడు నాకు ద్రోహం చేస్తాడని నమ్మ లేకుండా ఉన్నాను. మా తండ్రి ఆయన కెన్నోసార్లు ధనసహాయం చేశాడు. అదంతా మరిచిపోయి కృతఘ్ను డవుతాడా? అలా అయితే ప్రపంచంలో ఎవరినిగాని ఎలా నమ్మటం?" అంటూ రేవతి ఏడవసాగింది.

రేవతి చెప్పిన విషయాలు అరిందముడు ఊహించిన విషయాలకు అనుగుణంగానే ఉన్నాయి.

"కేశవచంద్రుణ్ణి గురించి నీ కింకేమైనా తెలుసా?" అన్నా డతను.

"తెలీదు. నన్ను ఈ ఆపదనుంచి కాపాడి మా పినతండ్రివద్దకు చేర్చండి. మీకు పుణ్యం ఉంటుంది," అన్న దామె.

"నీకు పద్దెనిమిదేళ్ళకు తక్కువ ఉన్నట్టు లేవే, ఇంకా పెళ్ళి ఎందుకు కాలేదు?" అని అరిందము డడిగాడు.

రేవతి సిగ్గు పడుతూ, "మా నాన్న బతికుంటే అయేదే. ఆయన దక్షిణ భవానీపురంలో నాకు సంబంధం కూడా నిశ్చయించాడు. కాని అంతలోనే ఆయనకు జబ్బుచేసింది. జబ్బేమిటో కూడా వైద్యులకు అంతుచిక్కలేదు. ఆరు నెల్లు తీసుకుని ఆయన పోయాడు," అన్నది.

"ఆతరవాత మీ పినతండ్రిఅయినా ఇన్నాళ్ళు నీ పెళ్ళి చేశాడు కాదేం?"

"మా జమీందారీ వ్యవహారాలతో ఆయనకు ఊపిరి సలపటంలేదు."

"ఆయనకు నీ పెళ్ళి చెయ్యటానికి తీరిక లేదుగాని రోజూ కేశవచంద్రునితో వినోద కాలక్షేపాలు చెయ్యటానికి తీరిక ఉన్నది! నీ మీద ఆయన కెంతో ప్రేమ అన్నావే. నీ పెళ్ళి మాట చూడకుండా ఆయనకు తిండి ఎలా లోపలికి పోతున్నది? నిద్ర ఎలా పడుతున్నది? పెళ్ళి చేస్తే నిన్నత్తవారింటికి పంపాలిసొస్తుందని భయమేమో?"

ఈ మాటలు రేవతికి అర్థంకాలేదు. అత నామెకు చెప్పవలిసిన విషయా లన్నీ చెప్పి, ఈ ఆపదనుంచి ఆమె నెలా తప్పించబోతున్నది కూడా చెప్పాడు. అంతా విన్నాక రేవతికళ్ళలో ఉండిన భయంకాస్తా పోయింది...




మూర్ఛపోయిన ముసలాడికోసం నీరు తేవటానికి లోపలికి వెళ్ళిన గోస్వామి భార్య నీళ్ళచెంబుతో అప్పుడే తిరిగివచ్చింది. ఆమె చాటున నిలబడి అరిందముడూ, రేవతీ చేసే సంభాషణ శ్రద్ధగా ఆలకించింది. వాళ్ళ సంభాషణ అంతా వినిపించలేదు. వినిపించిందికూడా కొంతే అర్థమయింది.

రేవతి ముఖంలోని మార్పు గమనిస్తూ ఆమె తన చేతిలోని నీటిచెంబును జారవిడిచింది.

"మంచినీళ్ళు అవసరంలేదులే," అంటూ అరిందముడు వెళ్ళిపోవటానికి లేచాడు.

యదునాథగోస్వామి వైద్యుణ్ణి తీసుకునివచ్చాడు. భార్య అతనితో లేనివీ ఉన్నవీ చెప్పి, "ఈ అమ్మాయి ఎవరు? ఎందుకు వచ్చింది?" అని ప్రశ్నలు వేసింది. యదునాథుడికి నోట మాటరాలేదు.

మరికొంత సేపటికి రేవతి మాతామహుడు పోలీసులతోసహా వచ్చాడు. రేవతి చప్పున బయటికి వచ్చి తన తాతను గుర్తించింది. పోలీసులు రేవతిని ఆ మనిషికి వప్పగించారు. పోలీసులతోబాటు అరిందముడూ, యోగీంద్రుడూ కూడా వచ్చారు.

అరిందముడు యదునాథుడితో, "ఏం మహాశయా, అయిదొందలూ చెయ్యిజారి పోయాయి. మీరు అడవిలో పారేసిన కత్తి రాజాలో ఉన్నది వెళ్ళి తెచ్చుకోండి. మీరు చాలా మంచివారు. సరదాకోసం ఈ పని చేశారు,'' అన్నాడు.

యదునాథు దేమీ అనలేదు. ఇలాటి పరిణామం ఎలా జరిగినదీ ఆయనకు అంతు చిక్కలేదు

# ద్వితీయ ఖండం

అరిందముడికి విశ్రాంతి లేదు. పెట్టెలో దొరికిన బాలిక శవం కేసులో హంతకు డెవరో తెలియనేలేదు. రేవతి ఉదంతానికీ, ఆ హత్యకూ ఏదో సంబంధం ఉన్నట్టు అతనికి తోచిందేగాని, ఆ సంబంధం ఏమిటో అంతుచిక్కలేదు. అందుకుగాను అతను ఎన్నోచోట్లకు వెళ్లాడు. ఎన్నో గాలికబుర్లు ఆలకించాడు కాని పని జరుగ లేదు. అతనివంటి గొప్ప డిటెక్టివ్ ఈ రహస్యం ఛేదించలేకపోవటం ఒక అవ మానంగాకూడా ఉన్నది.

ఒకనాటి సాయంకాలం అతను తన యింటికి రెండుమైళ్ళ దూరాన ఉన్న లోక నాథపురం వెళ్ళి సూర్యాస్తమయంవేళకు ఇంటికి బయలుదేరాడు. లోకనాథపురం లోని విమలీసరోవరంలో ఒక అమ్మాయి ఈతలు కొట్టుతూ అతనికి కనిపించింది. ఆమె అసాధారణ సౌందర్యవతిగా కనబడింది. ఆ ప్రాంతాల ఎవరూ లేకుండాపోయే దాకా ఆమె సరోవరం మెట్లపైన కూర్చుని ఆమె తిరిగి నీటిలోకి ఈదుకుంటూపోయి. దూరాన మునిగింది. ఇదంతా దూరంనుంచి గమనించిన అరిందముడు ఆమె ఎంతకీ తేలకపోవటం చూసి, ఏదో ప్రమాదం జరిగిందని శంకించి, చప్పున నీటిలో దూకి ఆమెను బయటికి తీసుకొచ్చాడు.

ఆమెకింకా స్మృతి ఉన్నది గాని, శక్తి ఏమాత్రమూ లేకుండాపోయింది. త్వర లోనే అక్కడ అనేకమంది చేరారు. వారి సహాయంతో అతను ఆమె తాగిన నీటిని కక్కించాడు. దానితో ఆమె చాలావరకు తేరుకున్నది. ఆమెపేరు కుల్సుమ్ అనీ, ఆఊరి సంపన్నుడి కూతురనీ అరిందముడు గ్రామస్తులద్వారా తెలుసుకున్నాడు.

కుల్సుమ్ అరిందముడితో, "నన్ను సుఖంగా చావనివ్వక ఎందుకింత శ్రమ పడ్డారు?" అన్నది.

అరిందముడు దానికేమీ జవాబివ్వక ఆమె తండ్రి అయిన తమీజుద్దీను ఇంటికి చేర్చాడు. కుల్సుమ్‌వెంట చాలామంది రావటం ఇంట్లో తెలిసింది. ఇద్దరుముగ్గురు మనుష్యులు బయటికి వచ్చి లక్సుమ్‌ను లోపలికి తీసుకుపోయారు.

తమీజుద్దీనుకూడా బయటికి వచ్చి, వణికేగొంతుతో అరిందముడికి తన కృతజ్ఞత తెలుపుకున్నాడు. ఆయన విశేషంగా మాట్లాడలేకపోగా, నిలువునా కంపిస్తూ పడిపోయే లాగా కనపడ్డాడు. అరిందము డాయన్ను పట్టుకుని లోపలి గదిలోకి తీసుకుపోయి పడుకోబెట్టాడు. అనేకమంది కంగారుగా అక్కడికి వచ్చారు. అంతలోనే ఆయన కన్ను మూసేశాడు.

ఆయనభార్య మత్ బీబీ, ఇర వైఅయిదేళ్ళ వయసుది, గొల్లున ఏడవసాగింది.

ఆ ఇంటికి పూల్‌సాహెబనేవాడు వైద్యుడని అరిందము డా వైద్యుణ్ణి పిలుచుకు రమ్మని ఒక నౌకరును పంపాడు అంతలోనే కుల్సమ్‌కూడా అక్కడికి వచ్చి తండ్రి మీదపడి ఏడవసాగింది.

అరిందముడు తమీజుద్దీనును పరీక్షించి, "అమ్మా, మీ తండ్రి ఇంకా బతికే ఉన్నా డనుకుంటాను. మీ డాక్టరు పూల్‌సాహెబు వొస్తున్నాడు," అన్నాడు.

"పూల్‌సాహెబా? నా తండ్రికి శత్రువు! నాకు శత్రువు! పిశాచం! రాక్షసుడు!" అంటూ కుల్సమ్ ఏడవసాగింది.

త్వరలోనే పూల్‌సాహెబ్ వచ్చాడు; తమీజుద్దీనును పరీక్షించి, "ప్రాణం పోయింది. ఇంత అకస్మాత్తుగా ఎలా పోయాడో తెలియటం లేదు," అన్నాడు.

"ఈ అనర్థానికి కారణం కుల్సమే. నీటిలో పడి ఆత్మహత్య చేసుకోవటానికి ప్రయత్నించింది. దాంతో కొంపమునిగింది," అంటూ మత్ బీబీ కన్నీరు కార్వ సాగింది.

పూల్‌సాహెబ్ అరిందముడి పేరూ, నివాసమూ అడిగాడు.

"నా పేరు అరిందముడు, నేనుండేది యదునాథపురంలో. నేను త్వరగా ఇంటికి వెళ్ళాలి, సెలవిప్పించండి," అన్నాడు అరిందముడు.

పూల్‌సాహెబ్ కుల్సమ్‌నూ, మత్ బీబీనీ లోపలికి వెళ్ళమని, అరిందముడితో, "దయచేసి మీరు కొంచెంసేపాగండి. నేను లోపల మాట్లాడి, నిమిషంలో వస్తాను," అని చెప్పి, నౌకర్లకు పనులు పురమాయించి, లోపలికి వెళ్ళాడు.

డాక్టరు లోపలికి పోగానే కుల్సమ్ కంగారుపడుతూ, అరిందము డున్న గదిలోకి వచ్చింది. అరిందము డనుకున్నట్టు ఆమె వచ్చినది తన తండ్రిని మరొకసారి చూడటానికి కాదు. ఆమె అతనితో, "అరిందమబాబూ, ఈ డాక్టరు సామాన్యుడు కాడు. మిమ్మల్ని మోసం చేసేటట్టున్నాడు," అన్నది.

ఆమె మాటలు కొంచెంకూడా అర్థంకాక అరిందము డామెకేసి, 'మతిచలించిందా' అన్నట్టు చూశాడు.

"చూడండి. ఈ డాక్టరే మా నాన్నని చంపాడు, ఈ పూల్‌సాహెబెవడో మాకు తెలియికముందు మా నాన్న చాలా ఆరోగ్యంగా ఉండేవాడు. ఈ రెండేళ్ళలో ఆయన ముసలి వగ్గయిపోయాడు. నిక్షేపంలాంటి మా సంసారం బుగ్గయి పోయింది. ఈ పూల్‌సాహెబు సంగతి నాకు బాగా తెలుసు. అతను భయంకరుడు. మీ కేదో ఆపద తెచ్చిపెడతాడు, జాగ్రత్త," అన్నది కుల్సమ్.

ఆ చెప్పేది కొంచెం స్పష్టంగా చెప్పమన్నాడు అరిందం. కాని ఫూల్‌సాహెబు తిరిగివస్తాడనీ, తనకు శాస్తి జరుగుతుం దనీ భయపడింది.

"అతని చల్లని మాటలూ, ప్రశాంతతా చూసి ఎలాటి మనిషైనదీ ఎవరు గ్రహించగలరు ? ఇంతకుపూర్వం ఇక్కడ వగలఏడ్పు లేడ్చినామె నా సవతి తల్లి. అసాధ్యురాలు; ఆమె కీ డాక్టరుతో స్నేహం. చివరకు నాగతి ఇలా వచ్చింది! తల్లి లేదు, తండ్రి లేదు, అన్న లేదు, తమ్ముడు లేదు, విలువ నీడకూడ లేదు. నాగతి ఏం కానున్నదో!" అన్నది కుల్సమ్ కన్నీరు కార్చుతూ.

ఫూల్‌సాహెబ్ వాళ్ళఇంట అడుగుపెట్టిన రెండుమాసాలకు తన తల్లి పోయిందనీ, మరో పది నెల్లకు తన తమ్ముడు, తనకన్న రెండేళ్ళు చిన్నవాడు, పోయాడనీ, తన తండ్రి ఆరోగ్యం చెడిందనీ, ఇదంతా చెయ్యటంలో అతని కేదో దురుద్దేశం ఉంటుం దనీ, అతను తననుకూడా బతకనివ్వడనీ ఆమె అన్నది.

"ఎందువల్ల ?" అన్నాడు అరిందముడు.

"నేను తనని పెళ్ళాడకపోతే చంపేస్తాడు. నేను దుర్మార్గుణ్ణి పెళ్లాడి బతికున్నన్నాళ్లూ నరకం అనుభవించేకన్న చావటం మేలు. ఇంతకూ నేను నా కష్టాలు చెప్పుకోవటానికి రాలేదు. మిమ్మల్ని జాగ్రత్తగా ఉండమని చెప్పటానికి వచ్చాను. మీ రత న్నెరగరుగాని, మిమ్మల్ని అత నెరుగు. మీ పేరు వినగానే అతని కళ్ళు గప్పున మండాయి. ఇక నేను పోతాను," అంటూ కుల్సమ్ లేచింది.

"నీ కవసరమని తోచినప్పుడు నీ సమాచారం ఈ చిరునామాకు తెలియచెయ్యి." అంటూ అరిందముడామెకు ఒక కాగితం ఇచ్చాడు. ఆమె వెళ్ళిపోయింది.

కొంచెం సేపటికి ఫూల్‌సాహెబు నిశ్శబ్దంగా వచ్చి, ఆలస్యమైనందుకు అరిందముడికి క్షమాపణ చెప్పుకున్నాడు.

"ఫరవాలేదు లెండి. ఆడవాళ్ళ నూరడించి వచ్చారు కద ?" అన్నాడు అరిందముడు.

"మత్ బీబీ నాకు దూరపు బంధువు. అలాటి గుణవతులు అరుదు. అందుకే నా కామె అంటే అభిమానం. కుల్స మేదీ ? ఏడుస్తూ ఇలా వచ్చిందే ?"

"ఇక్కడికి రాలేదు," అన్నా డరిందముడు.

"పోదాం పదండి."

ఇద్దరూ మాట్లాడుకుంటూ బయల్దేరారు. కొంతదూరం వెళ్ళాక ఫూల్‌సాహెబ్ ఒకచుట్ట తీసి వెలిగిస్తూ, "మీకు చుట్ట కాల్చే అలవా టుందా ?" అని అడిగాడు.

"అలవాటు లేదు, కాని ఎప్పుడన్నా కాలుస్తాను," అన్నా డరిందముడు.




"నే నొక చుట్ట ఇస్తాను, కాల్చి చూడండి. చాలా బాగుంటుంది." అంటూ ఫూల్‌సాహె బొక చుట్టతీసి అరిందముడి కిచ్చాడు. తరవాత కాలుస్తా నని చెప్పి అరిందముడు దాన్ని జేబులో వేసుకున్నాడు.

మరికొంత దూరం నడిచి, దారులు చీలే చోట వా రిద్దరూ విడిపోయారు. కుల్సమ్ అన్నమాటలను బట్టి, ఫూల్‌సాహెబు తనను ఒంటరిగా చూసి చంప యత్నిస్తా డేమో నని అరిందము డనుకున్నాడు, కాని అలాటి దేమీ జరగలేదు. అరిందముడికి కుల్సమ్ మాటల్లో నమ్మకం పోయింది.

అతను కామదేవపురం చేరి ఇంటికి పోయే ముందు ఠాణాకు వెళ్ళాడు. యోగీంద్రు డేదో రాసుకుంటూ అరిందముణ్ణి చూసి, "ఆపిల్ల శవం భోగట్టా ఏమైనా తెలిసిందా, అరిందమబాబూ?" అని అడిగాడు.

"ఇంకా ఏమీ తెలియలేదు," అన్నా డరిందముడు.

"రేవతి కేసులో కేశవచంద్రుణ్ణి గురించి?"

"లేదు తెలిస్తే ఉత్తరం రాసేవాణ్ణిగా. అది సరేకాని, ఫూల్‌సాహెబనే డాక్టరు తెలుసా? ఎవ రతను?" అని అరిందము డడిగాడు.

"ఫూల్‌సాహెబా? ఈ ప్రాంతంలో అందరికీ తెలిసినవాడే. ఈఊళ్లో చాలమందికి వైద్యం చేస్తాడు. ఏమిటి విశేషం?"

ముందు నే నడిగేది చెప్పు. తమీజుద్దీను తెలుసా?"

"తెలీకేం? అతను గొప్ప జమీందారు. రెండేళ్ళుగా జబ్బుతో తీసుకుంటున్నాడు. ఈ మధ్యలోనే భార్య మరణించింది. అతను మళ్ళా పెళ్ళాడటానికి కూతురు ఒప్పుకోలేదు. కూతురంటే అతనికి పంచప్రాణాలు. అందుచేత కూతురికి తెలియకుండా రహస్యంగా రెండోపెళ్ళి చేసుకున్నాడు. రెండవ భార్య పూల్‌సాహెబు బంధువురాలే అని విన్నాను. పెళ్ళికూడా పూల్‌సాహెబ్ ప్రయత్నం మీదనే అయిందట. పెళ్ళికి ముందే అతను తన ఆస్తి అంతా కుమార్తె పేర రాసేశాడు. అతని అనంతరం తన కొక్కదమ్మిడీ కూడా దక్కదని తెలిసి రెండోభార్య అల్లరిపెట్టి, ఆత్మహత్య చేసకుంటా నని అఘాయిత్యం చేస్తే, తన అనంతరం ఆమె కొక లక్ష రూపాయలు చెందేటట్టు రాశాడు," అన్నాడు యోగీంద్రుడు.

"తమీజుద్దీన్ చచ్చిపోయాడు".

"ఆఁ? ఏమిటీ!"

"ఈ సాయంకాలం నా చేతుల్లో నే ప్రాణాలు వదిలాడు. ఇప్పు డతని ఆస్తి కంతకూ కూతురే వారసురా లన్నమాట. అతని జమీందారీమీద ఎంత ఆదాయం వస్తుందో?"

"ఇంచుమించు ఇరవై లక్షలు".

"ఇరవై లక్షలే? అయితే, చెప్పు పూల్‌సాహెబ్ బ్రహ్మచారేనా?"

"పెళ్ళి అయింది, భార్య పోయిఉంటుంది. ఎందు కలా అడుగుతున్నారు?"

"తమీజుద్దీన్ కూతుర్ని అతను పెళ్ళాడ ప్రయత్నిస్తున్నాడు."

"పూల్‌సాహె బంతటివాడే అయితే తమీజుద్దీను కూతురు పిచ్చిదని విన్నాను."

"దానికేంగాని, నాకు పూల్‌సాహెబు గురించి తెలుసుకోవాలని ఉన్నది. ఒక ప్పుడు నేను హంతకుణ్ణి వర్ణించానే. ఆ వర్ణన పూల్‌సాహెబుకు చాలావరకు సరిపోతుంది."

"మీ దృష్టి పూల్‌సాహెబుమీదికి పోతున్న దెందుకూ?"

"అతను కుల్సమ్‌ను పెళ్లాడి ఆమె ఆస్తిఅంతా స్వాధీనం చేసుకోవాలని చూస్తు న్నాడు. కుల్సమ్ నెలాగైనా రక్షించాలి."

అరిందము డింటికి వెళ్ళి, రెండవ అంతస్తులో ఉన్న తన పడకగది చేరు కున్నాడు. పొద్దుటినుంచీ భోజనం చెయ్యకపోవటంచేత ఆకలి దహించుకుపోతు న్నది. వంటవాడు అతని భోజనాన్ని గదిలో పెట్టేసి వెళ్ళి పడుకున్నాడు. అరింద




ముడు ఆత్రంగా భోజనం ముగించి పడుకున్నాడు, కాని అతనికి నిద్రపట్టలేదు, అతని మనసు కుల్సుంగురించీ. ఫూల్‌సాహెబు గురించీ ఆలోచిస్తున్నది.

అతను ఫూల్‌సాహెబ్ ఇచ్చిన చుట్ట అంటించి కాలుస్తూ, తాను ఇంతకాలంగా వెతుకుతున్న హంతకుడు ఫూల్‌సాహెబే అన్న నిర్ధారణకు వచ్చాడు. ఇలా అనుకుంటుండగానే అతనికళ్ళు బరువెక్కి మూతపడిపోయాయి. ఏదో మత్తుగా ఉన్నది. తల వెనక్కు పడిపోతున్నది. 'బలిష్ఠమైన శరీరం. అయిదున్నర అడుగుల మనిషి. నలభైలోపు వయస్సు. ఇంచుమించు తెల్లని శరీరచ్ఛాయ.' అరిందముడికి ఆవలింతలు వచ్చాయి.

త్వరలోనే అతనికి చుట్టసంగతి తట్టింది. అందులో ఏదో విషమున్నది. ఆ పిల్లను చంపినవాడు తననుకూడా చంపుతానన్నాడు! అంతపనీ చేశాడు.

అతనికి కళ్ళు కనిపించటంలేదు. స్పృహ తప్పిపోకుండా ఉండటానికి అతను విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అతను ఎలాగో బల్లదగ్గిరికి వెళ్ళి, కాగితమూ, కలమూ తడివితీసుకుని, "యోగీంద్రబాబూ, ఫూల్‌సాహెబే ఆపిల్లను చంపినవాడు. వాడే నాకు విషప్రయోగం చేశాడు. వెంటనే పట్టుకోకపోతే నిన్నుకూడా..." అని రాశాడు. పైన రాత సాగలేదు. రాసినదికూడా గజిబిజిగా ఉన్నది. స్పృహ

పోకుండా ఉండటానికి కలంపాళీతో తనను తాను గుచ్చుకున్నాడు. కొంచెం బాధ తెలిసి తెలివివచ్చింది.

నౌకరును కేకపెట్ట యత్నించాడు. వాడి చేతికి ఉత్తర మిచ్చి యోగీంద్రుడి దగ్గిరికి పంపాలని అతని ఉద్దేశం. కాని తన గొంతు తనకే వినిపించలేదు. ఎక్కడో పడుకుని గుర్రుపెట్టి నిద్రపోయే నౌకరు కేమి వినిపిస్తుంది? తనే వాడున్న చోటుకి పోదామని బయలుదేరి అతను తలుపు కేసి వెళ్ళటానికి బదులుగా కిటికీ కేసి వెళ్ళి, అందులోనుంచి పోవ యత్నించేసరికి తలకు బలమైన దెబ్బ తగిలింది. అతను చేతిలో ఉన్న ఉత్తరాన్ని కిటికీలోనుంచి బయటి వరండాలోకి పారేసి, కుప్పకూలి చచ్చినవాడిలాగా పడిపోయాడు.

మర్నాడుదయం వంటవాడు బజారుకు పోబోతూ డబ్బులకోసం వస్తే అరిందము డింకా నిద్రపోతున్నట్టు కనిపించింది. రెండుమూడుసార్లు పిలిస్తే సమాధానం రాలేదు. కిటికీవద్దకు వచ్చిచూస్తే అరిందముడు కుప్పకూలిఉండటం కనబడింది. వంటవాడు కిటికీ బయట పడిఉన్న కాగితం చూసి, తీసి అతికష్టంమీద చదివి సంగతి గ్రహించాడు. అతను వెంటనే ఆ ఉత్తరం తీసుకుని ఠాణాకు పరిగెత్తాడు.

యోగీంద్రుడు ఠాణాలో లేడు. అక్కడ ఒక పహరావాడూ, ఇద్దరు పోలీసులూ ఉన్నారు. వంటవాడు ఉత్తరాన్ని పహరావాడి కిచ్చి జరిగినది చెప్పాడు. పహరావా డొక జమేదారు కా ఉత్తరం ఇచ్చి యోగీంద్రు డింటికి పంపి, తాను అరిందము డింటికి బయలుదేరాడు. రెండో జమేదారు వాడి డ్యూటీ పుచ్చుకున్నాడు.

పహరావాడు అరిందముడి పడకగది తలుపు పగలగొట్టి అరిందముణ్ణి పరీక్షించాడు. వంటవాడూ, నౌకరూ సహాయంచేసి అరిందముణ్ణి మంచంమీద పడుకోబెట్టారు. అతనికి శ్వాస ఆడటంలేదు. కాని ఒళ్ళింకా వెచ్చగానే ఉంది.

వంటవాడు వెళ్ళి ఒక డాక్టరును పిలుచుకొచ్చాడు. ఆ డాక్టరెవరో కాదు; ఫూల్‌సాహెబే. అతన్ని చూసి పహరావాడు చాలా సంతోషించి, "మీరే వచ్చారా? మా కిప్పుడు ధైర్యం వచ్చింది," అన్నాడు.

"ఈ పక్కనే ఒక రోగిని చూడవచ్చాను ఇంతలో ఈ మనిషి వచ్చి నన్ను రమ్మన్నాడు. ఏమిటి విశేషం?" అని ఫూల్‌సాహెబ్ అడిగాడు అతను అరిందముణ్ణి పరీక్షించి, "ఇంకేముంది? అంతా అయిపోయింది!" అన్నాడు.

పహరావాడు ఆదిరిపోయి, "హోయారా? ఎంత ఘోరం జరిగింది! జబ్బేమి టంటారు?" అన్నాడు

"గుండెజబ్బులా గుంది. పరీక్ష చేస్తేగాని తేలదు," అన్నాడు ఫూల్‌సాహెబు.

"ఆత్మహత్య కాదుగద ?"

"అదీకావచ్చు. మరణకారణం ఫలానా అనటాని కేమీ కనిపించటంలేదు."

"పూర్తిగా ప్రాణం పోయినట్టేనా?"

"ఆహా."

ఇంతలో యోగీంద్రు డక్కడికి వచ్చాడు. అతనికి అరిందముడు ఉత్తరం అంద లేదు. ఆ ఉత్తరం చేరేలోపుగా అతను మరొకదారిన ఠాణాకు వచ్చి, రెండో జమేదారు ద్వారా విషయం తెలుసుకుని వచ్చేశాడు.

అతను ఫూల్‌సాహెబును చూసి, "ఎలాగైనా అరిందముణ్ణి బతికించలేరా ?" అని అడిగాడు. అత నింకా అరిందముడి ఉత్తరం చూడలేదు. అందుచేత ఫూల్ సాహెబు సంగతి తెలియదు.

"నా చెయ్యి మించిపోయింది," అన్నాడు ఫూల్‌సాహెబు. "ఏమాత్రం ఆశ ఉన్నా నేను చూస్తూ ఊరుకుంటానా?"

ఫూల్‌సాహెబు సెలవుపుచ్చుకుని వెళ్ళిపోయాడు. యోగీంద్రుడు అరిందముణ్ణి ఒక మేనాలో తన యింటికి తీసుకుపోయాడు. అప్పుడతను అరిందముడి ఉత్తరం చదువుకుని ఫూల్‌సాహెబు సంగతి తెలుసుకున్నాడు. అతను గొప్ప డాక్టర్ల కోసం కబురుచేసి, తానే అరిందము డింటికి స్వయంగా వెళ్ళి సగం కాల్చిపారేసిన చుట్టను వెతికితెచ్చాడు.

కలకత్తానుంచి ముగ్గురు పెద్ద డాక్టర్లు వచ్చి, తెల్లవార్లూ అరిందముడి విషయం చూసి, తెల్లవారుజామున కలకత్తాకు తిరిగి వెళ్ళిపోయారు.

తెల్లవారుతూనే మేనాలో ఒక స్త్రీ యోగీంద్రు డింటికి వచ్చి, లోపలి వసారాలో యోగీంద్రుణ్ణి చూసి. "ఆయన కెలా ఉన్నది ?" అని అడిగింది ఆదుర్దాగా.

"ఎవరికి ?" అన్నాడు యోగీంద్రు డాశ్చర్యంతో.

"అరిందమబాబుకు. ఆయన బతికి ఉన్నారా ?"

"డాక్టరు ఫూల్‌సాహెబు చూసి, బతకడని చెప్పిపోయాడు."

"ఆ రాక్షసుడా ? అరిందముణ్ణి చంపించేవాడు!" అన్నది కుల్సమ్.

"అలాగా ? నువ్వెవరు ? ' అని యోగీంద్రు డడిగాడు.

"తయిజుద్దీను కూతుర్ని, నా పేరు కుల్సమ్. ఫూల్‌సాహెబిచ్చిన విషపుచుట్టను అరిందముడు కాల్చాడా ?"

"కాల్చాడు "

"ఎంతపని జరిగిందీ ? నన్నాయనవద్దకు తీసుకపోండి. ఆయనను బతికిస్తాను. నా ప్రాణా లాయన కాపాడాడు."

"ఎలా బతికిస్తావు ?"

"ఆ విషం అంతత్వరగా చంపదు. చచ్చిపోయినట్టు కనిపించినా ప్రాణం ఇంకా ఉంటుంది. దానికి విరుగుడుకూడా నాకు తెలుసు. ఇదంతా ఫూల్‌సాహెబ్ నా సవతితల్లితో చెప్పేటప్పుడు చాటునుంచి విన్నాను."

అరిందముడు చావలేదు. చాలా కష్టపడ్డమీదట అతను బతికాడు.

కుల్సమ్ శరీరం ఆనందంతో ఒక్కసారి కంపించింది.

అరిందము డక్కడికి వచ్చాడు. అతని మొహం వాడిపోయి కళహీనంగా ఉన్నది. మనిషి గుర్తించరాకుండా ఉన్నాడు.

"ఏం; కుల్సమ్ ? నన్ను చూడవచ్చావా ? నేను చావలేదు. నిన్ను కొన్ని విషయా లడాగాలి, చెబుతావా ?"

"తప్పకుండా చెబుతాను. ఇప్పుడు నాకు మరో కష్టం వచ్చిపడింది. రెండు మూడు రోజుల్లో ఫూల్‌సాహెబ్ నన్ను పెళ్ళాడబోతున్నాడు. నేను పెళ్ళికి ఒప్పుకోకపోతే వాళ్ళు నన్ను చంపటానికి నిశ్చయించుకున్నారు. వాళ్ళ రహస్య సంభాషణ విన్నాను," అన్నది కుల్సమ్.

"వాళ్ళంటే ? రెండోవా రెవరు ?"

"ఇం కెవరు ? ఆ రాక్షసి, మా సవతితల్లి. అసలీ ఎత్తంతా ఆమెదే. ఫూల్ సాహెబు ఆమెకు పనిముట్టు. ఆమె చెయ్యలేని ఘోరంలేదు. ఆమె ఫూల్‌సాహెబు మేనగోడలట !"

వాళ్ళు నన్నుగురించి ఏమైనా మాట్లాడుకోగా విన్నావా ?"

"ముందు మిమ్మల్ని గురించే మాట్లాడుకున్నారు. ఫూల్‌సాహెబు మీ కొక విషపుచుట్టిచ్చాట్ట. దానితో మీరు తప్పక చస్తారని మాసవతితల్లితో అన్నాడు. తరవాత నన్ను సర్వనాశనం చేయ్యటానికీ, అవసరమైతే చంపటానికీ వాళ్లాలోచన చేశారు.

ఈ విషంతోనే ఆ ఫూల్‌సాహెబు నా తల్లినీ, తండ్రినీ, తమ్ముణ్ణీ చంపేశాడు. ఆ విషాన్ని మా మారుతల్లి మా నాన్నకు నీటిలో కలిపి ఇస్తూ వచ్చింది. వీలు వున్నప్పుడల్లా నే నా నీరు పారబోస్తూ వచ్చాను. ప్రతిసారీ నాకు వీలు చిక్కుతుందా? ఆయన దానితోనే చచ్చాడు. నీళ్ళలో విషం కలుపుతున్నారని మా నాన్నకు చెప్పాను. ఆయన నామాట నమ్మలేదు. ఆయన అందరినీ తనలాటివాళ్ళుగానే భావించేవాడు. ఎంత కష్టపడీ నే నాయన్ని బతికించుకోలేకపోయాను," అంటూ కుల్సమ్ ఏడ్చింది.




అరిందము డామె నూరడిస్తూ, "జరిగినదానికి విచారించకు; ఆ పూల్‌సాహెబు ఫలితం అనుభవించటం నీ పైనే ఆధారపడి ఉన్నది.

తుల్సమ్ తలఎత్తి కోపంతో, "ఆ పూల్‌సాహెబు మా ఇంటిని శ్మశానం చేసేశాడు. మా ఇంట్లో ఉండే సిరాజుద్దీను నెక్కడికో పంపించి అయిపులేకుండా చేశాడు. ఈపని చేసింది ఎవరో తెలీక, సిరాజుద్దీన్ను వెతకటానికి మానాన్న పూల్‌సాహెబునే నియోగించాడు! పూల్‌సాహె బతన్ని చంపిఉండడు. పేరుమోసిన దొంగ కాలూరాయ్ ఉన్నాడే, అతనివద్ద ఉంచిఉంటాడు," అన్నది.

"సిరాజుద్దీను మీ కేమవుతాడు?"

"అతనితండ్రి మాతండ్రి జమీందారీ చూస్తూండేవారు. వాళ్ళ కా ఉద్యోగం వంశపరంపరగా వస్తున్నది. బసీరుద్దీనుకు సిరాజుద్దీ నొక్కడే కొడుకు. తండ్రి పోయేనాటికి సిరాజుద్దీన్ పదేళ్ళవాడు. మానాన్న అతన్ని చేరదీసి పెంచాడు. అతను కలకత్తాలో చిత్రలేఖనం నేర్చుకుంటున్నాడు. మానాన్న అతనికి నెల కైదువందలు పంపేవాడు. అతను అప్పుడప్పుడూ కలకత్తానుంచి వచ్చి, నాలుగైదురోజు లుండి వెళుతూ ఉండేవాడు. పూల్‌సాహెబు మాకొంప ఎలా కూలుస్తున్నదీ అతనికికూడా తెలుసు. ఆమాట మా నాన్నతో చెబితే, నాన్న నమ్మేవాడుకాడు."

"ఇందుకే పూల్‌సాహె బతన్ని మాయంచేశాడా?''

"ఇంకో ముఖ్యకారణం ఉంది,'' అంటూ కుల్సుమ్ సిగ్గుపడింది. "ఒకప్పుడు మా కిద్దరికీ పెళ్ళిమాటలు జరిగాయి."

"సిరాజుద్దీను కాలూరాయ్ నిర్బంధంలో ఉన్నట్టు నీ కెలా తెలుసు?"

"మా మారుతల్లీ, ఫూల్ సాహెబూ ఒకసారి మాటల్లో అనుకోగా విన్నాను."

''కాలూ రాయ్ పరాక్రమవంతుడు. దొంగలకు గురువు. అతని నిర్బంధంలో ఉన్న సిరాజుద్దీనును రక్షించడం తేలికపనికాదు. కాలూరాయ్‌ని పట్టుకొనటం ఎవరికీ సాధ్యంకాలేదు. అత నెక్కడ ఉంటాడోకూడా ఎవరికీ తెలీదు. అతన్ని పట్టుకుందామని వెళ్ళి చాలామంది అతనిచేతిలో చచ్చారు," అన్నా డరిందముడు. సిరాజుద్దీనును గాఢంగా ప్రేమిస్తున్న కుల్సుమ్ మొహం ఈ మాటలకు వాడిపోయింది.

"అతన్ని విడిపించే ఉపాయమే లేదా?" అని ఆమె అరిందముణ్ణి అడిగింది.

"ఇంతవర కేమీ కనిపించలేదు. ఇంక ప్రయత్నిస్తాను. చూడూ, కామదేవపురం ఠాణాకు పెట్టెలో ఒక పిల్ల శవం చేరింది. దాన్ని గురించి ఫూల్‌సాహెబూ, మీ సవతి తల్లీ ఎప్పుడైనా మాట్లాడుకోగా విన్నావా?" అని అరిందము డడిగాడు.

నాలుగు రోజుల క్రితం వాళ్ళు మాట్లాడుకున్నట్టూ, వారి సంభాషణ తనకు సరిగా అర్థం కానట్టూ, ఆ సంభాషణలో గౌరచంద్రుడూ, గోపాలచంద్రుడూ, రేవతీ, రోహిణీ అనే పేర్లు వచ్చినట్టూ కుల్సుమ్ చెప్పింది.

అరిందముడి కంతా అవగాహన అయిపోయింది. అతను కుల్సుమ్‌ను ఇంటికి పోవద్దనీ, ప్రస్తుతం యోగీంద్రుడి ఇంటనే ఉండమనీ చెప్పాడు. తరవాత అతను యోగీంద్రుడితో కలిసి ఠాణాకు బయలుదేరాడు.

# 4

ఠాణాలో ఒక అరగంటసేపు గూఢాలోచన చేసిన మీదట అరిందముడు యోగీంద్రుడితోనూ, మరొక పోలీసుతోనూ బయలుదేరాడు. అరిందముడు తప్ప మిగిలిన ఇద్దరూ మారువేషాలలో ఉన్నారు. బయలుదేరేముందు వారు ఒక ఏర్పాటు చేశారు. అదేమిటంటే, కొంతసేపు గడిచాక పదిమంది పోలీసులు ఫూల్‌సాహెబింటికి వెళ్ళాలి.

ఫూల్‌సాహెబుండే ఇల్లు పెద్దది. అందమైన రెండంతస్తులమేడ. ఇంటిముందున్న పూలతోటలో పనిచేసే మనిషిని, "డాక్టరుబాబుగా రున్నారా?" అని అరిందము డడిగాడు.

"మేడమీద ఉన్నారు. దిగివచ్చే వేళ అయింది," అని ఆ మనిషి చెప్పాడు.

ముగ్గురూ లోపలికి వెళ్ళి డ్రాయింగురూములో కూర్చున్నారు. అక్కడ మరెవరూ లేరు. అరిందముడు చప్పుడు చెయ్యకుండా మెట్లెక్కి పైకి వెళ్ళాడు. ఓరవాకిలిగా ఉన్న ఒక గదిలోనుంచి సంభాషణ వినపడుతున్నది. అరిందముడు రెండు గొంతులనూ పోల్చుకున్నాడు — మాట్లాడేవారిలో ఒకడు పూల్‌సాహెబు, రెండోవాడు గౌరచంద్రుడు. సంభాషణ ఈ విధంగా సాగుతున్నది.

''పని పూర్తికాకుండా ఎందు కొచ్చావు ?" అన్నాడు పూల్‌సాహెబు.

"అది సామాన్యమైన పనా ?" అన్నాడు గౌరచంద్రుడు.

"నువ్వూ, జుమీలియా — ఇద్దరుండికూడా పని కాకపోతే ఎలా?''

"అవును, జుమీలియాసంగతి మీకు బాగా తెలుసు."

"ఆమె నా కుడిచెయ్యి. ఆమె సహాయంతోనే తమీజుద్దీను భార్యను చంపగలిగాను. తమీజుద్దీన్ ఇంటిపైన పెత్తనం సంపాదించాను. మత్‌బీబీ అనే పేరుతో యింటి యజమానురాలిని చేసింది. అయితే నా సహాయం లేకుండా ఆమె ఇంకా ఎన్నో సాహసకార్యాలు చేసింది. అందుకే నా కామె అంటే భయం. ఆమె మామూలు ఆడది కాదు. ఆ ధైర్యసాహసాలు మగవాళ్ళకున్నూ ఉండవు. రెండో మనిషికి తెలీకుండా తమీజుద్దీ నింట ముగ్గురి ప్రాణాలు తీసింది. ఆమె వాళ్ళకు నీటిలో కలిపి ఇచ్చిన విషంలాటివి నా దగ్గిర 108 రకా లున్నాయి. అరిందముడికి చుట్టలో పెట్టి ఇచ్చిన విషం ఎంత బలశాలినైనా పదిగంటల్లో కడతేరుస్తుంది.''

"అరిందముడు చచ్చాడుగద. ఇంక మనకు భయ మెందుకు ?''

"బతికుంటే నే నరిందముడికి భయపడ్డానాఏమిటి ? నాకు భయమనే మాటే లేదు.''

కొంచెంసేపు వాళ్ళిద్దరూ అరిందముడి తెలివి గురించీ బలంగురించీ మాట్లాడుకున్నారు.

"ఆ అరిందముడు నాచేత చావకపోగా నన్ను వివశుణ్ణి చేసి యదునాథుడు రాసిన ఉత్తరం కాజేశాడు. అందులో అనేక విషయా లున్నాయి. కనకనే అతను రేవతితాతను తీసుకొచ్చి రేవతిని ఆ తాతవెంట పంపేశాడు," అన్నాడు గౌరచంద్రుడు.

"అది పొరపాటు. రేవతి వాళ్ళ తాతఇంటికి పోలేదు. ఆ మాట నువు తెలుసుకోవటానికి ప్రయత్నించలేదు. ఫరవాలేదు. అరిందముడు చచ్చాడు; గనక మనం నిశ్చింతగా మన పనులు చేసుకుపోవచ్చు. ఆ మూర్ఖుడు కేశవచంద్రుడి ఆచూకీలో పడిపోయాడు. పూల్‌సాహెబే కేశవచంద్రు డని అతనికి తెలీదు."

అరిందము డీ మాట విని ఆశ్చ్యర్యపోయాడు.

"ఇప్పుడు కుల్సుమ్ మిమ్మల్ని పెళ్ళాడనంటే మరొక గొడవ అవుతుంది." అన్నాడు గౌరచంద్రుడు.

"పెళ్ళాడనంటే తండ్రిదగ్గిరికి తనుకూడా పోతుంది."

"అక్కడి సిరాజుద్దీ వింకా ఎంతకాలం నిర్బంధంలో ఉండాలి?"

"సమయం వచ్చేదాకా—"

"కుల్సుమ్ పెళ్ళి అయేదాకానా "

"కాదు. సిరాజుద్దీన్ కూడా చావాలి. ఒకందు కతన్ని ఇంకా బతికి ఉండ నిచ్చాను. అచ్చగా కుల్సుమ్ కోసం కాదు."

''ఏమి టా కారణం?''

"తరవాత చెబుతాను. ను వ్విక్కడే ఉండు. నే నొకసారి కిందికి వెళ్ళిరావాలి." అంటూ పూల్ సాహెబు లేచాడు.

అరిందముడు చప్పున కిందికి వెళ్ళి డ్రాయింగురూములో కూర్చున్నాడు. అతను క్లుప్తంగా పైన విన్న విషయాలు మిగిలిన ఇద్దరికీ చెప్పాడు.

పూల్ సాహెబు దిగిరాగానే యోగింద్రు డతన్ని సమీపించి అరిందముణ్ణి చూపుతూ, ''అయ్యా, ఇతనికి మూర్ఛలరోగం ఉంది. మీరు కాస్త చూడాలి." అన్నాడు.

పూల్ సాహెబు అరిందముణ్ణి సమీపించి చూసి, గుర్తించి, తత్తరతో రెండడు గులు వెనక్కు వేశాడు. అతని మొహమంతా మారిపోయింది. కొద్దిక్షణా లతను కొయ్యబారిపోయి, తరవాత మొలనుంచి బాకు దూసి అరిందముడి గుండెల్లో పొడవబోయాడు. యోగీంద్రుడు వెనకనుంచి పూల్ సాహెబు చేతిని కత్తితోసహా పట్టుకున్నాడు. అరిందముడు పూల్ సాహెబు రెండోచేతిని పట్టుకున్నాడు. పోలీసు కూడా సహాయపడినప్పటికీ, ముగ్గురూ కలిసి ఎంతో సంఘర్షణపడ్డమీదటగాని పూల్ సాహెబును పట్టుకుని, చేతికి సంకెళ్ళు తగిలించటం సాధ్యం కాలేదు. వాళ్ళు గౌరచంద్రుడికోసం వెతికారుగాని అతను దొరకలేదు. అతను కిటికీ పగలగొట్టు కుని పారిపోయాడు.

''ఏం, డాక్టరుగారూ, అరిందము డింకా బతికేఉన్నాడు, చూశారా?'' అన్నాడు. అరిందముడు.

''పూల్ సాహెబు బతికున్నంతకాలమూ అరిందముడికి మరణభయం ఉండనే ఉంటుంది. నేను తప్పించుకోకపోను. నీకు నాచేతిలో అద్భుతమైన చావు ఉండనే ఉన్నది." అన్నాడు పూల్ సాహెబు.




ఈలోపల పదిమంది పోలీసులు వచ్చి ఫూల్‌సాహేబును ఠాణాకు తీసుకుపోయారు. ఇద్దరు పోలీసులతోసహా అరిందముడు కుల్సమ్ ఇంటికి వెళ్ళాడు.

మత్ టీటీ - ఇప్పు డామెను మనం జూమీలియా అనే పిలవవచ్చు - జూమీలియా లోపల గడియపెట్టుకుని, పక్క మీద పడుకుని, రకరకాల దురాలోచనలు చేస్తున్నది. ఫూల్‌సాహెబును పట్టుకున్నా రనీ, అతను హంతకు డనీ, అతనికి మరో దండన పడుతుం దనీ వీథిలో జనం అనుకోవటం ఆమె విన్నది.

ఇంతలో తలు పెవరో తట్టారు. "ఎవరు వారు ?" అని జూమీలియా అడిగితే, ఇంటి పనిమనిషి అమీనా పలికింది. జూమీలియా లేచివెళ్ళి తలుపు తెరిచేసరికి అరిందముడూ, ఇద్దరు పోలీసులూ కనపడ్డారు. అమీనా నవ్వుతూ వెళ్ళిపోతున్నది. జూమీలియా మెరుపులాగా వెళ్ళి అమీనామీద పడి, ఎడమచేత్తో ఆమె జుట్టు పట్టుకుని కుడిచేత్తో తన బొడ్డునుంచి బాకు లాగి, అమీనా గుండెల్లో పొడిచేసింది. 'చచ్చా' నని కేకపెట్టి అమీనా పడిపోయింది.

అరిందముడు చప్పున జూమీలియా కుడిచెయ్యి పట్టుకున్నాడు. అంతకుముందు జూమీలియాను చూసి బెదరి వెనక్కు తగ్గిన పోలీసు లిద్దరూ ఆమెను రెండుపక్కలా పట్టుకున్నారు. జమీలియా ఎలాగో తన కుడిమచేతి బాకును ఎడంచేతికి మార్చుకుని, అరిందముడిపైకి విసిరింది. అయితే అది గురితప్పింది. జూమీలియా చేతికి అరిందముడు సంకెళ్ళు తగిలించాడు.

''ఇంక కొంచెం ఆలస్యంగా వచ్చిఉంటే ఇవాళ నీ రక్తంలో స్నానం చేసి ఉందును," అన్నది జూమీలియా.

"పూల్‌సాహెబు ఉంపుడుగాత్తెవు గనక ఇలా మాట్లాడుతున్నావు," అన్నాడు అరిందముడు.

"అబద్ధం. నేను పూల్‌సాహెబు ఉంపుడుగత్తెనని ఎవరు చెప్పారు ?"

"అంతా పూల్‌సాహెబే చెప్పాడు. నువే కుల్సమ్ తల్లిదండ్రులనూ, తమ్ముణ్ణీ విషంపెట్టి చంపావుట."

"నే నొక్కమాట చెబుతాను విను. నన్ను పట్టుకోవటం పాముపడగపైన చెయ్యి వెయ్యటంలాటిది. ఇందుకు ప్రతిఫలం ను వ్వెప్పటికైనా అనుభవిస్తావు," అన్నది జూమీలియా.

కారాగృహంలో పూల్‌సాహెబు నుంచిన గదిలోనే జూమీలియానుకూడా ఉంచి, గంట గంటకూ పహరా మారే ఏర్పాటు చేశారు.

## తృతీయ ఖండం

రాత్రి రెండుజాము లయింది. ఆకాశాన్ని నల్లని కారుమేఘాలు అలుముకున్నాయి. అంతటా అంధకార మావరించింది. కాళ్లూ, చేతులూ కట్టేసిన పూల్‌సాహెబు గురక పెట్టి నిద్రపోతున్నాడు. అతనికి కొంచెం దూరంలో జూమీలియా కూర్చునిఉన్నది. బయటి దీపం కాంతి కొంచెంగా ఆమె ముఖాన పడుతున్నది. బయట కాపలా తిరుగుతున్న సాయుధభటుడు అందమైన ఆమె మొహం చూసి గుటకలు వేస్తున్నాడు. జూమీలియా ఆ సంగతి గ్రహించి, అతను తనకేసి చూసినప్పుడల్లా, అతన్ని తన చూపులతో మరింత పరవశుణ్ణి చేస్తున్నది. ఆమె చూపులకు తట్టుకోలేక కాపలావాడు అవతలికి పోయి నిట్టూరుస్తున్నాడు.

అతను మళ్ళీ వాకిలివద్దకు వచ్చినప్పుడు జూమీలియా, "పాపం, నా మూలాన నీ కెంత కష్టం వచ్చిందీ ?" అన్నది.

"నీకు లేని కష్టం నాకేమిటీ ?" అన్నాడు కాపలావాడు.

''ఇలా మబ్బులుపట్టిన రాత్రివేళ భార్యను కౌగలించుకుని పడుకొనవలసినది పోయి, తుపాకీ భుజాన పెట్టుకుని తిరగటం కష్టం కాదా ?'' అన్నది జూమీలియా.

"సర్కారుసొమ్ము తింటున్నందుకు డ్యూటీ చెయ్యొద్దూ ?"

తియ్యటిమాటలు చెబుతూ జూమీలియా అతని సంగతు లన్నీ తెలుసుకుని, "అయ్యో, నువ్వింటికిపోయి మూడేళ్ళయిందా ? మీ ఆవిడ నిన్ను విడిచి ఇంతకాలం




ఎలావున్నది ? నేనే అయితే ని న్నొక్క గంట విడిచిఉంటానా ? భార్యాభర్తలు వేరై పోయి ఈ సర్కారు సేవ చేసేకన్న చావటం మేలు,'' అన్నది.

ఆమె అతనికి ఆరుగురు పిల్లలనీ, భార్యా అంటే అతనికిష్టమే ననీ విని, "ఆమె నాకన్న బాగుంటుందా ?" అని అడిగింది.

"ఆమెకూ నీకూ పోలి కేమిటి ? నీ మొహం చూస్తే వెయ్యి రూపాయలనోటు దొరికిన ట్టుంటుంది !" అన్నాడు కాపలావాడు.

జూమీ లియా వాణ్ణి వలలోకి బాగా లాగేసింది. వాణ్ణి చూస్తే తనమనసులో ఏవేవో కోరికలు పుట్టుకొస్తున్నా యన్నది; తనకు వాడివంటివాడు దొరకక, దిక్కుమాలిన హంతకుడు పూల్‌సాహెబు దొరికా డన్నది; తనూ వాడూ కలిసి ఏ అడవిలోకన్నా పారిపోతే ఎంత బాగుంటుం" దన్నది.

కాపలావాడు వివశుడై పోయి, అన్ని తాళాలూ తెరిచే తాళపుచెవితో తలుపులు తెరిచి, జూమీలియాను బయటికి తెచ్చి ఆమె సంకెళ్ళు ఊడదీశాడు. వెంటనే జూమీలియా వాణ్ణి పట్టుకుని వాడినోరు తన నోటితో గట్టిగా అదిమి ముద్దుపెట్టుకున్నది. పాము కాటువేసినట్టుగా వాడు కూలి పడిపోయాడు.

లోపల దొంగనిద్ర పోతున్న పూల్‌సాహేబు లేచి, "అయిపోయిందా ?" అన్నాడు.

"జూమీలియా అతని సంకెళ్ళు తీస్తూ, వాడి పొట్టలో విషపుసూది దిగపొడిచాను." అన్నది.

"కిక్కురు మనకుండా చచ్చాడే!"

''అంటూ ఠనే నోటిమీద ముద్దు పెట్టుకున్నాను. నేను సూది గుచ్చటంకూడా వాడికి తెలియలేదు."

''పద. మన కింకా చాలాపని ఉంది.''

కొంతదూరం వెళ్ళాక ఫూల్‌సాహెబు జూమీలియాను ఆగమని, వెనక్కు తిరిగి వెళ్ళి, చచ్చిపోయిన భటుడి బాకు తీసి, దానితో జైలుగోడపైన, ''అరిందమా! వారంరోజుల్లో నీ ప్రాణాలు తీస్తాను. అప్పుడే నాపేరు ఫూల్‌సాహెబు," అని రాసి, జూమీలియాదగ్గిరికి తిరిగివచ్చాడు.

ఇద్దరూ తూర్పు ప్రహరీగోడకేసి వచ్చారు. ధారాపాతంగా వర్షం కురుస్తున్నది. ప్రహరీగోడకు కొంతదూరలో ఉన్న పెద్దచెట్టుకింద ఇద్దరూ నిలబడ్డారు. గోడ దాటితేగాని వారికి క్షేమంలేదు.

గోడపైన గస్తీవాళ్ళు, ఒకరినొకరు కేకలతో హెచ్చరించుకుంటూ, అంత వర్షం లోనూ పహరా ఇస్తున్నారు. ఆరోజు జైలులో ఫూల్‌సాహెబు ఉండటంచేత వారు మరింత శ్రద్ధగా తమపని చూస్తున్నారు.

జైల్లో గడియారం ఒంటిగంట కొట్టింది. తూర్పుగోడమీద పహరా ఇచ్చేవాడు: ''హారాహుషార్ !" అని కేకపెట్టాడు. దూరంనుంచి ఆదేజవాబు వచ్చింది.

"గౌరచంద్రుడు తనపని మరిచిపోకపోతే మనం బయటపడతాం. మళ్ళీ తెల్లవారగానే అరిందముడు మనకోసం వేట మొదలుపెడతాడు," అన్నాడు ఫూల్‌సాహెబు.

ఇద్దరూ మళ్ళీ నడిచి, పహరావాడి కంట పడకుండా, ప్రాకారంకిందికి వెళ్ళారు. పైన పహరావాడు అటూ ఇటూ తిరుగుతూనే ఉన్నాడు. వాడు దూరంగా వెళ్ళగానే ఫూల్‌సాహెబు గోడమీద ఒక ఇటుకముక్కతో కొట్టి, చెవి ఆనించి ఆలకించాడు. అవతలనుంచికూడా ఆదేధ్వని వచ్చింది. గౌరచంద్రుడు తనపని ఏమరలేదు. ఇంక భయంలేదు. తప్పించుకున్నట్టే!

"గౌరచంద్రుడు మన కేవిధంగా సాయపడతాడు?" అన్నది జూమీలియా.

"మా కిద్దరికీ అదివరకే ఒక ఏర్పాటున్నది. నేను జైల్లో పడ్డప్పుడల్లా గౌరచంద్రుడు ప్రతిరాత్రీ ఈ గోడదగ్గిరికి వచ్చి, ఒంటిగంట దాటినాక గోడిమీదుగా ఒక

తాడు వేస్తాడు." అని ఫూల్‌సాహెబు అంటుండగానే గోడమీదనుంచి ఒక మోకు పడింది. ఆ మోకు రెండోచివర గోడ అవతల ఉన్నది.

ఫూల్‌సాహెబు తాడును పట్టుకుని వేళ్ళాడిచూశాడు. దాని కొసను ఒక చెట్టుకు కట్టాడు. తరవాత అతను జూమీలియాను పైటచెంగుతో తనవీపున కట్టుకుని, తాడును పట్టుకుని ఎగబాకసాగాడు. ఇంకొ ప్రాకారం పైభాగం అందుబాటులో ఉన్నదనగా పహరావా డక్కడికే వచ్చాడు. ఇంత ప్రయత్నమూ వృథా అవుతుం దేమోనని ఫూల్‌సాహెబు భయపడ్డాడు. ఎందుకంటే, పహరావాడు తాడును చూడవచ్చు; ఒకవేళ చీకట్లో తాడు కనబడకపోయినా, అది వాడికాలికి తగలవచ్చు.

అయితే ఫూల్‌సాహెబు అదృష్టం బాగుండి ఏదీజరగలేదు. పహరావాడు ముందుకు వెళ్ళాడు. ఫూల్‌సాహెబు జూమీలియాతోసహా గోడ పైభాగానికి ఎక్కి, తాడువెంబడి అవతలివైపు దిగసాగాడు. నేల ఇంకా రెండుమూడు గజాలలో ఉన్నదనగా అతని కాలి కొక ఇటుకలతోకట్టిన స్థూపం తగిలి అదికాస్తా విరిగిపడిపోయింది. ఆ చప్పుడుకు ప్రాకారంపైన ఉన్న పహరావాడు తిరిగిచూశాడు. కాని చీకట్లో దిగువన వాడి కేమీ కనిపించలేదు. ఆకాశపు వెలుగుకు అడ్డంగాఉన్న పహరావాడుమాత్రం ఫూల్‌సాహెబుకు కనిపిస్తున్నాడు.

చప్పుడుకాకుండా ఫూల్‌సాహెబు ప్రాకారంమీదికి మళ్ళీ ఎక్కి, బాకు దూసి పట్టుకుని, ఒడుపుగా పహరావాడిపై పడి వాడికంఠం బిగబట్టి, బాకుతో వాణ్ణి చచ్చేదాకా పొడిచాడు. ఫూల్‌సాహెబు వాడి శవాన్ని ప్రాకారంమీద పడుకోబెట్టి, వాడి కత్తి తీసుకుని కిందికి దిగివచ్చాడు.

కింద వేచిఉన్న గౌరచంద్రుడు ఫూల్‌సాహెబుకు వేరేబట్ట లిచ్చాడు.

"నువ్వీరాత్రి కిక్కడే ఉండి, ఏమేం జరిగేదీ చూసి, తెల్లవారగానే నాకు వచ్చి చెప్పు. నేను పలాశోద్యానం ఇంటికి పోతున్నాను. అక్కడికిరా," అని ఫూల్‌సాహెబు గౌరచంద్రుడితో అన్నాడు.

''గంగ పూటుగా ఉన్నది. మీ రెలాగో ఈదవచ్చు, కాని జూమిలియాను ఎలా తీసుకుపోతారు ?" అన్నాడు గౌరచంద్రుడు.

''అదంతా నేను చూసుకుంటాలే. ఇక్కడ మాట్లాడుతూ కూర్చునే వ్యవధిలేదు," అన్నాడు ఫూల్‌సాహెబు.

గంగ ఒడ్లనొరిసి మహావేగంగా ప్రవహిస్తోంది. ఫూల్‌సాహెబూ, జూమీలియా దాని కడ్డంపడి ఈదసాగారు. ఇద్దరికీ ఈత వచ్చు. కాని ప్రవాహం వారిని ఈడ్చుకు పోతూ, వారి ఇచ్చానుసారం వెళ్ళనివ్వటం లేదు. సగందారిలో జూమిలియాకు అలుపు

వచ్చింది. ప్రవాహం ఆమెను దూరంగా తీసుకుపోయింది. పూల్‌సాహెబు ఆమె దగ్గిరికి ఈదుకుంటూ వచ్చి, "నా వీపుమీద పడుకుని గట్టిగా పట్టుకో. ఇద్దరమూ కలిసి ఒడ్డు చేరుదాం." అన్నాడు.

అతనుకూడా అలిసిపోయి బలంగా ఈదలేకపోతున్నాడు. ఒడ్డుకేసి పోవటం కన్న ప్రవాహంవెంట కొట్టుకుపోవటం జాస్తిగా ఉన్నది. అతనికి నీటిలో తేలి ఉండటం కూడా కష్టసాధ్యంగా ఉన్నది. ఎలాగో పక్క బిగువున ఈదుతున్నాడు.

అవతలిఒడ్డున ఒకపెద్ద మర్రిచెట్టున్నది. దాని శాఖలు నదిమీదికి వ్యాపించి ఉన్నాయి. వాటినుంచి ఊడలు నీటిమీదికి దిగిఉన్నాయి. తాను ఒక్కబారకూడా ఈదలేని స్థితిలో, తన వీపుపైన ఉన్న జూమీలియాను కెరటాలు బలత్కారంగా ఈడ్చివేస్తున్న సమయంలో పూల్‌సాహెబు ఒక మర్రిఊడను పట్టుకోగలిగాడు. అతనికి ముందువైపున ఒక సుడిగుండం ఉన్నది. ఊడ వదిలిపెడితే ఇద్దరూ సుడిగుండం వాతపడక తప్పదు

ఆ సమయంలో ఒడ్డునుంచి ఒక భయంకరమైన నవ్వు వినిపించింది. ఒక స్త్రీ కంఠం. "ఏం, జీవితేశ్వరా? ఎలా ఉన్నావు. ఈ దాసి గుర్తుందా?" అని అడిగింది.

పూల్‌సాహెబు మోహిని కంఠాస్వరాన్ని పోల్చుకుని నిలువునా నీరైపోయాడు. ఆమె మర్రిచెట్టు కింద అంధకారంలో అతనికి కనిపించింది. ఆమె చేతిలోని కత్తీ, ఆమెకళ్ళూ మెరుస్తున్నాయి.

"మోహినీ, ఇంతరాత్రివేళ ఇక్కడికెలా వచ్చావు?" అని పూల్‌సాహె బడిగాడు.

పూల్‌సాహెబే వినోదుడు. యౌవనంలో ఆ పేరుతో తిరిగాడు. ఆ రోజుల్లో అతను వితంతువైన మోహినిని ప్రేమించి, ఆమె హృదయంలో ప్రేమ రగిల్చాడు. అతను విడిచిపెట్టినాక మోహిని ఈర్ష్యాద్వేషాలలో కాగి పిచ్చిదైపోయింది. ఆమె అహోరాత్రులు నిద్రలేక పూల్‌సాహెబు పైన పగ తీర్చుకోవటానికి విష సర్పంలాగా తారాడుతున్నది.

పూల్‌సాహెబు తమ ఇద్దరి ప్రాణాలూ కాపాడమని మోహినిని వేడుకున్నాడు. "నిన్నీ దుస్థితిలో ఉండనివ్వడం నాకూ ఇష్టంలేదు," అంటూ ఆమె ఒక మర్రి ఊడను పట్టుకుని ఊగి, పూల్‌సాహెబు పట్టుకున్న ఊడను చేరుకుని, దాన్ని కత్తితో కోయసాగింది.

పూల్‌సాహెబామెను బతిమాలాడు, భయపెట్టాడు. జరిగినదానికి పశ్చాత్తాపం ప్రకటించాడు. జూమీలియాకూడా వేడుకున్నది. కాని మోహిని తన ప్రయత్నం




మానలేదు. జూమీలియా ఒక బాకు మోహిని పైన విసిరింది. అది మోహిని ఎడమ చేతికి గాయం చేసింది. పూల్‌సాహెబు కత్తి విసిరాడు. అది గురి తప్పిపోయింది. అంతలోనే వాళ్ళు పట్టుకున్న ఊడ తెగిపోయింది. వాళ్ళు సుడిగుండంకేసి కొట్టుకుపోయి, అందులో ఒకటి రెండుచుట్లు తిరిగి మునిగిపోయారు. గంగానది ఎప్పటి లాగా ప్రవహిస్తున్నది.

# 2

రాత్రి రెండుగంటలకు పహరావాళ్ళు మారుతారు. అప్పుడు ప్రాకారంమీద పహరావాడి శవం బయటపడింది. ఆ తరవాత జైలులో కాపలావాడి శవం బయట పడింది. పూల్‌సాహెబూ, జూమీలియాలు తప్పించుకుపోయా రని తెలిసి పోలీసు అధికారులు ఆందోళన చెందారు. అరిందముడు మరింత ఆందోళన చెందాడు.

తెల్లవారకపూర్వమే యోగీంద్రుడు అరిందముడితోసహా జైలుకు వచ్చాడు. పూల్‌సాహెబు చేసినది చూసి ఇద్దరూ నిర్ఘాంతపోయారు.

పూల్‌సాహెబు గోడలమీద కత్తితో రాసినది చదువుకుని అరిందముడు, "ఇంకేం? వాడు నాకోసం ఈవూరు రానే వస్తాడు. నేను వాణ్ణి పట్టుకుతీరుతాను. ఈసారి తప్పించుకుపోలేడు," అన్నాడు.

పూల్‌సాహెబు శక్తులను గురించి యోగీంద్రు డడిగితే, "అతని దేహబలం నా దేహబలానికి రెట్టింపుంటుంది. అతని బుద్ధిబలం ఇంచుమించు, నా బుద్ధిబలం లాటిదే," అన్నాడు అరిందముడు.

"అతన్ని పట్టుకోవటానికి ఎంతమంది సాయం కావాలో చెప్పండి. ఇస్తాను," అన్నాడు యోగీంద్రుడు.

"ఎవరూ వద్దు. నే నొక్కణ్ణే పట్టుకుంటాను," అన్నా డరిందముడు. యోగీంద్రుడు ఆక్షేపణ తెలిపాడు కాని, అరిందముడు సహాయం నిరాకరించేశాడు.

ఒకవారం గడిచింది. అర్ధరాత్రి; వెన్నెల చక్కగా కాస్తున్నది. హూగ్లీ నదిలో ఒక పడవలో ఒక యువకుడు కలకత్తాకు ప్రయాణిస్తున్నాడు. ఆ వేళకాని వేళ నదీ తీరాన నిర్జన ప్రదేశంలో ఒక స్త్రీ నిలబడి ఉండటం యువకుడు చూశాడు. చూసి ఆశ్చర్యపోయాడు.

పడవ సమీపానికి రాగానే ఆ స్త్రీ అతివేగంగా పడవను సమీపించి, తొడలోతు నీటిలోకి దిగి, "అయ్యా, పెద్దకష్టంలో ఉన్నాను. ఒంటరిదాన్ని. సహాయపడండి," అన్నది.

యువకుడు పడవను ఒడ్డుకు తట్టించి, "సహాయం చేస్తాను. కాని నా వల్ల ఏం సహాయం కావాలి?" అని ఆమె నడిగాడు.

"అయ్యా. నేను కులస్త్రీని. ఇటువంటిచోట ఈవేళ పరపురుషుడితో మాట్లాడ టానికి ప్రాణం చచ్చినట్టుంది. కాని ఏం చెయ్యను. నా భర్తగతి ఏమయిందీ తెలియదు. నన్నెలాగైనా మా యింటికి చేర్చి పుణ్యం కట్టుకోండి," అన్న దామె.

"మీ ఇల్లెక్కడ?"

"ఉత్తరంగా వెళ్ళాలి. చాలాదూరం. మీరు దారిలో మామిడితోట చూసే ఉంటారు. ఆ తోట మధ్యగా పోతే మా వూరు వస్తుంది. ఒంటరిగా పోవాలంటే భయంగా ఉంది."

"అయితే ఈ రాత్రివేళ ఒంటరిగా ఎలా వచ్చావు?"

"మావారికి రెండేళ్లుగా మూర్ఛవ్యాధి ఉన్నది. చికిత్సలు చేయించిన కొద్దీ అది జాస్తి అయింది. ఒకసారి వచ్చే మూర్ఛ ఇప్పుడు రోజుకు రెండు మూడుసార్లు వస్తున్నది. మూర్ఛ తరవాత పిచ్చిమాటలుకూడా ఆరంభ మయాయి. బెహాలా గ్రామంలో మూర్ఛలకు మంచి మందిస్తా రంటే, రేపు శనివారం, మందు తీసుకునే రోజు గనక, ఇవాళ రాత్రి పడవలో మే మిద్దరమూ ప్రయాణ మయాం. ఈ ప్రాంతా లకు వచ్చేసరికి, మా ఆయన ఇంటికి పోతా ననీ, పడవను ఒడ్డుకు పట్టించి, గభాలున



ఒడ్డుకు దూకి పారిపోయారు. మూర్ఛకు ముందాయన కిలా మతి చలిస్తుంది. ఇంటికి పోయి మూర్ఛ పోయారో ఏమో!" అన్నదామె.

"అయితే మీ ఇంటికి పోదాం, పద. ఆ వ్యాధి సంగతి నేనుకూడా చూస్తాను," అన్నాడు యువకుడు.

"కొంపతీసి మీరు వైద్యులా ఏం?" అని ఆమె ఆగిపోయింది.

"చెప్పు! ఆగావేం?"

"మరేం లేదు. మా ఆయనకు వైద్యులంటే మంట. తమ బంధువుల్లో వైద్యులయినవాళ్ళతోకూడా ఆయన కిప్పుడు మాటల్లేవు. మీ కేమన్నా అవమానం జరుగుతుందేమో నని భయం."

"మరేం ఫరవాలేదు," అంటూ యువకుడు ఆమెను పడవలోకి ఎక్కించుకుని, వెనక్కు మళ్ళమని పడవవాడితో అన్నాడు.

పడవ మామిడితోటను చేరి యువకుడూ, స్త్రీ ఒడ్డున దిగినదాకా పడవవాడి ప్రాణాలు పిచపిచలాడుతూనే ఉన్నాయి. ఆ స్త్రీ దయ్యమనీ, తాను చస్తే తన ఆలుబిడ్డ లేమైపోతారో నని వాడి భయం.

"నేను తిరిగి వచ్చేదాకా ఇక్కడే ఉండు," అన్నాడు యువకుడు స్త్రీ వెనకగా బయలుదేరుతూ.

"నువు తిరిగివచ్చినప్పటి మాటగద !" అనుకున్నాడు పడవవాడు.

యువకుడు తనముందు నడిచే స్త్రీ యొక్క అందమూ, ఆకర్షణా గురించి ఆలోచిస్తూ తాను చాలా సేపుగా నడుస్తున్నమాట గుర్తించలేదు. చప్పున స్పృహ కలిగి ఆలోచించి చూస్తే తాము అరణ్యంగుండా పోతున్నట్టు అతనికి అర్థమయింది.

"ఇంకెంతదూరం వెళ్ళాలి? ఇక్కడెక్కడా ఊరూ, పల్లే ఉన్నట్టు కనబడదే" అన్నాడతను.

"క్షమించాలి. త్వరగా ఇంటికి వెళ్ళాలనే తొందరలో అడవిలోనుంచి మిమ్మల్ని తెస్తున్నాను. ఇంతకన్న మంచిదారి ఉన్నది కాని, అది చాలా చుట్టు." అన్న దామె.

కొద్దిసేపట్లో వా రొక తోటమధ్య ఉన్న పాత ఇల్లు చేరుకున్నారు. ఆమె అతన్ని కొన్ని గదులగుండా తీసుకుపోయి, మెట్లగదిలో అతన్ని ఉండమని తాను పైకి వెళ్ళి, దీపంతో తిరిగివస్తూ, "అయ్యో! అయ్యో! ఆయన ఇంటి కొచ్చి మూర్ఛ పడిపోయారు!" అన్నది ఆందోళనగా.

అతను ఆమెవెంట మెట్లెక్కివెళ్ళి, కొన్ని గదులు దాటి, రోగి ఉండే గది ప్రవేశించాడు. ఆ గదిలో బుడ్డిదీపం మాత్రం వెలుగుతున్నది. మంచంమీద ఒక మనిషి శవంలాగా పడిఉన్నాడు. వయసు నలభైకి తక్కువ ఉండదు. కళ్ళు మూసుకుని ఉన్నాడు.

యువకుడు రోగి నాడి పరీక్షించి, అది మామూలుగానే ఉండటం గమనించి, రోగి నటిస్తున్నట్టు శంకించాడు. అత నామెను దీపం తెమ్మని, లాంతరును రోగి ముఖానికి దగ్గరిగా పెట్టి, కనురెప్ప పైకెత్తాడు. కనుపాపలు కదలికలేదు. రోగి నటిస్తున్నపక్షంలో చాలా సమర్థుడైన నటుడై ఉండాలి. యువకుడు రోగి రెండో కనురెప్ప పైకెత్తి తన వేలితో అతని కన్ను పొడవబోయినట్టు నటించాడు. రోగి భయంతో కన్ను మూసుకున్నాడు. మోసం బయటపడింది.

"ఈ రోగి ముఖాన చన్నీరు చిలకరించి కాస్సేపు విసిరితే తెలివి అదే వస్తుంది" అన్నాడు యువకు డా స్త్రీతో.

సరే నని ఆమె వెళ్ళిపోయింది.

ఒకటి రెండు మూలుగులు మూలిగి, రోగి నిద్ర లేచినవాడిలాగ లేచికూర్చుని "ఎవరు? మీ పేరు?" అన్నాడు.

"నాపేరు దేవేంద్ర విజయమిత్రుడు." అన్నాడు యువకుడు.

"అలాగా; ఎప్పుడూ విన్న పేరు కాదే? మిమ్మల్నిక్కడి కెవరు తెచ్చారు?"




''మాది భవానీపురం. నే నిక్కడివాణ్ణి కాను. మీరు మీ భార్యను నదిదగ్గిర విడిచి వచ్చారట. నేను పడవలో పోతుంటే ఆమె నన్ను తోడు రమ్మని తీసుకువచ్చింది. మీకు స్పృహ తెలిసింది గనక ఇక నేను పోతాను."

"కోప్పడకండి. కూర్చోండి. నా రోగంగురించి మీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు రోగి.

"కపట నటన మంటాను. మీ రేమంటారు?''

"మీ రన్నది నిజం. నే నప్పుడు ఒళ్ళు తెలిసేఉన్నాను," అంటూ రోగి మతి సరిగా లేనివాడిలాగా మాట్లాడుతూ లేచివెళ్ళి వరండాలో కిటికీదగ్గిర నిలబడ్డాడు.

ఇంతలో ఆడది తిరిగివచ్చి, ''మీ రా వరండా మూలగదిలో కూర్చోండి. మీకు చాలా ఆలస్య మయింది. క్షమించాలి,'' అన్నది.

దేవేంద్రుడు మూలగదికేసి పోతూండగా రోగి గదినుంచి సంభాషణ వినపడింది. అతను ఆగి విన్నాడు.

ఆమె, "అతనే ఇతను. నువు సరిగా గుర్తుపట్టలేదా" అన్నది.

రోగి. ''ఔను; అతనే,'' అన్నాడు.

''పేరు దేవేంద్రవిజయుడేనా?''

''అనే చెప్పాడు."

"అయితే నేను పొరపాటు పడలేదన్నమాట. ఇంక చెయ్యవలిసిం దేమిటి?''

"'పొడిచి చంపెయ్యి.''

"చంపటమే?"

"హత్యలు చెయ్యటం కొత్తయినట్టు మాట్లాడుతున్నావే? కుర్రా డందంగా ఉన్నాడని కులుకొచ్చిందా? చివరకు నన్ను ముంచేట్టున్నావు!''

''అదేమీ లేదులే. అలాగయేట్టుంటే ఇన్నికష్టాల్లో నిన్నంటిపెట్టుకునిఉంటానా."

దేవేంద్రుడి తల తిరిగిపోయింది. తనను చంపటానికి వీ ళ్ళెందు కాలోచన చేస్తున్నారు? అతను రానున్న ఆపదకు సిద్ధపడినవాడై, వరండా పిట్టగోడ దగ్గిరికి వెళ్ళి నిలబడ్డాడు.

దీపం పట్టుకుని ఆమె అతని దగ్గిరికి వచ్చి. "ఊరికే నిలబడిఉన్నారేం? నావెంట రండి." అన్నది.

"ఇంకా నాతో పనేమున్నదీ? మీ నౌకరును తోడిస్తే నా పడవ చేరుకుంటాను."

"ఇంత ఉపకారంచేసి ఇన్ని మంచినీళ్ళయినా తాగకుండా వెళ్ళిపోతారా?''

ఆమె అతన్ని మరొక మెట్లగదికి తీసుకుపోయి మెట్లమీదుగా పైకి వెళ్ళి, ఒక గది ప్రవేశించింది. ఆ గది కిటికీ లన్నీ మూసిఉన్నాయి. ఆమె అతన్ని ఒక మంచంమీద కూర్చోమని, అలమారులోనుంచి రకరకాల పళ్లు తెచ్చి అతనిముందు పెట్టింది. అతను తినలేదు. బలవంతాన తినిపించటానికి ఆమె ప్రయత్నిస్తే మొహం తిప్పేసుకున్నాడు. ఆమె చప్పున అతని కంఠాన్ని కౌగలించుకుని అతని ముఖమంతా ముద్దులతో నింపేసింది. అత నామెను తోసేశాడు.

ఆమె అతన్ని తన ప్రేమను నిరాకరించొద్దనీ, తాను అతన్ని నిజంగా ప్రేమించాననీ, ముసలి భర్త వల్ల తనకు సుఖం లేదనీ. అత నామె ప్రేమను నిరాకరించాడు. ఆమె బొడ్డునుంచి కత్తితీసి తనను పొడిచెయ్యమన్నది. మళ్ళీ మళ్ళీ అతనిపైనపడి, అనేక వికారచేష్టలు చేసింది. అత నామెను తిట్టి దూరంగా నెట్టాడు. ఆమె క్రోధావేశంలో కత్తి ఎత్తి అతన్ని పొడవబోయింది. అత నామె చెయ్యి గట్టిగా పట్టుకుని, కత్తి లాగేసుకుని ఆమెను దూరంగా తోశాడు.

ఆమె లేచి గది బయటికి వెళ్ళి, తలుపు గొళ్ళెం పెట్టి, "దేవేంద్రా, ఇక చావు! నీ కెలాగూ చావు తప్పదు!" అంటూ వెళ్ళిపోయింది. దేవేంద్ర విజయుడు గదిలో బందీ అయాడు.

కొద్దిసేపటికి ఏదో వాసన వచ్చింది. అది అంతకంతకూ దుర్భరంగా పరిణమించింది. అతని తల తిరగసాగింది. అది విషవాయు వని గ్రహించి అతను గదితలు

పులూ, కిటికీలూ పగలగొట్ట యత్నించాడు. చస్తున్నా నని పెద్దగా అరిచాడు. ఏమీ ప్రయోజనం లేకపోయింది.

క్రమంగా అతనికి స్పృహ తప్పసాగింది. ఆఖరుక్షణంలో ఎవడో పొడుగుపాటివా డొకడు వచ్చి తనను గదిలోంచి తీసుకుపోయినట్టు అతనికి లీలగా తెలుసు. ఆపైన ఏంజరిగిందీ అతనికి తెలీదు.

## చతుర్థ ఖండం

దేవేంద్రుడికి మళ్ళీ తెలివి వచ్చేసరికి అత నొక పడవలో ఉన్నాడు. పడవవాళ్లు తెడ్లువేసి పడవను అతివేగంగా నడుపుతున్నారు. బంగారంలాటి ఉదయకిరణాలు ప్రకృతికి శోభ చేకూర్చుతున్నాయి.

తాను నిజంగా చావు తప్పించుకుని బయటపడ్డాడా, లేక ఇదంతా కలా ? తనను కాపాడినమనిషి ఎవరు ? ఆ ఆడదానికీ, మగాడికీ ఇదేవృత్తి కాబోలు — కనపడ్డ వాళ్ళను చంపి, ఉన్నది కాజెయ్యటం !

అతను పడవవాళ్ళను కేకేసి, "న న్నెక్కడికి తీసుకుపోతున్నారు ?" అని అడిగాడు.

"మీ ఇంటికే; భయపడకండి," అన్నా డొక పడవవాడు.

"నన్ను వెంటనే దింపెయ్యండి !" అని దేవేంద్రు డరిచాడు. "నే నెవరో, మా దేవూరో తెలియకుండా మా ఇంటి కెలా తీసుకుపోతారు ?"

పడవవాడు, "తమరి పేరు అరిందముడుకాదూ ? తమరి ఊరు కామదేవపురం కాదూ ?" అని మర్యాదగా అడిగాడు.

"అది నా పేరుకాదు; నా ఊరుకాదు."

"ఆ పెద్దమనిషి అబద్ధం చెబుతాడాండీ ; మీ కింకా మత్తు దిగలేదు."

"పెద్దమని షెవ్వరు ? చెప్పే దేదో స్పష్టంగా చెప్పు."

"నిన్నరాత్రి తమరు పూటుగా తాగి ఒళ్ళు తెలీకుండా చెట్టుకింద దొర్లుతూంటే, మిమ్మల్ని చూసిన పెద్దమనుషుల్లో ఒకాయన మీమీద జాలిపడి, మిమ్మ ల్నింటికి చేర్చమని మాకు మీ రుండేచోటు చెప్పారు. అదంతా మీ జేబులో ఉత్తరాలమీద రాసిఉందిట. మాకు ముందుగానే డబ్బిచ్చాడుకూడా," అన్నాడు పడవవాడు.

"వాడు పెద్దమనిషికాడు, దుర్మార్గుడు ; దొంగ; హంతకుడు; నా గడియారమూ, బంగారుగొలుసూ, ఉంగరాలూ, మూడువందల రూపాయలూ కాజేశాడు. మీరు వాడి తోడుదొంగలు. ఇక్కడెక్కడా పోలీసుటాణా లేదూ ?" అంటూ దేవేంద్రుడు

తనజేబు తడువుకుని, మూడుఉత్తరాలు పైకి తీసి వాటిని చదువుకున్నాడు. అందులో రెండు తనవి, మూడోది అరిందముడికి చేరవలసినది.

ఆ తరవాత అతను పడవవాళ్ళతో, "ఒరే, నా పే రరిందముడే. మాది కామ దేవపురమే. పడవ జోరుగా నడపండి," అన్నాడు.

తాగిన నిషా ఇప్పటికి దిగిందికాబో లనుకున్నారు పడవవాళ్ళు.

పడవ కామదేవపురం చేరగానే దేవేంద్రుడు అరిందముడి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళి, ఇంటిముందర పత్రిక చదువుతున్న అరిందముడి పేరడిగి తెలుసుకొని, "మీ కొక ఉత్తరం ఉంది," అంటూ జేబులోనుంచి ఉత్తరం తీసిఇచ్చాడు. అందులో ఇలా ఉంది :

"మిత్రమా, చాలా రోజులుగా నీ సమాచారం తెలియటంలేదు. మేము క్షేమంగా ఉన్నాము. నిన్ను చంపే ఆలోచనతప్ప మాకు రోజూ మరొకటి లేదు. నువుకూడా మమ్మల్ని పట్టుకునే ప్రయత్నంలోనే ఉండిఉంటావు; అయితే మాజాడ తెలిసి ఉండదు. అందుకే ఈ ఉత్తరం. మా సంగతి అంతా దేవేంద్రుడు చెబుతాడు. అతను నా రోగం కుదర్చటానికి మా ఇంటికి వచ్చాడు — తెలిసిందా ?— ఫూల్ సాహెబు."

అరిందముడు దేవేంద్రుణ్ణి, "నీ కీ ఉత్తరం ఎవ రిచ్చారు ?" అని అడిగాడు.

"నా కేమీ తెలీదు. నా అనుభవం వింటే మీరు నిర్ఘాంతపోతారు," అని దేవేంద్రుడు గడచినరాత్రి తనకు కలిగిన అనుభవాలు వివరించాడు.

దేవేంద్రుడి పేర ఉన్న రెండు ఉత్తరాలను కూడా అరిందము డడిగి తీసుకుని చది వాడు. అందులో ఒకటి ఇలా ఉంది :

"దేవేంద్రవిజయా, నువు న న్నెరగవు, కాని నేను నిన్ను బాగా ఎరుగుదును. నువు మీ వూరైన భవానీపురంనుంచి వేణీమాధవపురం ఎందుకు వెళుతున్నదీ నాకు తెలుసు. గోపాలచంద్రుడితో మాట్లాడి, కలకత్తాకు వెళ్ళి ఒకడిటెక్టివును వియోగించి రేవతి ఆచూకీ సంపాదించాలని నీ ఉద్దేశం. శతవిధాల అరిందముణ్ణి వియోగిసావు. నీకు రేవతిపైన ప్రేమ. మీకు పెళ్ళిమాటలుకూడా జరిగాయి. కాని దైవ నిర్దేశం మరొకలాగున్నది. వేణీమాధవపురంలో కేశవచంద్రుడు తెలుసా ?అది నేనే."

రెండోఉత్తరం ఇలా ఉంది :

"దేవేంద్రవిజయా, తప్పించుకున్నావని సంతోషించకు. నేను నిన్ను క్షమించను. నీ ప్రాణాలతో ఆడుకోవటానికి నిన్ను విడిచాను. నా పగ నీకు తెలీదు. నీ రక్తంలో చేతులు కడుక్కుంటేగాని నా అవమానం తీరదు — జుమీలియా."




ఉత్తరాలలో అరిందముడికి కొత్త విషయా లేమీలేవు. కేశవచంద్రుడే ఫూల్‌సాహెబన్న సంగతి అత నెరిగినదే.

"నువు వాళ్ళచేతుల్లో పడి ప్రాణాలతో బయటికిరావటం కేవలం అదృష్టమే. నాకు చాలా సంతోషంగా ఉన్నది," అన్నా డరిందముడు.

"మీరు వీళ్ళ నెలా ఎరుగుదురు ?'' అన్నాడు దేవేంద్రుడు.

"అటువంటివాళ్ళను కొందరిని ఎరగడమే కదా నా పని. రేవతి పినతండ్రి గోపాలబాబు గురించి నీకు నిజం తెలుసా ?"

"చాలా గొప్పవాడు. అందరూ ఆయనను గౌరవిస్తారు."

"నువు మా ఇంట్లో రెండు మూడురోజు లుండి నాకు సహాయపడితే నేను రేవతి జాడ కనుక్కుంటాను," అన్నా డరిందముడు. అందుకు దేవేంద్రుడు సమ్మతించాడు.

"నిన్న నువు వెళ్లిన ఇంటికి నన్ను తీసుకుపోగలవా ? అక్కడికి వెళ్లితీరాలి," అన్నా డరిందముడు.

''అడవినపడి రాత్రివేళ వెళ్లాను. దారి తెలుస్తుందో, తెలీదో ! అయినా ప్రయత్నింతాం,'' అన్నాడు దేవేంద్రుడు.

తరువాత వాళ్ళు ఫూల్‌సాహెబు గురించీ, రేవతి గురించీ చాలా సేపు మాట్లాడుకున్నారు. ఆ రాత్రి ఇద్దరూ అరిందము డింటనే భోజనం చేసి, వెంటనే ప్రయాణ

మయాను. వారు పూల్‌సాహెబింటి ముందర చేరటానికి చాలా ప్రయాసపడవలసి వచ్చింది. ఆ ఇల్లెవరి దని దారేపోయ్యేవాణ్ణి అడిగితే, జమీందారు జానకీబోసుగారి దనీ, ఆయన వేణీమాధవపురంలో ఉంటాడనీ చెప్పాడు. జానకీబో సంటే జానకీనాథ వాసు — రేవతి తండ్రే!

ఇంటిచుట్టూ ఉన్నతోట అడవిలాగా పెరిగిపోయిఉన్నది. దాని మధ్యగా చాలా దూరం వెళ్లితేనేగాని ఇల్లు కంటపడలేదు. పై అంతస్తులో ఒక కిటికీ దగ్గిర జుట్టు విరబోసుకుని జూమిలియా కనిపించింది. అరిందము డామెను గుర్తించాడు. "ఆ పిశాచే నన్ను మోసగించింది," అని దేవేంద్రుడు చెప్పాడు.

జూమిలియాకు కనపడకుండా ఇంట్లో ప్రవేశించాలని అరిందముడు వెనక ద్వారం కుండా ప్రవేశించి, ఆమెను వెనకనుంచి సమీపించి పట్టుకోబోయాడు. జూమిలియా అతన్ని చూస్తూనే పక్కగదిలోకీ, అందులోనుంచి వరండాలోకీ, ఆ తరవాత ఒక గదిలోకీ, మరొక గదిలోకీ పరిగెత్తి, ఆఖరుకు ఒక గదిలో దూరి తలుపు గడియ పెట్టేసింది. అరిందముడు కాళ్ళతో బలంగా తన్ని తలుపులు పగలగొట్టి లోపలికి వెళ్లాడు. కాని గదిలో ఎవరూలేరు. ఆ గదికి వేరే ద్వారంలేదు. రెండు కిటికీ లున్నాయి గాని, వాటికి ఇనుపకమ్మీ లున్నాయి. గదిలో ఒకపక్కగా అలమారు తప్ప ఇంకేమీలేదు. జూమిలియా కనుకట్టుచేసి అదృశ్యమైపోయింది!

అరిందము డలా జూమిలియాను తరుముతూ పోగానే, దేవేంద్రుడు పూల్‌సాహెబును పట్టుకోవటానికి కిందికి బయలుదేరాడు. అతను కొంతదూరం వెళ్ళే సరికి, నిన్నటిరాత్రి కనిపించిన కపటరోగి ఒక గదిలోకి పోతూ అతని కంటపడ్డాడు. దేవేంద్రు డా గదివాకిలిని సమీపించి, ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు.

పూల్‌సాహెబు అతన్ని చూసి ఆశ్చర్యపడకపోగా నవ్వుతూ, "ఏం, దేవేంద్ర బాబూ, మళ్లీ ఏమాలోచించుకుని వచ్చావు?" అన్నాడు.

దేవేంద్రుడు భీకరంగా, "దుర్మార్గుడా, నీకు తగిన శిక్ష ఇవ్వటానికి వచ్చాను," అన్నాడు

"భేష్! చాలా సంతోషం! ఒక్కడివే వచ్చావా? అరిందముణ్ణి తోడు తీసుకు రాలేదూ?" అన్నాడు పూల్‌సాహెబు.

దేవేంద్రుడు జేబులోనుంచి పిస్తోలు తీసి, పూల్‌సాహెబు తలకు గురిచేసి, "కదిలా వంటే తల పేలిపోతుంది," అన్నాడు.

పూల్‌సాహెబు విరగబడి నవ్వుతూ, "నా చేతికి సంకెళ్ళు తగిలించటానికి వచ్చి, అలా వెర్రిగా చూస్తావెందుకు? నే నెక్కడికీ కదలను. నీ పని నువు కానిచ్చుకో," అన్నాడు.

దేవేంద్రుడు ఫూల్‌సాహెబును సమీపించాడు. ఫూల్‌సాహె బేదో భయంకరమైన చప్పుడు చేశాడు. దేవేంద్రుడి కాళ్ళకింద నేల విచ్చుకుంది. అతను అగాధంలో పడిపోయాడు.

వెంటనే ఫూల్‌సాహెబు జూమీలియా కీ వార్త చెప్పటానికి మేడమీదికి వెళ్ళాడు. అతను జూమీలియా మాయమైన గదిదగ్గిరికి వచ్చేసరికి పగిలిపోయిన తలుపులు కనిపించాయి. అరిందముడు వచ్చే సమయానికి ఫూల్‌సాహె బింట్లోలేడు. జూమీలియాను అరిందాముడు తరమటమూ, ఆమె అదృశ్యం కావటమూ అతనికి తెలీదు. అతను గదిలోకి వెళుతూనే అక్కడ నిలబడిఉన్న అరిందముణ్ణి చూశాడు.

"ఏమి టిది, అరిందంబాబూ? ఉన్నట్టుండి ఏదో ఆలోచన చేశారే?" అన్నాడు ఫూల్‌సాహెబు.

"చాలారోజు లైంది. తమరి దర్శనంకోసం వచ్చాను.'' అన్నా డరిందముడు.

"అయితే నేను దేవేంద్రుడిద్వారా పంపిన ప్రేమలేఖ అందిందన్నమాట. మీరు వస్తారని తెలుసుగాని, ఇంత త్వరగా వస్తారనుకోలేను. వస్తే వచ్చారు. ఆ కుర్రాణ్ణి దేవేంద్రణ్ణి తీసుకురావలిసిందికాదు. నాపైన పోగరుచూపి, పాపం, అకాలమరణం వాతపడ్డాడు," అన్నాడు ఫూల్‌సాహెబు.

అరిందముడు కోపంతో వణుకుతున్న గొంతుతో, ''నువ్వతన్ని చంపావా?" అని అడిగాడు.

"నేను చంపాలా? అతనే చచ్చాడు. నే నతన్ని తాకనైనా తాకలేదు. ఆ మాట పరే గాని, నీవద్ద ఆయుధ మేదైనా ఉన్నదా?"

''ఆ! ఏం?''

''ఉంటుం దనే నేనూ అనుకున్నాను.''

"నీ దగ్గిరకూడా ఉన్నదా?"

''లేదు. ఉంటే నిన్ను చూస్తూనే చంపి ఉండనా? నేనైనా చావాలి, నువ్వయినా చావాలి. నే నింక నీకు ప్రాణాలతో దొరికేమాట వట్టిది,'' అన్నాడు ఫూల్‌సాహెబు.

''నే నిప్పుడే నిన్ను పట్టుకోబోతున్నాను.''

"అసాధ్యం; ఎందరో ప్రయత్నించారు.''

మాట్లాడుతూనే ఫూల్‌సాహెబు అరిందముడి పైకి లంఘించి, అతని కంఠాన్ని గట్టిగా పట్టుకున్నాడు. అరిందముడు ఫూల్‌సాహెబు కంఠాన్ని ఒకచేత్తో పట్టుకుని, రెండవచేత్తో అతని నుదిటిపైన బలంగా గుద్దాడు. ఫూల్‌సాహెబు ముఖం పగిలి రక్తం కారసాగింది. ఇద్దరూ కలియబడి చాలాసేపు పెనగులాడారు. చివరకు ఫూల్

సాహెబు తన మొలలోనుంచి ఒక దబ్బనంలాటిది తీశాడు. దానిమొన వాడిగా ఉన్నది. అది విషం పూసినదని గ్రహించి అరిందముడు, దానితో పూల్‌సాహెబు తనను పొడవ యత్నించినపుడు అతని చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

పూల్‌సాహెబు తన రెండోచేత్తో అరిందముడి మొహాన్ని బలంకొద్దీ కొట్టాడు. అయినా అరిందముడు తన పట్టు విడవలేదు. ఇంతలో పూల్‌సాహెబు చెయ్యి గురితప్పి జారి దబ్బనం మొనపైన పడింది. ఒక క్షణంలో పూల్‌సాహెబుకు స్పృహ తప్పింది. అతను కిందపడి గిలగిలా తన్నుకోసాగాడు. త్వరలోనే అతను చచ్చినట్టు పడిపోయాడు.

అరిందము డతని శరీరంపై చెయ్యివేసి చూశాడు. చల్లగా ఉన్నది. పూల్ సాహెబు శ్వాసకూడా నిలిచిపోయింది. అయినా అరిందముడు పూల్‌సాహెబును నమ్మలేక, అతని చేతులకు బేడీలు తగిలించి, ఒక మంచంపైన పడుకోబెట్టి, పైన చాప కప్పాడు.

## 2

పూల్‌సాహెబు అన్నమాట విన్నప్పటినుంచీ అరిందముడికి దేవేంద్రుణ్ణి గురించి దిగులుగానే ఉంది. అతను ఆ కుర్రవాడికోసం ఇల్లంతా వెతికాడు, కాని దేవేంద్రుడు కనిపించలేదు. అతని శవమైనా కనిపించలేదు. అతను కిందిగదుల్లో వెతుకుతూండగా ఒక గదిలో మూలుగు వినపడింది. శ్రద్ధగా ఆలకిస్తే, ఎక్కడో దూరాన నీటిలో ఏదో కొట్టుకున్నట్టు వినపడింది. గది బయటికి వస్తే ఏమీ లేదు. అతను భయపడుతూ మళ్ళీ ఆ గదిలోకి వెళ్ళి, జాగ్రత్తగా పరీక్షిస్తే, నేలలో ఒక చోట ఒక రహస్యద్వారం కనిపించింది. దాన్ని కాలితో బలంకొద్దీ తన్నగా అది తెరుచుకున్నది. గుప్పున దుర్గంధం పైకి వచ్చింది. దుర్గంధాన్ని సహించి లోపలికి చూస్తే కటికచీకటి; ఏమీ కనిపించటంలేదు. మూలుగుమాత్రం వినపడుతున్నది.

అరిందముడు తన టార్చి వెలిగించి కూపంలోకి లైటువేశాడు. ఎవరో గుండెల లోతు బురదలో దిగబడి కొట్టుకోవటం కనిపించింది.

"దేవేంద్రబాబూ! దేవేంద్రబాబూ!"

"వచ్చారా! చచ్చిపోతున్నాను! రక్షించండి." అన్నమాటలు వినిపించాయి.

"ఇంకా నయం, ప్రాణాలతో ఉన్నావు! వస్తున్నాను, భయపడకు!" అంటూ అరిందము డా కూపంలోకి దిగి, ఊబిలోనుంచి దేవేంద్రుణ్ణి పైకిలాగాడు. అది తేలికపని కాదు




అరిందముడతన్ని పైకి తీయగానే దేవేంద్రుడికి స్పృహ తప్పింది. అతన్ని భుజాన వేసుకుని అరిందముడు అత్యంతప్రయాసతో పైకి వస్తుండగా జూమీలియా పైనున్న ద్వారంవద్దకు వచ్చి, "ఇప్పుడు మీ రిద్దరూ నాకు చిక్కారు." అన్నది.

అరిందముడు తలఎత్తి చూశాడు. జూమీలియా ఒక చేతిలో లాంతరూ, రెండో చేతిలో ఎర్రని ద్రావకంగల సీసా పట్టుకుని ఉన్నది.

''నువు నన్ను క్షమించమని వేడుకుంటే మీ ఇద్దరి ప్రాణాలూ దక్కనిస్తా—నాకు జాలిపుడితే!'' అన్నది జూమీలియా.

"నువు రాక్షసివి. రాక్షసుల కెవరూ క్షమాపణ చెప్పరు; వేడుకోరు." అన్నాడరిందముడు.

"అయితే నిన్ను హింసపెట్టి చంపేస్తా! ఎలాగో చూస్తావా? ఇలా," అంటూ ఆమె అతనిపై ఒక చుక్క ద్రావకం వేసింది. అది భగ్గున మండింది. కాని అరిందముడు బాధను పైకి తెలియనివ్వలేదు.

"ఏమిటి? నన్ను ప్రాణభిక్ష వేడుతావా?"

"నువు రాక్షసివి.''

"ఆఖరుసారి అడుగుతున్నాను. ప్రాణభిక్ష కావాలా?"

అరిందముడు మాట్లాడలేదు.

ఆమె కోపంతో సీసా ఎత్తి అందులోని ద్రావక మంతా కుమ్మరించబోతుండగా,

ఆమె వెనుకనుంచి ఎవరో సీసా లాగేసి ఆ ద్రావకాన్ని ఆమెపైనే కుమ్మరించేశారు. జూమీలియా బాధ భరించలేక పారిపోయింది.

అరిందముడు తన మనసులో దేవుణ్ణి స్మరించుకుని, దేవేంద్రుడితోసహా పైకి వచ్చి, దేవుడల్లే తనను కాపాడినమనిషికి కృతజ్ఞత తెలుపుకున్నాడు.

ఆత నొక ఇరవై ఏళ్ళవాడు, పొడుగుగా, అందంగా ఉన్నాడు. చూడటానికి ముసల్మానులా గున్నాడు. అతనూ, అరిందముడూ చాలా సేపు యత్నించినమీదట దేవేంద్రుడికి స్పృహ తెలిసింది.

తరవాత అరిందము డా ముసల్మాను కుర్రవాడి పేరడిగి, అతను సిరాజుద్దీ నని తెలుసుకున్నాడు. అతన్ని కాపాడ మనే కుల్సుమ్ కోరింది.

సిరాజుద్దీను దేవేంద్రుణ్ణి చూపించి అరిందముడితో, "నిన్న ఇతన్ని ఈఇంట్లోనే చూశాను. అప్పు డితను ఒకగదిలో పొగలో ఊపిరాడక తన్నుకుంటుంటే, కిటికీ పగలగొట్టి కాపాడాను. నన్ను ఆ పక్కగదిలోనే ఖైదుచేసి ఉంచారు. నిన్న అతను వచ్చిఉండవలసిందే కా నయితే," అన్నాడు.

తనను పూల్‌సాహెబే నిర్బంధంలో ఉంచాడనీ, ఏదో దురుద్దేశంతోనే అలా చేసిఉంటా డనీ అత నన్నాడు.

"ఇప్పు డెలా తప్పించుకురాగలిగావు ?" అని అరిందము డడిగాడు.

"నన్ను పై అంతస్తుగదిలో ఉంచారు. నేను మంచంమీద పడుకుని ఏదో ఆలోచిస్తుంటే, జూమీలియా నా గదిలో ఉండే చిన్నవాకిలి తెరుచుకుని కంగారుపడుతూ వచ్చింది. నేను నిద్రపోతున్నట్టు నటించాను. ఆమె చాలా సేపు నా గదిలోనే ఉండి, మళ్ళీ అదేద్వారంగుండా అవతలికి పోయింది. జూమీలియా అంత కంగారులో ఉండటం ఎన్నడూ చూడలేదు. చివరకు నేను మెల్లిగా లేచి ఆ ద్వారంవద్దకు వెళ్ళి చూస్తే అది తెరిచేఉంది. కంగారులో జూమీలియా దాన్ని మూయటం మరిచి పోయింది. ఆ దారిన బయలుదేరి ఎన్నో గదులు తిరిగాను. ఒక గది తలుపు నేను తెరుచుకురాగానే దానంతట అదే మూసుకున్నది. తిరిగి చూతునుగదా అని అలమారు: చివరకు నేను కిందికి దిగి ఇక్కడికి చేరేసరికి జూమీలియా ఏదో రాక్షసకృత్యం చెయ్యబోతుండటం కనిపించింది. ఆమె చేతిలోని సీసా కాస్తా లాగేశాను.'' అన్నాడు సిరాజుద్దీన్.

"నువు చేసినమేలు జన్మలో మరవలేము. నీకు కుల్సుమ్ తెలుసా ?"

"తెలుసు. ఆమె ఈ పూల్‌సాహెబు చేతిలో పడేఉంటుంది."

''కుల్సుమ్ క్షేమంగాఉంది. ఆమె తండ్రిమాత్రం పోయాడు."




"విన్నాను. ఈ దుర్మార్గుల రహస్యాలన్నీ అరిందముడనే ఆయనకు తెలుసట. అందుకే వీళ్ళక్కడ దాగిఉన్నారు."

"నేనే ఆ అరిందముణ్ణి. కుల్సుమ్ నా దగ్గరే ఉన్నది."

ముగ్గురూ కలిసి పూల్‌సాహెబును ఉంచిన పై అంతస్తుగదికి వెళ్లారు.

అరిందముడు తెల్లబోయాడు. అక్కడ పూల్‌సాహెబు లేడు.

"మీరు పూల్‌సాహెబునుంచింది ఈ గదిలోనా? నే నిటుగా వచ్చినప్పటికే ఇక్కడ ఎవరూ లేరు. అదుగో ఆ అలమారే ద్వారం." సిరాజుద్దీను ఆ అలమారు గుండా వారిని అవతలికి చేర్చి తాను బందీగా ఉండిన గదిదాకా తీసుకుపోయాడు. తరవాత వారు ఇల్లంతా శోధించసాగారు.

ఆ సమయంలో జూలియా ఒక నేలమాళిగలో స్పృహలేకుండా పడిఉన్న పూల్‌సాహెబును చూస్తూ నిలబడిఉన్నది. ఒక గుడ్డిదీపంమాత్రం వెలుగుతున్నది. ఆమె ఒకటి రెండుసీసాల నుంచి ఏదో ద్రవాలచుక్కలు పూల్‌సాహెబు పెదవుల మధ్య పోసింది. కాని అవి నోట్లోకి పోక, పక్కలకు కారిపోయాయి.

జూలియా ఒకకత్తి తీసి దానితో పూల్‌సాహెబు చేతిలో విషపుమొన గుచ్చుకున్నచోట గాటు పెట్టి, రక్తం పీల్చింది. పూల్‌సాహెబుకు చైతన్యం వచ్చింది. అప్పుడామె అతనినోట సీసాలోని చుక్కలు పోసింది. అతను క్రమంగా తేరుకుని, లేచికూర్చున్నాడు.

జూమీలియా అతనికి జరిగినదందా చెప్పింది. తాను అరిందముడిపైనా, అతను రక్షించే దేవేంద్రుడిపైనా ద్రావకం పొయ్యబోతుండగా సిరాజుద్దీను వచ్చి ఆ ద్రావకాన్నే తనపై పోసినసంగతీ, తాను పరిగెత్తిపోయి దానికి విరుగుడు చేసి, ఫూల్‌సాహెబు కెక్కిన విషానికి వెయ్యటమూ చెప్పింది.

"సిరాజుద్దీను తప్పించుకుపోయాడా? వాణ్ణి కుల్సుమ్‌దగ్గిర చేర్చినా నాలుగైదు వేలు దొరికిఉండేవే!" అన్నాడు ఫూల్‌సాహెబు.

"ఏంచెయ్యాలన్నా అరిందముడడ్డమె," అన్నది జూమీలియా.

"అవును. అరిందముణ్ణి చంపితేగాని మన కదృష్టం ఎత్తుకోదు."

# 3

రెండుమాసాలు గడిచాయి. ఆ కాలంలో కుల్సుమ్‌కూ, సిరాజుద్దీనుకూ పెళ్ళి అయింది. అరిందముడు ఎన్ని ప్రయత్నాలు చేసినా జూమీలియా ఫూల్‌సాహెబుల జాడ దొరకలేదు.

ఇంకోవంక అరిందముణ్ణి చంపటానికి సన్నాహం సాగుతున్నది. మహారణ్యం మధ్య కొంపవద్ద కాలూరాయ్ మందిరంలో అనేకమంది గుమికూడారు. అక్కడికి ఫూల్‌సాహెబుకూడా వచ్చాడు.

అందరూ చేరారని తెలుసుకుని ఫూల్‌సాహెబు అరిందముణ్ణి చంపటం వారందరి కర్తవ్యమూ నని తెలిపాడు. అతను ఒక్కొక్కణ్ణీ నంబరుపెట్టి పిలిచి, "అరిందముడు మీ కేంచేశాడు?" అని అడిగి జవాబు చెప్పించాడు.

అక్కడ చేరిన పదముగ్గురిలో అరిందముడి దెబ్బ తగలనివాడు లేడు. వారిలో గౌరచంద్రుడు కూడా ఉన్నాడు. అందరూ చెప్పేది అయిపోయినాక ఫూల్‌సాహెబు, "నాకు అరిందముడిపై ద్వేషం ఉండటానికి కారణం మీ రెవరూ ఎరగరు. అతను నాకు సమఉజ్జీ. నావంటివాడు మరొక డుండటం నేను సహించలేను. అతనన్నా ఉండాలి, నే నన్నా ఉండాలి," అన్నాడు.

అరిందముణ్ణి చంపుతామని అందరిచేతా ఫూల్‌సాహెబు ప్రతిజ్ఞ చేయించాడు.

# 4

దేవేంద్రు డింకా అరిందముడి ఇంటనే ఉన్నాడు. రేవతిని గురించిన విచారణ అతన్ని బాధిస్తున్నది. అరిందము డిచ్చే ధైర్యం అతనికి చాలటంలేదు. ఆమెను వెతకటానికి మరెవరి సహాయమైనా తీసుకోవా లనికూడ అతడి కున్నది. అతనికి ఒక్కొక్క క్షణం యుగంలాగా గడుస్తున్నది.

ఒకనాటి మధ్యాహ్నం అరిందముడు భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటూండగ ఎవరో స్త్రీ ఆతన్ని చూడవచ్చింది. లోపలికి వెళ్ళమని నౌకరు చెప్పినా కూడ ఆమె ద్వారం దగ్గిరే నిలబడింది. అరిందము డామె బట్టలు మాసి ఉండటమూ జుట్టు జడలుకట్టి ఉండటమూ, శరీరం మట్టి కొట్టుకుని ఉండటమూ గమనించి "ఎవరు ?" అని అడిగాడు.

"నేను పూల్‌సాహెబు భార్యను," అన్న దామె. "నా పేరు మోహిని."

"ఓహో, అలాగా ?"

"పూల్‌సాహెబు మిమ్మల్ని చంపుతా నని ప్రతిజ్ఞ పట్టాడు తెలుసా ? తెలిసి, కూడా చేతులు కట్టుకొని కూర్చున్నా రేం ?"

"తెలిసి ఏం చెయ్యాలి ? రెండుమూసాలుగా అతనిజాడ అంతుచిక్క లేదు."

"అంతుచిక్క కపోతే వెతకాలి. నే నతన్ని రెండురోజుల్లో పట్టియ్యగలను."

"నీ భర్తను పట్టిస్తే నీ కేం లాభం ?"

"చాలా లాభా లున్నాయి. ఇప్పుడు వాటి గొడవ దేనికి ? ఈసారి మిమ్మల్ని చంపటానికి పెద్ద ప్రయత్నం చేస్తున్నాడు. మిమ్మల్ని హెచ్చరించటానికే వచ్చాను ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా దెబ్బ తింటారు."

"పూల్‌సాహెబు అంత గట్టిప్రయత్న మేమిటి చేస్తున్నాడు ?"

"మిమ్మల్ని హత్య చేయటానికి ఒకదొంగలముఠాను పోగుచేసి వారిచేత ప్రమాణాలు చేయించాడు. వాళ్ళందరూ హంతకులే. ఒకరూ, ఇద్దరూ కాదు. పదముగ్గు రున్నారు."

"అందరూ నన్ను చంపగోరేవారేనా ?"

"నిశ్చయంగా. ఇవాళరాత్రే వాళ్ళంతా అందుకోసం ఇక్కడికి రాబోతున్నారు. రెండుగంటలు దాటాక వస్తారు.

"నిజమేనా ?"

"ఇందులో అబద్ధ మేమీలేదు. నా మాట విని పోలీసురక్షణ పెట్టుకోవటం మంచిది."

"అయితే పూల్‌సాహెబు చిక్కాడన్నమాటే. అయితే నువు నీభర్తకు విరుద్ధంగా ఎందు కీ ప్రయత్నం చేస్తున్నావు ?"

"అతను నాకు ప్రబలశత్రువు గనుక. నే నతన్ని ద్వేషిస్తున్నంతగా ఎవరూ మరొకరిని ద్వేషించలేరు."

"ఆ ద్వేషానికి కారణం ?"

మోహిని సమాధానం చెప్పకుండా గిరుక్కునతిరిగి వెళ్ళిపోయింది.

ఇది జరిగినప్పుడు దేవేంద్రు డింట్లోలేడు. ఎటో వెళ్ళాడు. అరిందముడు మోహిని మాటలను విశ్వసించ నిశ్చయించి, కర్తవ్యం నిర్ణయించుకుని, ఠాణాకు వెళ్ళాడు. యోగీంద్రుడు ఠాణాలోనే ఉన్నాడు.

అరిందముడు చెప్పినదంతా విని యోగీంద్రుడు, "మీ ఇంటిపైన పెద్ద బందిపోటు జరగ బోతున్న దన్నమాట! ప్రమాదమే," అన్నాడు.

"వా రందరినీ తెచ్చి రేపు ఉదయం మీముందు నిలబెట్టనా?" అన్నా డరిందముడు.

"అయితే మీ కెంతమంది సహాయం కావాలో చెప్పండి.

"ఎవరూ అక్కర్లేదు."

"ఒక్కరే పదముగ్గురినీ పట్టుకుంటారా?" అన్నాడు యోగీంద్రు డాశ్చర్యంతో.

"ఒక్క జేమిటి? దేవేంద్రవిజయు డున్నాడుగా?"

"అతను మీ కేం సహాయం చేస్తాడు? మీరే అతనికి చెయ్యాలి. అనా డదికూడా చూశాంగా?"

"పాపం, కుర్రాడు, కాని బుద్ధిమంతుడు. నా దగ్గిర డిటెక్టివుపనివి నేర్చుకుంటా నవికూడా అడుగుతున్నాడు."

"ఇద్దరైతే మాత్రం పదముగ్గు ర్నెలా పట్టుకుంటారు?"

"నే నొక్కణ్ణే ఇరవైమందిని పట్టుకున్నానే. తెలీదా? నాకుమాత్రం ఒక ఎలెక్ట్రిక్ బాటరీ, రాగితీగలూ కావాలి."

"దేనికి?"

"చిన్న శాస్త్రప్రయోగం చెయ్యాలి."

"ఇం కేం కావాలి?"

"పదమూడుజతల సంకెళ్ళు?".

"మీ ఉద్దేశం నా కేమీ అంతుబట్టలేదు. కనీసం దజనుమంది పోలీసుల నైనా పంపుతాను."

"ఒక్క డుకూడా వద్దు. నాలో నమ్మకం లేదా?"

"సరే మీ యిష్టం. మీరు కోరిన వన్నీ అరగంటలో మీ యింటికి పంపిస్తాను."

అరిందముడు ఇంటికి వచ్చిన కొద్దిసేపటికి కూలివాళ్ళు బాటరీలూ, రాగి తీగలూ, సంకెళ్లూ తెచ్చారు. వాటిని తను మేడమీది గదిలో భద్రంచేశాడు.

ఎప్పుడో బయటకి వెళ్ళిన దేవేంద్రుడు రాత్రి తొమ్మిదింటికి తిరిగి వచ్చాడు.

"ఫూల్‌సాహెబ్ ఇవాళ మనంటికి. వేంచేస్తున్నాడు." అంటూ అరిందముడు దేవేంద్రుణ్ణి మెట్లదాకా తీసుకుపోయి, ''మెట్లెక్కు,'' అన్నాడు.

మెట్లమీద కాలు పెట్టగానే దేవేంద్రుడికి షాక్ తగిలింది. అతను దూరంగా వెళ్ళి పడ్డాడు. "ఇది ఒక బాటరీతో తగిలిన షాక్. పది బాటరీ లున్నాయి. అంతషాక్ తగిలాక మనిషి నిలబడ్డచోట స్తంభించిపోతాడు. ఫూల్‌సాహెబు రేవతి సంగతి చెప్పేదాకా అంత షాక్ తింటాడు.'' అంటూ అరిందముడు జరిగిన సంగతి చెప్పాడు.

ఆ రాత్రి పదకొండు కాకముందే వాళ్ళిద్దరూ భోజనం చేసి, మేడమీది గదిలో చదరంగ మాడుతూ కూర్చున్నారు. ఆట పూర్తి అయేసరికి రాత్రి రెండయింది.

''వాళ్ళింకో గంటలో వస్తారు. నువు కిందనున్న మెట్లపక్క గదిలో రబ్బరు కాలిజోళ్ళు, రబ్బరు చేతితొడుగులూ ధరించిఉండు. అవి ఉంటే షాక్ తగలదు ఆ గదిలో దక్షిణపుమూల ఒక తీగ ఉన్నది. దొంగలు పదముగ్గురూ మెట్లపైకి రాగానే ఆ తీగ లాగు. మిగిలిన పని నేను చేస్తాను,'' అన్నాడు అరిందముడు.

"ఒకళ్ళు బయట కాపలా ఉంటారేమో ?''

''జమీలియా ఉండవచ్చు. ఆమెపైన ఫూల్‌సాహెబుకు చాలా విశ్వాసం.''

''పదముగ్గురూ ఒక్కసారే మెట్లెక్కుతా రని ఏమిటి ?"

''ఎక్కుతారు. ఫూల్‌సాహెబు దొంగలాగా రాడు. రహస్యంగా పని చెయ్యటం అతనికి అవమానం."

దేవేంద్రుడు కిందికి దిగివెళ్ళి, మెట్లపక్క గదిలో చీకటిలో కూర్చున్నాడు. కొంచెం సేపటికి బయట అడుగుల చప్పుడు వినిపించింది. ముందర గది కిటికీ చువ్వ లూడలాగి దొంగలు ఒకరొకరుగా లోపలికి రాసాగారు. ఫూల్‌సాహెబు అగ్గిపుల్ల వెలిగించి, పదముగ్గురినీ లెక్కించాడు. అందరి చేతుల్లోనూ మెరిసే కత్తు లున్నాయి. చప్పుడు చెయ్యకుండా అందరూ మెట్లదగ్గిరికి వచ్చి మెట్లెక్క సాగారు. ఆఖరువాడుకూడా మెట్లమీదికి వెళ్ళాక దేవేంద్రుడు తీగను గట్టిగా లాగి పట్టుకున్నాడు.

మరుక్షణమే ఇల్లంతా బీభత్సంతో నిండిపోయింది. కేకలూ, ఆర్తనాదాలూ, గగ్గోలు పుట్టింది — గుర్రపుసాలకు నిప్పంటుకున్నట్టుగా.

అరిందముడు ఒక లాంతరు తీసుకుని లోపలిగదిలోనుంచి మెట్లవాకిలి వద్దకు వచ్చి మెట్లమీది దృశ్యం చూసి చిరునవ్వు నవ్వాడు. మెట్లకింద దేవేంద్రుడు గోడ నానుకుని విరగబడి నవ్వుతున్నాడు.

అందరికన్న ముందుగా, అరిందముడి కెదురుగా ఉన్న పూల్‌సాహెబు బాధను సూచించే ధ్వని ఏదీ చెయ్యడంలేదు. కాని అత నెంత బాధను సహిస్తున్నదీ అతని ముఖంలోనూ, శరీరంలోనూ తెలుస్తూనే ఉన్నది.

"డాక్టరుబాబుగారా ? చాలా కాలానికి సపరివారంగా దయచేశారు. సంతోషం. మిమ్మల్ని తగినట్టుగా గౌరవించాను. ఏమంటారు?" అన్నా డరిందముడు.

అతను సంకెళ్ళు తీసుకుని దిగిపోయి, వాటిలో కొన్నిటిని దేవేంద్రుడి కిచ్చాడు. అయిదు నిమిషాలలో ఇద్దరూ కలిసి, పూల్‌సాహెబుకు తప్ప మిగిలినవా ళ్ళందరికీ సంకెళ్ళు తగిలించేశారు.

పూల్‌సాహె బొక్కడే యమయాతన అనుభవిస్తూ మెట్లపై మిగిలాడు.

''నే నడిగే ప్రశ్నలకు సరయిన సమాధానా లిచ్చేదాకా నీకీ యాతన తప్పదు. ఒకపిల్ల శవాన్ని ఠాణాకు పంపావే, ఎవ రా పిల్ల ?''

''రేవతి చెల్లెలు రోహిణి."

''ఆమె నెవరు చంపారు ?''

''నేనే.''

''ఎందుకు చంపావు ?''

''చంపటం నాకు సరదా.''

''రేవతి పినతండ్రి ఎలాటివాడు ?''

''నాకన్నా క్రూరుడు. నేను పరాయివాణ్ని. పినతండ్రి అయివుండి ఆస్తికోసం తన అన్నకూతుళ్ళను చంపగోరినవాడు నా కంటె క్రూరుడు కా కేమవుతాడు ?''

"ఇద్దరినీ హత్య చెయ్యటానికి ఆయనవద్ద ఎంతకు మాట్లాడుకున్నావు ?"

''ఇరవై వేల రూపాయలు.''

''ఎంత ముట్టింది ?"

''దమ్మిడీకూడా ముట్టలేదు.''

"ఏం ?''

''ఇంకా రేవతిని చంపకపోవటంచేత."

''ఎందుకు చంపలేదు ?"

''నా నోటిముందరి కూడు నీవే లాగేశావు."

''అంతదాకా ఎందుకు జాప్యం చేశావు ?"

''రేవతిమీది మోహంచేత. రేవతి లొంగివస్తే, రోహిణి హత్యపేరుతో ఆమె పినతండ్రికి ఉరిశిక్ష వేయించి, జమీందారీ అంతా కాజేద్దా మనికూడా అనుకున్నాను.''

"రేవతి దగ్గిరా, ఆమె పినతండ్రి దగ్గరా ? ని పేరు కేశవచంద్రుడని చెప్పు కున్నావు కాదూ ?"

"నేను చాలా పేర్లతో చలామణీ అవుతాను."

"మోహిని నీ కేమవుతుంది ? నీ భార్యేనా ?"

"కాదు, నా మృత్యువు."

"ఏం ?"

"లేకపోతే నా కీ గతి ఎందుకు పట్టుతుందీ ? ఆమె సహాయం లేకుండా నువ్వీ పనంతా చెయ్యగలవా ? బాగా బాధగా ఉంది. భరించటం కష్టంగా ఉంది."

"ఇం కొక్క విషయం. రేవతి పినతండ్రి గురించి నువ్వన్నదంతా నిజమేనా?"

"చావటానికి సిద్ధంగా ఉండీ అబద్ధం చెబుతానా ?"

అరిందముడు సంజ్ఞ చేయగానే దేవేంద్రుడు పూల్‌సాహెబుకు సంకెళ్ళు తగిలించాడు.

దేవేంద్రుడు ఠాణాకు వెళ్లి దొంగలు పట్టుబడ్డ సంగతి చెప్పగానే యోగీంద్రుడు అయిదారుగురు పోలీసులతో వచ్చి, అరిందముణ్ణి మెచ్చుకుని, దొంగలను వెంట బెట్టుకుని ఠాణాకు బయలుదేరాడు. వారివెంట అరిందాముడూ, దేవేంద్రుడూకూడా బయలుదేరారు

తెల్లవార వస్తున్నది. పొదలలో ఇంకా మిణుగురులు మెరుస్తూనే ఉన్నాయి. చెట్ల మధ్యనుంచి ఒక పిశాచి పరిగెత్తుకుంటూ వచ్చి, చేతిలోని కత్తితో పూల్ సాహెబు గుండెల్లోకి బలంకొద్దీ పొడిచి, దాన్ని పీకి తన గుండెలో పొడుచుకుని నవ్వ నారంభించింది.

పూల్‌సాహెబు అక్కడ కూలిపోయాడు. అరిందముడూ, యోగీంద్రుడూ ఆమె చేతిలోని కత్తి లాగేశారు.

"మోహినీ, నన్ను ఉరికంబంనుంచి తప్పించి గొప్ప ఉపకారం చేశావు." అన్నాడు పూల్‌సాహెబు. అతను అరిందముణ్ణికూడా హెచ్చరిస్తూ, "నేను పోయినానని సంతోషించవద్దు. జుమీలియా బతికేఉంది. నిన్ను చంపటానికి ప్రతిజ్ఞ పట్టిఉన్నది. జాగ్రత్త !" అన్నాడు. తరవాత అతను ప్రాణాలు విడిచాడు. మోహిని కూడా చచ్చిపోయింది.

# 5

రేవతి సంగతి తేలకపోవటం చూసి దేవేంద్రుడు చిరాకుపడ్డాడు. ఆమెనూ, ఆమె తాలూకు ఆస్తినీకూడా కాపాడాలి. రేవతి పినతండ్రి మరో పూల్‌సాహెబు.

అరిందముడు దేవేంద్రుడితో, "రేవతి పినతండ్రి రేవతిని వెతికించటానికి మంచి డిటెక్టివును చూడమని నీతో అన్నాడు కదూ? నన్నాయన దగ్గిరికి తీసుకుపో. ఆ తరవాత నేనేం చేస్తానో నువ్వే చూతువుగాని," అన్నాడు.

"ఆయన తన అన్నకూతుళ్ళను చంపి ఆస్తి కాజెయ్యదలిచినవాడైతే డిటెక్టివును మాట్లాడమని నాతో ఎందుకంటాడూ?'' అన్నాడు దేవేంద్రుడు.

"ఇంకా చిన్నవాడివోయ్. ప్రపంచంలో ఎలాటి రకాలవాళ్ళున్నారో నీకేం తెలుసు?'' అన్నాడరిందముడు.

కాని రేవతి పినతండ్రి చాలా యోగ్యుడుగా కనిపించాడు. ఆయన ఫూల్‌సాహెబు చెప్పిన రాక్షసుడుగా దేవేంద్రుడూహించలేకపోయాడు.

ఆరోజే ఇద్దరూ వేణీమాధవపురానికి బయలుదేరి గోపాలచంద్రుడింటికి వెళ్ళారు. వాళ్ళు వచ్చిన సంగతి విని గోపాలచంద్రుడు లోపలినుంచి బయటి గదికి వచ్చి, మర్యాదగా కుశలప్రశ్నలు చేశాడు ఆయన వయసు యాభై దాటిఉంటుంది. తెల్లగా, లావుగా ఉంటాడు. తల నెరిసిపోయింది. మెడలో తులసిమాలలూ, చేతులకు పద్మబీజమాలలూ కట్టుకుని డబ్బుగల భక్తాగ్రేసరుడులాగా కనిపించాడు.

ఆయన అరిందముడితో, ''నా కొచ్చిన కష్టం దేవేంద్రుడు మీకు చెప్పే ఉంటాడు. మా రేవతమ్మ నన్ను నాన్నా అని పిలిచేది. రోహిణీతల్లి అస్తమానమూ నా దగ్గిరే ఉండేది. హరిహరీ! రాధాకృష్ణా!'' అన్నాడు.

''పెద్దకష్టమే మరి. అందుకే నన్ను పెట్టుకున్నారంటే శాయశక్తులా పని చేస్తాను," అన్నాడరిందముడు.

''అందుకే గదా మిమ్మల్ని పిలిపించింది!''

"అలా అయితే మీకు పనిచేసినందుకు ఇంత ఇస్తామని కాగితంముక్క రాసి ఇయ్యండి."

మళ్ళీ రాతకోతలుకూడా ఎందుకూ? నా పిల్లలు నాకు దక్కితేచాలు, ఉన్నదంతా ఇవ్వమన్నా సంతోషంగా ఇస్తాను''

''అదేం ఏర్పాటూ? ఇంత ఇస్తామని మీరు కరారుగా రాసి ఇవ్వందే నేను పని చెయ్యటానికి లేదు''

''సరే అయితే, ఎంత రాసి ఇమ్మంటారో మీరే అడగండి.''

"నూరురూపాయలిస్తారా?''

"నూరా? అయిదువందలిస్తాను"

"మీరు ఉదారులు. నేను ఉత్సాహంతో పనిచేస్తాను.''




అరిందముడు కోరినట్టుగా గోపాలచంద్రుడు కాగితంరాసి సంతకంచేసి ఇచ్చాడు.

"నేను వెంటనే పని ప్రారంభిస్తాను. ముందుగా మీ ఇల్లంతా చూడాలి," అన్నాడరిందముడు.

గోపాలచంద్రుడు కప్పెగిరిపోయేటట్టు నవ్వి, "ఇలా అయితే నాపని అయినట్టే? పిల్లలిద్దరూ ఇంతకాలమూ ఈ ఇంట్లోనే ఏమూలో దాక్కుని ఉన్నా రనుకుంటున్నారా ఏమిటి, కొంపదీసి?" అన్నాడు.

"ఇల్లు చూడటంచేత మీ కేమీ నష్టం లేదుగదా?"

"ఏమీలేదు. వ్యర్థప్రయత్నం దేనికని?"

"ఇంటిలో ఏం చూడనవసరం లేదు. ఇంటిచుట్టూ చూస్తే చాలు."

ఇంటివెనక ఒక చిన్న కొల నున్నది. దాని నాలుగు గట్లమీదా ఏవేవో చెట్లున్నై. వాటిచుట్టూ ప్రాకారం వున్నది. ముగ్గురూ అక్కడికి వెళ్లారు. అక్కడ రెండు మొక్కలు మిగిలినవాటికన్న బాగా పెరుగుతున్నట్టు కనబడ్డాయి.

"వాటిని మా రైతు పంపాడు. వాడి మేనమామ దొడ్లోవిట. ఇలా రండి. ఈ పక్కకూడా చూద్దురుగాని!" అన్నాడు గోపాలచంద్రుడు.

"ఉండండి. నేను చూడవలిసింది ఇక్కడే వున్నది," అంటూ అరిందముడు, గోపాలచంద్రుడు గోలపెడుతున్నా వినిపించుకోకుండా, ఆ రెండు మొక్కలనూ లాగేశాడు. అవి తేలికగానే వచ్చేశాయి.

"అదేంపనీ? చాలా వింత మనిషిలా గున్నారే?" అన్నాడు గోపాలచంద్రుడు.

''ఇప్పు డేమీ అనకండి. చూస్తూ వుండండి.'' అంటూ అరిందముడు మొక్క లుండినచోట తవ్వసాగాడు. గోపాలచంద్రుడి ముఖాన కత్తివేటు వేస్తే నెత్తురు చుక్క లేదు. అతను ఒక్కొక్క అడుగే వెనక్కు పోసాగాడు.

''పారిపోకండి. ఇదుగో రివాల్వరు. కదిలారంటే పేల్చేస్తాను,'' అన్నా డరిందముడు.

''నా కేం భయం ? నే నెందుకు పారిపోతాను ?'' అన్నాడు గోపాలచంద్రుడు.

అరిందముడు రివాల్వరును దేవేంద్రుడి కిచ్చి, పోత మట్టిని సుళువుగా తవ్వుతూ ఒక చెయ్యి పైకి తీశాడు. దాన్ని చూడగానే అరిందముడి ముఖం వికసించింది. దేవేంద్రు డదిరిపడ్డాడు. గోపాలచంద్రుడి తల గిర్రున తిరిగిపోయింది.

''ఇదేమిటి ? ఈ చెయ్యి ఇక్కడ ఎవరు పూడ్చారు ? రాధాకృష్ణా ! రాధా గోవిందా !'' అన్నా డాయన.

''నువ్వే పూడ్చావు. అంతలోనే మరిచావా ? పూల్‌సాహెబు రోహిణిని చంపి నట్టు నిదర్శనంగా నీకు పంపించిన చెయ్యేగా ?'' అన్నా డరిందముడు.

''అబద్ధం ! కల్పన !''

''ఎవ రబద్ధమాడుతున్నారో నీకూ తెలుసు, నాకూ తెలుసు.

అరిందముడు సంజ్ఞచెయ్యగానే దేవేంద్రుడు గోపాలచంద్రుడి చేతులకు సంకెళ్లు తగిలించాడు.

''నా తరపున పనిచెయ్యవచ్చి నాచేతికే సంకెళ్ళు వేస్తున్నారా ?'' అన్నాడు గోపాలచంద్రుడు.

''నే నెవరితరపువాణ్ణీకాను. పోలీసులతరపువాణ్ణి. అపరాధుల నిలా చెయ్యటం నాపని.''

''నే నపరాధి నని ఎలా నిరూపిస్తారు ?''

''ఇవిగో నిదర్శనాలు,'' అంటూ అరిందముడు తాను పూల్‌సాహెబు జేబులో నుంచి తీసిన ఉత్తరాలు చూపాడు. వాటిని చూసి గోపాలచంద్రు డదురుకున్నాడు.

''వాటి సంగతి నాకు తెలీదు,'' అన్నా డాయన.

అరిందముడు తన జేబులోఉన్న కాగితం తీసి ''దీనిమీద నువు చేసిన సంతకానికీ, దస్తూరికీ ఈ ఉత్తరాలలో ఉన్నవాటికీ తేడా ఏమైనా ఉందా ?'' అన్నాడు.

''మోసం, మోసం ! నువు పరమ దురాత్ముడివి !'' అన్నాడు గోపాలచంద్రుడు.

''అన్నకూతుళ్ళను హత్యచేయించే నీకన్న దుర్మార్గుణ్ణా ?''

అరిందముడు చూపిన ఉత్తరాలు మూడూ కేశవచంద్రుడికి గోపాలచంద్రవాసు రాసినవి. అవి ఇలా ఉన్నాయి :

1. ''కేశవబాబూ, రెండురోజులుగా నీ సమాచారం తెలియటంలేదు. రేవతీ రోహిణుల హత్యకోసం నేను చాలా తొందరపడుతున్నాను. వాళ్ళని చంపినట్టు నిదర్శనం నాచేతికి రాగానే నీ కివ్వవలసిం దంతా ఇచ్చేస్తాను ''




2. "కేశవబాబూ, గౌరచంద్రుడిమాటలు చూస్తే నీకు నాలో నమ్మకం లేనట్టుంది. ప్రస్తుతం నే నొక్క దమ్మిడీకూడా ఇయ్యలేను. ఇయ్యలేకపోవట మేమిటి. ఇయ్యను. నన్ను తృప్తిపరచు; నిన్ను తృప్తిపరుస్తాను. త్వరగా రేవతీ రోహిణులను చంపి, గౌరచంద్రుడిద్వారా నిదర్శనాలు పంపు. సమర్థతఉండి కూడా జాప్యం చేస్తున్నావు. నా కేమీ బాగాలేదు. వారంలోపల పని పూర్తిచేసి బహుమానం పొందుతా ననుకుంటున్నాను."

3. "కేశవబాబూ, ఇంతవరకు రేవతిని నువ్వేమీ చెయ్యలేదు. రోహిణి శవాన్ని గొప్పగా తాణాకు పంపించావు. రేవతి శవాన్ని అలా చెయ్యవద్దు. అందువల్ల కొంచెంకూడా లాభం లేదు; లేనిపోని చిక్కులు. రోహిణిని చంపినందుకు సగం డబ్బియ్యమన్నావు. నా పని సగం పూర్తి అయిఉంటే అలాగే ఇచ్చిఉందును. కాని అలాటి దేమీలేదు రోహిణి పోయినందువల్ల ఆస్తంతా రేవతి దయింది గాని, అందులో సగం నాకు రాదుగదా. రోహిణి చావు రేవతికి లాభం? నా కేం లాభం? రోహిణిని చంపినట్టు గుర్తుగా దానిచెయ్యి పంపావు. దానిమీద కాలిన మచ్చ ఉన్నది. గనక గుర్తించగలిగాను. రేవతిచెయ్యి పంపిస్తే నేను గుర్తించలేను. రేవతిని చంపినట్టు గుర్తుగా దాని తల పంపించు."

గోపాలచంద్రుడు చివరకు పట్టుబడి జైలుకు వెళ్ళాడు. వేణీమాధవపురం అట్టుడికిపోయింది.

అరిందముడు దేవేంద్రుణ్ణి రఘునాథపురంలోఉన్న తన ఇంటికి తీసుకుపోయాడు. ఆ ఊళ్ళోకెల్లా పెద్దమేడ అతనిదే. ఇంటివెనక పెద్ద తోట ఉన్నది. అందులో

ఒక కోనేరున్నది. దానిలో కలువలూ, చేపలూ ఉన్నాయి. అరిందముడికి అందులో చేపలు పట్టటం సరదా.

ఒకనాటి మధ్యాహ్నం అతను దేవేంద్రుడితో, "రెండు రోజులుగా నువ్వింటికి పోవాలని తహతహ లాడుతున్నావు. రేపు వెళుదువుగాని. ఇవాళ రాత్రి నీకు మంచి విందు చెయ్యాలి. అందుకు చేపలు కావాలి. నువ్వీ గాలం తీసుకుపోయి చేపలు పట్టుతూఉండు. నీ వెనకే నేనూ వస్తాను," అన్నాడు.

దేవేంద్రుడు చేపలు పట్టటానికి కావలసిన సరంజామా అంతా తీసుకుని కోనేటి వద్దకు వెళ్ళేసరికి, అక్కడ ఒక అందమైన యువతి కనబడింది. ఆమె అటుకేసి తిరిగి ఉండటంచేత అతనామెను గుర్తించక వెనక్కు తిరిగి, వెళ్ళిపోవటానికి ఉద్యమించాడు. అంతలోనే ఆమె అడుగులచప్పుడు విని వెనక్కు తిరిగిచూసింది.

ఆమెను చూడగానే దేవేంద్రుడు అద్భుతాశ్చర్యాలతో స్తంభించిపోయి, "నువ్వా? ఇక్కడున్నావా?" అన్నాడు.

అంతదాకా చెట్లచాటున అంతా చూస్తున్న అరిందముడు వారిని సమీపించాడు. ఆ యువతి సిగ్గుపడి వెళ్ళిపోయింది.

"పద, దేవేంద్రా. చేపలు సాయంకాలం పట్టవచ్చులే. ఈ వేళప్పుడు ఇక్కడికి ఆడవాళ్ళు వస్తారు." అన్నాడు అరిందముడు

"ఇప్పుడు వెళ్ళిన అమ్మాయి మీకు తెలుసా?" అని దేవేంద్రు డడిగాడు.

"మా ఇంటి ఆడవాళ్ళయితే తెలుస్తుందిగాని, ఇక్కడికి వచ్చే ఆడవాళ్ళందరు నాకెలా తెలుస్తారు?"

"ఆమె ముమ్మూర్తులా రేవతిలాగే ఉంది. ఉండటంకాదు, రేవతే!"

"పేరడిగావా ఏమిటి?"

"పేరడగక్కర్లేదు. నాకు బాగా తెలుసు. రేవతే "

"అవును, రేవతే. నేనీమెను అదివరకే కాపాడాను. రోహిణి హత్య గురించి రేవతికి చప్పున చెప్పయ్యకూడదు. గోపాలచంద్రుడి సంగతికూడా క్రమంగా తెలియపిద్దాం. రేవతికీ, నీకూ పెళ్ళిఅయేటప్పుడు నేను కన్యాదాతను కావచ్చా?"

"మీ దయ!"

అరిందముడు కంకణం కట్టుకుని పెళ్ళి ప్రయత్నాలు చేశాడు భవానీపురంనుంచి దేవేంద్రుడి తండ్రి వచ్చాడు. వేణీమాధవపురంలోనే రేవతి దేవేంద్రుల వివాహం వైభవంగా జరిగింది. కన్యాదాత అరిందముడు. పెళ్ళికి సిరాజుద్దీనూ, కుల్సమ్ వచ్చి వధూవరులకు రవ్వలఉంగరాలు చదివించారు.

గోపాలచంద్రుడికీ, పట్టుబడిన దొంగలకూ శిక్షలు పడ్డాయి. కాని ఎంత ప్రయత్నించినా జూమీలియా జాడ తెలియలేదు

---




నిద్రలో చప్పున మెలకువ వచ్చింది.

చుట్టూ చూచాను. చీకటి ... భయం వేస్తోంది "అమ్మా!" అని అమ్మను పిలుద్దా మనిపించింది. అమ్మయ్యో! ఇంకేమైనావుందా? నిద్ర పాడుచేశానని అమ్మ నాలుగు తంతుంది. "ఏమిట్రా వెధవా, గొడవ?" అంటూ నాన్నకూడా నన్నే కొడతారు. ప్చ! ఎందు కొచ్చిన గొడవ? కాస్సేపు ఆంజనేయస్వామిని తల్చుకుంటే భయం అదే పోతుందని నిన్న పక్కింటి పిన్నిగారు వాళ్ళబ్బాయికి చెబుతుంటే విన్నాను. అదే మంచిపని

కాకున్నా, అమ్మకూ నాన్నకూ నేనంటే ఎందుకో అంతకోపం? ఎందుకేమిటి? నేను నల్లగా ఉన్నానట. నా

పళ్లు ఎత్తుగా అసహ్యంగా వున్నాయట. నాకు మెల్లకన్నట. కోతిలా వుంటానట.

అమ్మ స్నేహితురాలొకావిడ వుంది. పేరు సావిత్రట. ఉట్టి చుప్పనాతి. లేకుంటే ఆవిడ కెందుకో నావూసు! నే నెలావుంటే తనకేం? మా ఇంటి కొచ్చి నప్పుడల్లా పనిగట్టుక అడుగుతుంది; "ఏమోయ్ కల్యాణీ! నువ్వు తెల్లగా చక్కగా వుంటావు. మీవారూ అందంగా హుందాగా వుంటారు. మీ సీనుగా దేవి టింత అసహ్యంగా వుంటాడూ?" అంటుం దమ్మతో, చెవులకు చేటల్లా వేలాడుతున్న అలోలక్కులు వూగులాడిస్తూ, సడినెత్తిన శిగతో తల తెగతిప్పుతూ!

తన కొడుకేమో అక్కడికి మహా బాగున్నట్లు! తెల్లగా పిండిబొమ్మల్లే, దొప్పచెవులూ, చట్టిముక్కు. పిల్లి కళ్ళు, బట్టతలా వాడూను...నేనే అమ్మ నయితే ఆమాటే అడిగేద్దును. కాని అమ్మ అలా అనదే?

"ఏమో సావిత్రీ! ఈ కోతివెధవకు ఎవరి పోలి కొచ్చిందో అర్ధంగావటం లేదు. మా పుట్టింటివేపుగానీ, మెట్టినింటి వేపుగాని ఇంత అనాకారపుజీవు లెవ్వరూ లేరు. వీడు పురిట్లో వుండగానే, వీడికి వాంతులు పుట్టాయి; పీడా వదిలిపోతుం దనుకున్నాను. ఊహుం, రా యి లా వున్నాడు" అంటుం దమ్మ!

అన్నయ్య తెల్లగావుంటాడు; చెల్లాయి అందంగా వుంటుందట. వా ళ్ళిద్దరిలా నేను లేనని అమ్మకూ, నాన్నకూ ఇద్దరికీ కోపమే!

"వీడు నా కొడుకవినలుగురితో ఎలా చెప్పుకోను కల్యాణీ?" అంటారు నాన్న నావేపు చిరాకుగా చూస్తూ!

ఒకసారేం జరిగిందో తెలుసా?

అన్నయ్య పెన్ను బల్లమీద పెట్టి స్నానాని కెళ్లాడు. వాడికి మహాబడాయి. తనే మహాగొప్పగా హైస్కూల్లో ఫష్టు ఫారమ్ చదువుతున్నట్టూ, చాలా తెలివి గలవా డయినట్టూను. దానికితోడు అమ్మ నాన్నలుకూడా వాణ్ణి నెత్తి నెక్కించు కుంటారు!

"బంగారునాయనకు చదు వెక్కువయింది. స్కూలు దూర మయింది. అంతదూరం వెళ్ళొచ్చేసరికి అలసిపోతు న్నాడు రిక్షాఒకటి మాట్లాడుదామండీ!" అంది అమ్మ నాన్నతో.

"వెరీగుడ్ అల్లాగే!" అన్నారునాన్న.

మరైతే బడీ మైలుదూర ముంది. నాలుగోక్లా సయితేమాత్రం నాకూ కాళ్ళ నెప్పెట్టడములేదూ? నేనూ అడిగేశాను.

"నాక్కూడా రిక్షా కావాలి" అని.

"కోతివెధవ! నీ కదొక్కటే తక్కువ. బడికి వెళ్ళ కుదురుగా..." అమ్మ ఉరిమి చూచింది.

"కుళ్ళువెధవ, పక్కవాళ్ళ కేదివుంటే, తనకూ అదేకావాలనేతత్వం..." నాన్న చిరాకు చూస్తుంటే, కొడతారేమో నని భయమేసి లోపలికి పరుగెత్తాను.

నేను కోతివెధవనూ, కుళ్ళువెధవ నూనా ? అన్నయ్య బంగారునాయనా ? అన్నయ్య స్కూలు అరమైలైతే రిక్షా కావాలా ? నాబడి మైలుదూర ముంటే, నేను నడిచే వెళ్ళాలా ?

అరె ! ఇదేమిటి ? పెన్ సంగతి చెబుతూ. మరేదో వాగేస్తున్నాను ! ఆఁ ! అన్నయ్య పెన్నక్కడ పెట్టివెళ్ళాడా ? నే నీమధ్య ఇంగ్లీషు నేర్చుకుంటున్నాను కదూ ? అందుకని ఇంగ్లీషులో నా పేరు పుస్తకంమీద వ్రాసుకుందా మనిపించింది. ఎప్పు డొచ్చాడో అన్నయ్య "ఒరేయ్ శీనుగా ! నా పెన్నెందుకురా తీశావ్ ?" అన్నాడు ఇల్లెగిరిపోయేలా.

"ఏమోయ్ తీస్తే ? కాస్త నా పేరు రాసుకుని ఇచ్చేస్తాలేరా !" అంటున్నానో లేదో, వీపుమీద ఛెళ్ళున కొట్టాడు నా చేతిలో పెన్ను కాస్తా దూరానపోయిపడింది.

"అమ్మోయ్ ! నాన్నోయ్ ! నా పెన్ను ముక్క విరగ్గొట్టేశా డీ శీను గాడు !" అన్నయ్య కేకలకు అమ్మా, నాన్నా ఇద్దరూ పరుగెత్తుకొచ్చారు.

"గాడిదా ! వాడి పెన్నుతో నీ కేం పనొచ్చిందీ ? అన్నీ కోతిపనులే !" నా చెవులు ఊడొచ్చేలా మెలితిప్పేశాడు నాన్న. పెద్దగా ఏశ్చాను నొప్పితో !

"అదుగో చేసే పని చేసేసి మళ్ళీ ఏడుస్తాడు కూటివెధవ. "అమ్మ నా నెత్తి చిల్లులుపడేలా మొట్టికాయలేస్తోంది.




"ఇం కెప్పుడూ నా పెన్ను తాకవు కదూ ?" అన్నయ్య అడుస్తున్నాడు.

"తియ్యనురా !" ఏడుస్తూ చెప్పాను. తలా, చెవ్వూ నొప్పెడుతున్నాయి.

"ఛాల్లే వెధవఏడుపూ నువ్వూ. ఫో అవతలికి !" నాన్న వెళ్ళిపోయారు.

"నీ పెన్నుకు వేరే ముక్క వేయి స్తారులే, నాన్నా ఏడవకు." అమ్మ అన్నయ్యాను బుజ్జగిస్తోంది.

తమాషాగా లేమా? ఇన్ని దెబ్బలు తిని నేను ఏడవకూడదు. పెన్ను తాకితేనే నా కన్నిదెబ్బలు! ఊరికే ఏడుస్తున్న అన్నయ్యను బుజ్జగిస్తున్నది అమ్మ అసలు అమ్మకూ నాన్నకూ పక్షపాతం. ఎన్ని తప్పులు అన్నయ్య చేసినా ఊరుకుంటారు. చెల్లాయి చేసినా పట్టించుకోరు. పైగా ఒక్కోసారి వాళ్ళిద్దరి తప్పులకూ నన్ను తంతారుకూడా. అందుకే చెల్లాయి కూడా నేనంటే అలుసే! అది ఆటకు రమ్మంటే వెళ్లాలి; వద్దంటే ఊరుకోవాలి. లేకుంటే "అమ్మ, నాన్నలకు చెబ్తారోయ్!" అంటుంది.

"చిన్న పిల్లని ఏడిపిస్తున్నావా?" అని నా ఒళ్లు విరగ్గొడతారు వాళ్ళు. అందుకని చచ్చినట్లు వింటాను.

అమ్మకు నేనొక్కణ్ణి బరువయ్యానుట అందుకని అమ్మమ్మగారి వూరు పంపించింది నన్ను. వాళ్ళూ అంతే. పిన్నీ, మామయ్యా, అమ్మమ్మా, అత్తయ్యా అందరూ నన్ను కొట్టడమే. అసలు 'శీను' అనే పేరు పోయి కోతి వెధవా, కొండముచ్చు వెధవా అనే పేర్లే స్థిరపడిపోయాయి. పిన్ని పిల్లలూ, మామయ్య పిల్లలూ అందంగా వుంటారుట...అందరూ కలసి నన్నే వెక్కిరిస్తారు. ఏ పిల్లలు తప్పు చేసినా నన్నే కొడతారు. అదేమంటే "ఇందుకేరా వెధవా! నిన్ను మీ అమ్మ ఇక్కడికి నెట్టేంది!" అంటారు. నాలుగునెలలు తిరక్కముందే మళ్ళీ పంపించేశారు అమ్మమ్మా వాళ్లూ నన్ను

ఇక అమ్మ నాన్నలకు మళ్ళీ నన్ను గురించి సమస్య తయారైందిట. అదేదో అనాధ పిల్లల శరణాలయమట అందులో నన్ను చేర్చా లనుకున్నారు ఒకరోజు...అమ్మ స్నేహితురా లెవరో ఒకావిడ...పేరు పార్వతట–ఆ శరణాలయంలో వుంటే. ఆవిడతో మాట్లాడాలని చెప్పి పంపింది అమ్మ. సాయంత్రం ఆవిడే వచ్చింది.

"ప్రతి ఒక్కరూ ఈ వెధవను చూచి 'ఇలాటి కురూపి ఎలా పుట్టా డని' అడుగుతూంటే, తల కొట్టేసుకోవా లనిపిస్తోంది. "పార్వతీ! నువ్వెలాగూ చిల్డ్రెన్స్ వార్డ్ లోనే వుంటావుగా... వీణ్ణి అక్కడే పారేస్తాం...మీ శరణాలయం కోరినంతడబ్బూ చెల్లిస్తాం..." అమ్మ అలా చెప్పిందో లేదో పార్వతి అడ్డొచ్చింది.

"కళ్యాణీ! తల్లిగా నీ వనవలసిన మాటేనా ఇది? తలిదండ్రు లిద్దరూ బ్రతికుండి, ధర్మబద్ధంగా మీ ఇద్దరికీ జన్మించిన మీ బిడ్డను...రూపం తక్కువని... అనాధ శిశు శరణాలయంలో పారేస్తారా? ఏ జన్మలో చేసిన పాపంవల్లో, నిశ్చింతగా తల్లిదండ్రుల వడిలో తలదాచుకోవలసిన బిడ్డలు, ఆ అనురాగానికి దూరమై, మా సంస్థలో పనిమనుషులు మొదలు కొని, మేనేజరువరకూ అందరిచేతా.

దెబ్బలూ, బహుమతులూ, జవాబ్చేవాళ్లూ బ్రతుకుతున్నారు. ఆ ఘోష చూశాక నేనూ త్వరలోనే రాజీనామా ఇచ్చేద్దా మనుకుంటున్నాను. అలాటిది ఆ నరకం లోకి వీణ్ణి తోస్తావా?" అన్నది పార్వతి.

అమ్మ కోపం వచ్చింది.

"చాల్లేవే మహాచెప్పొచ్చావ్ నీతులు. నీకే ఇలాటి పిల్లాడు వుండివుంటే తెలిసేది..." అంది.

"ఇలాటి కురూపేకాదు. అవయవ లోపా లున్న అవిటివాడేనా సరే. నేను ద్వేషించను. మనమే జన్మ ఇచ్చిన మన బిడ్డే మనకు కంటకమూ బరువూ అయితే. ప్రపంచాని కంతటికీ వాడు బరువే అవు తాడు..." అన్నది పార్వతి.

"కురూపే కాదు పార్వతీ...కుళ్ళు గూడాను వీడికి..."

"కల్యాణీ! పసిపిల్లల హృదయాలు గులాబి పూలకంటే సున్నితమైనవి... మిగతా బిడ్డల్నొకమాదిరిగా, వీణ్ణొక రకంగా చూస్తారు. మీ దంపతులు... కాదనకు. లేకుంటే ఏ విషయంలో నయినా ఆ పిల్లలిద్దరూ నీకు భారంగా తోచలేదేం? మీ ప్రవర్తనవల్లే వాడిలో మార్పు తెచ్చింది. లోలోపలే కుమిలి కుమిలి వాడికి మీమీదే కాకుండా, వాడి అన్న, చెల్లెలిమీదకూడా ద్వేషం ఏర్పడి వుండొచ్చు...అది వాడి తప్పు కాదు..."

పార్వతమ్మ వెళ్ళిపోయింది...కానీ అమ్మ కావిడ మాటలు నచ్చలేదల్లేవుంది; "పనిగట్టుక వచ్చింది నాకు బోధించటాని గ్గాబోలు..." అని చిరాకుపడిందికూడా.

అన్నీ వింటూంటే, చూస్తూంటే... ఎదురింట తాతయ్యగా రొకసారి వాళ్ళ మనవడికి కథ చెబుతుంటే విన్నాను... అది జ్ఞాపకం వస్తోంది ఆ కథేమిటంటే పూర్వం ఒక ముని యాగం చేస్తూ, బలి కోసం ఎవరినైనా బ్రహ్మచారిని పట్టుకు రమ్మని శిష్యులను పంపించాడట (అప్పుడు మనుష్యుల్ని యాగాలలో బలి ఇచ్చేవారటలే) అడవి మార్గాన ఒక బ్రాహ్మణ దంపతులు తమ ముగ్గురు కొడుకులతో వస్తూండటం శిష్యులు చూచారు. చాలా డబ్బు ఇస్తా మనేసరికి ఆ దంపతులు, ఆశపడి, ఒక బిడ్డను బలికి ఇవ్వటానికి ఒప్పుకున్నారు. "నాకు పెద్దవాడంటే వల్లమాలిన ప్రేమ; వాణ్ణి ఇవ్వను" అన్నాడు తండ్రి. "చిన్న పిల్లవాడు లేంది నేను బ్రతకలేను." అన్నది తల్లి. ఇద్దరూ కలిసి మధ్యవా డయిన రెండవవాణ్ణి (వాడి పేరేమిటీ? ఆ! గుర్తొచ్చింది-శునస్సేపుడు) బలికి తీసికెళ్ళమని ఇచ్చారట...

అలా వుంది నా కథా!

నేను అమ్మకు పనికిరాను. నాన్నకు పనికిరాను. ఇద్దరూ నన్ను అసహ్యించు కుంటారు. కొడతారు, తిడతారు. అది చూచి అందరూ నన్ను వెక్కిరిస్తారు.

మా అమ్మా, నాన్నా ఇలాగు అంటే మీరు నమ్మటంలేదుకదూ?

నే చెప్పేదంతా నిజం. మీరు నమ్మండి మానండి. నిజంగా నిజం.

అయితే ఎవరికీ పనికిరాని నేను ఇలా ఏడవ్వాల్సిందేనా? అందరిచేతా దెబ్బలు తినాల్సిందేనా?

నేను నల్లగా, నా పళ్ళు ఎత్తుగా, నా కళ్ళు మెల్లగా, నేను అసహ్యంగా వుండటం నా తప్పా? మీరే చెప్పండి!

# 'లియారూ, శాంతిదేవి

సింగవేలు మొదలియారు చాలా మంచివాడు. దైవభక్తీ, పెద్దమీసాలూ, సమృద్ధిగా ఉన్న వాడు. మదరాసులో ట్రాములు బతికున్నరోజుల్లో రాయపేటలో కాలేజీ విద్యార్థులకోసం వసతి గృహాన్ని నడిపేవాడు. ఆ లాడ్జి ఎప్పుడూ కన్నులపండువుగా ఉండేది, వెనకటి వైకుంఠంలాగ. అవిభక్త మదరాసు రాష్ట్రపు వైవిధ్య మంతా అక్కడ ప్రతి ఫలించేది. కేకలూ, ఈలలూ, ఊళలూ, చప్పట్లూ వేస్తూ శ్రద్ధగా చదువుకునేవాళ్ళనూ చదువుకోని వాళ్ళనూకూడా అసలు చదువు కోకుండాచేసి విద్యపై యుద్ధాన్ని ప్రకటించిన వీరాధివీరులు ఎందరో ఉండేవారు. ఉదయాలు భక్తి గీతాలూ, మధ్యాహ్నాలు అనంత శయనాలూ, సాయంకాలాలు ఏక పాత్రాభినయాలూ, రాత్రిళ్లు చక్ర భ్రమణాలూ—ఇదీ అక్కడ వరస.

ఆ లాడ్జిలోనే ఓ గదిలో సింగవేలు మొదలియారు ఉండేవాడు. కుర్రాళ్ళ అల్లరి చూసీ చూడనట్లు అభివాస్తవిక మొహంపెట్టి అందరికీ తల్లో నాలికమల్లే ఉండేవాడు (బుగ్గలో నాలికతనం కాదు). ఇలా ఉంటూాంటూాంటూాండగా ఒక దుర్ముహూర్తాన మొదలియారుకు జబ్బుచేసింది. డాక్టర్ వచ్చి విశ్రాంతి కావాలనీ, ఏదైనా పల్లెటూళ్ళో ఓ ఆరు వారాలు ఉండడం మంచి దనీ అన్నాడు. మొదలియార్ని ఎంతో బలవంతం చేస్తే చివరకు "గాకారం" అనే చిన్నపల్లెలో ఉన్న మేనల్లుడింటికి వెళ్లాడు.

'లియారు వెళ్ళేముందు మే మంతా ఎన్నో వాగ్దానాలు

---

*గోపాల చక్రవర్తి*

---

చేసాం. చెలియలికట్ట దాటమనీ, గోడలు దూకమనీ, రోజూ ప్రొద్దున్న లేవగానే 'లియారి పేరు అరచేతిలో రాసుకుని మిగతా పనులు చేస్తా మనీ ఎట్ సెటరా. 'లియారు మా భక్తికి సంతోషించి టాక్సీ ఎక్కాడు. మొదలియార్ వెళ్ళాక మా లాడ్జిలో తొలిసారిగా చీరలు అక్కడక్కడ కన్పించాయని కిట్టనివాళ్లు అన్నారు. కాని నేను త్వరగా పడుకుని ఆలస్యంగా లేచే అలవాటు వున్నవాణ్ణవడంచేత ఈ సంగతి నాకు తెలియదు. రెండు రోజులు గడిచాయో లేదో, ఓ ప్రభాతవేళ మొదలియారు ఊడిపడ్డాడు గాలి పడగలా. అంతా ఆయన చుట్టూ గుమిగూడి "అప్పుడే వొచ్చాశా రేం" అన్నాం గద్గదికంగా. మొదలియారు శాక్యసింహుడిలా ("భారతి" రెవ్యూయర్ కాదు) మొహంపెట్టి అన్నాడు. "ఆ పల్లెటూళ్ళో శబ్దాలు భరించలేను. పిట్టల అరుపులూ, ఆవుల అంబాలూ ఎంతసేపని వినగలను? మన పట్టణాల్లో వుండే ప్రశాంత వాతావరణం అక్కడ ఉండదు." మేం కాదనలేదు. పోర్టికోలోకి వచ్చి కిందకు చూశాం. ట్రాములూ, బస్సులూ, టాక్సీలూ పరిగెడుతున్నాయి. పక్క గదిలో టెలిఫోను మోగుతోంది. మేడకింద కొళాయిలో నీళ్లు బకెట్‌లో పడుతున్నాయి. "ఆహా! నగరజీవితంలో ఎంత ప్రశాంతి" అనుకున్నాం.

*నీతి : కొందరికి పట్టణాలే బాగుంటాయి.*






జ రి గి న క థ

[పాతశాలరోజుల్లో ఉన్న భేదాభిప్రాయాలూ, ఈర్ష్యలూపోయి స్నేహానుబంధం ఏర్పడింది కిశోర్ శంకరులకు. కాని పరిస్థితుల కారణంగా దూరమయిపోయిన వారు మళ్ళీ కలకత్తాలో కిశోర్ 'మెడిసన్' శంకర్ 'లా' చదువుతూవుండగా కలిశారు. ఏదో ఆప్యాయతా — ఎంతో దగ్గరైనట్లుగా అనుభూతి పొందారు.

శంకర్ చెల్లెలు ప్రమీలను సుకుమార్ తన చెల్లెలైన నీహారిక కోరికపై వివాహ మాడాడు. శంకర్ తనచెల్లెలిని చూడటానికి సుకుమార్ యింటికి కిశోర్‌ను తీసుకు వెళ్ళాడు. అక్కడ కిశోర్ నీహారికను చూశాడు. నీహారిక స్త్రీల స్వాతంత్ర్యం, హక్కులుపై కొన్నివ్యాసాలు వ్రాసింది. ప్రచురింపబడిన ఈ వ్యాసాలు చూచి 'దివాకరశర్మ' అనేపేరుతో కిశోర్ వాటిపై విమర్శలు ప్రచురించాడు. ఈ విమర్శ లకు ప్రతి విమర్శలు 'మేఘబాల' అనే పేరుతో నీహారిక పంపింది. త్వరలో ఈ విషయమంతా తెలివిడి అయింది. కిశోర్ నీహారికలమధ్య గౌరవానురాగా లేర్పడినై.

నీహారికతల్లికి సుస్తిచేసింది. కిశోర్ తనకు చేతనైనంతవరకు కృషి చేశాడు, ఆమెకు ఆరోగ్యం చేకూర్చటానికి. వృధా అయింది.

ఈ సందర్భంలో కిశోర్ నీహారికలు ఒకరినొకరు బాగా అర్థం చేసుకున్నారు తల్లి చనిపోతూ తన అభిప్రాయం వారిద్దరికీ వివాహం జరపడమేనని తెలిపింది. ఈ విషయమంతా తెలిసిన శంకర్‌మాత్రం క్రుంగిపోయాడు ఈర్ష్యతో.]

— ఇక చదవండి

"ఎందుకా వినయం? అప్పు నీకేగా ఒప్పగించిపోయింది. ఇంకా పెళ్ళి కాకపోతే మాత్రమేం?"

"అసలామె పెళ్ళి చేసుకుంటుం దనే నమ్మకంమాత్ర మేమిటి?"

"అయితే అడగమంటావా?"

"వద్దు, సుకుమార్! ఇప్పుడా సంగతి తీసుకురావటం మంచిదికాదు. అంత తొందరేముంది? నే నిప్పుడే హాయిగా వున్నాను."

"మరి ఇప్పుడీ ప్రమాదం ఎట్లా?"

"చూద్దాం, ఎంతదూరం పోతుందో? ఈ సంఘాలూ, సమితులూ ఈ రుతువులో పుడతై, ఇంకో రుతువులో పోతై. వీటిని కదిలించినకొద్దీ పెంచేగాని లాభ ముండదని నా నమ్మకం."

"ఐతే నువ్వు అప్పుడప్పుడూ వస్తూండు. బొత్తిగా వదిలూరుకోడం బాగా లేదు."

సుకుమార్ వెళ్ళిపోయాడు. "నే నిప్పుడే హాయిగా ఉన్నా" ననేమాట నన్ను వెంటాడసాగింది. నిజంగా నేను హాయిగా ఉన్నానా? నాకు మనశ్శాంతి ఉందా?

ఇలా కొన్నాళ్ళు గడిచింది. ఒకనాటి సాయంత్రం శంకర్ వచ్చాడు. ఇదివరకు శంకర్‌ను చూడాలని నా మనసెంతో ఆందోళనపడేది. ఇప్పు డతను కనపడితే నా మనసులో ఏదో చెప్పలేని సందేహం కలుగుతుంది. కాలం మారటంవల్ల మానసిక పరిస్థితికూడా ఎంత మారుతుంది!

"ఏమిరా కిశోర్! నువ్వు సుకుమార్ ఇంటికి వెళ్ళటం లేదట, ఎందుకూ?" అన్నాడు శంకర్.

"నువ్వు వెళ్ళావా?"

"నే నిప్పుడు అక్కడినించే వస్తున్నాను. నీకొక కొత్తసమాచారంచెప్పాలి."

"నీరూదేవి పెళ్ళిసంగతా?" అని అడిగాను నేను.

"కాదురా, ఆమె పెళ్ళి చేసుకోదనే సంగతి"

"మంచిదేగా. నీ కివాళ్ళ చెప్పిందా ఏమిటి? బహుశా నువ్వే పెళ్ళి ప్రస్తావన తెచ్చిఉంటా వనుకుంటాను?"

శంకర్ నవ్వి — "నాకంత ధైర్యంలేదు .... ఎందుకురా నీ ముఖ మంత మాడిపోయింది? అయితే అంతా చెప్తూతా నుండు," అని జేబులోనించి కాగితం తీసి చదవసాగాడు. దాని సారం యిది.

బేథూన్ కాలేజి పిల్లలు 'నారీ అభ్యుదయసమితి' అని ఓ సంఘం పెట్టారట. నీరూదేవి దానికి సెక్రెటరీ అట. ఇవ్వాళ ఆ సమితి నియమాలు నిర్ణయించా

రట. శంకర్ ఆమెకు ఛాంపియన్ కాబట్టి ఆ కాగితాలు యివ్వటమే కాకుండా, అచ్చువేస్తే ఎంత అవుతుందో కనుక్కునికూడా రమ్మన్నదట. ఈ సమితిలో సభ్యత్వం సంపాయించాలంటే ఈ క్రింది ప్రతిజ్ఞాపత్రంమీద సంతకం చేయాలట :—

(1) నేను స్త్రీజాతి ఉద్ధరణ నా జీవితలక్ష్యంగా తీసుకొంటున్నాను.

(2) స్త్రీజాతికి మానవమాత్రుల కున్న హక్కు లన్నీ ఉన్నవని ఒప్పుకుంటున్నాను.

(3) నేను నా వ్యక్తిత్వాన్ని చంపుకుని ఏ పురుషుని అధీనతను ఒప్పుకోను.

(4) నేను సాధ్యమైనంతవరకు స్వయంపోషకంగా ఉంటాను.

(5) నేను సాధ్యమైనంతవరకు దేశహితానికై పాటుపడతాను.

ఇవి విని నేను—"శంకర్‌దా! నారీఅభ్యుదయసమితి ప్రతిజ్ఞాపత్రం విన్నాను. కాని ఇందులో స్త్రీ పెళ్ళి చేసుకోకూడదని ఎక్కడా లేదే!" అని అన్నాను.

"స్పష్టంగా అలాంటిది లేదనుకో — పురుషుల అధీనత ఒప్పుకోమని ఉందిగా; దాని అర్థమే పెళ్ళి చేసుకోమని."

అయితే. పురుషులు స్త్రీలను తమ అధీనం చేసుకోకుండా నెత్తిమీద పెట్టుకుంటా మని ప్రతిజ్ఞ చేస్తే పెళ్ళి చేసుకుంటారా?" అని అడిగాను.

"ఇలాంటి ప్రతిజ్ఞలు చాలామంది చాలాసార్లు చేశారు. కాని ఆ ప్రకారం నడుచుకున్నది ఎవరూ?" అన్నాడు శంకర్.

"అయితే దీనవల్ల ఒక్క పురుషులకే వచ్చిన నష్ట మేముంది? స్త్రీలు బ్రహ్మచారిణులుగా ఉంటే పురుషులూ బ్రహ్మచారులుగా ఉంటారు. సరే, శంకర్! నువ్వు వాళ్ళ ఛాంపియన్‌వికదా, పెళ్ళి చేసుకోకుండా ఉంటావా?" అని అడిగాను.

శంకర్ నవ్వి—"నా కిప్పుడే ఇంటిలోనించి పెళ్ళి చేసుకోమని వారంట్లు వస్తున్నై. సరే వస్తాను. రేపు మళ్ళీ ఇవి తీసుకురావాలి" అని వెళ్ళాడు.

శంకర్‌కూ నీరజకూ ఉన్న స్నేహాన్నిబట్టీ, ఇంట్లో తొందరపెడుతున్నా శంకర్ పెళ్ళి చేసుకోకుండా ఉండటాన్నిబట్టీ, శంకర్ నీరజను ప్రేమిస్తున్నాడని నిర్ణయించుకున్నాను. కాని నీరజ అతన్ని పెళ్ళి చేసుకుంటుందా? ఆమె 'నారీ అభ్యుదయసమితి' కి సెక్రటరీ కావటం ఒకవిధంగా సూచించేదే అయింది. ఆ హోదాలో ఉంటూ ఆమె అంత త్వరలో వివాహం చేసుకోలేదు. అయినా ఇందువల్ల నా కొచ్చిన లాభ మేముంది? అయితే నే నింతకాలం ఎండమావుల

పంకే పరుగెడుతున్నానా ? ఇప్పుడు నే నింత నిర్లిప్తంగా దూరాన ఉండటం మంచిది కాదు. సుకుమార్ చెప్పింది నిజం...అప్పుడప్పుడూ పోయి చూసి రావటం అవుసరం.

ఈ మధ్య ఇంకో విషమసమస్య వచ్చింది. భారత రాజకీయరంగం చాలా కల్లోలితంగా ఉంది. హఠాత్తుగా మహాత్మాగాంధీ సత్యాగ్రహోద్యమం తల పెట్టాడు. దేశంలో ఎంతోమంది యువతీయువకులు ఉప్పు చేసి, విదేశ వస్తువులు పికెటింగు చేసి జైళ్ళకు వెళ్ళుతున్నారు పెద్ద కుటుంబాలకు చెందిన ఘోషా స్త్రీలుకూడా త్రివర్ణ పతకాలు చేత పట్టుకుని విదేశవస్త్రాల దుకాణాలూ, సారాయీ నల్లమందూ కొట్లు పికెటింగ్ చేస్తున్నారు.

నే నీమధ్య ఒకనాడు సుకుమార్ ఇంటికి వెళ్లాను. సుకుమార్ లేడు. తైత్రజరీగదిలో కూచున్నాను. నీరూదేవి ప్రమీలతోపాటు నా దగ్గరికి వచ్చింది. నన్ను చూసి..."ఇప్పుడేనా రావటం—బాగున్నారా ?"అని అడిగింది.

నేను 'ఆఁ' అని తల ఆడించాను.

"మీకు దేశంలో జరిగే సంగతు లేమైనా తెలుస్తున్నాయా ? లేక మెస్సూ, కాలేజీయేనా ?" అని అడిగింది

నేను నవ్వి ..."మెస్సూ కాలేజీయేకాదు, దేశం సంగతులనుకూడా తెలుసుకుంటున్నాను !" అన్నాను.

"ఇదివరకు గాంధిగారు ప్రభుత్వంతో 'సహాయ నిరాకరణోద్యమం' చేశారు. ఇప్పుడు సత్యాగ్రహం ప్రారంభించారు. దీనికి విద్యార్థుల కర్తవ్య మేమిటో ఆలోచించారా ?" అని అడిగింది.

"ఊహుఁ, నే నీ విషయమై ఇంకా ఆలోచించ లేదు."

ఈ సమయంలో ప్రమీల అన్నది:...."కిశోర్ దాదా ! వదినె ఈ మధ్య 'నారీ అభ్యుదయసమితి' అని పెట్టింది. ఆమె సెక్రటరీకూడా."

"వే నా సంగతి విన్నాను."

"మీరు స్త్రీ అభ్యుదయానికి విరోధులుగా. బహుశా ఈ మాటు తీవ్రంగా విమర్శిస్తూ ఒక వ్యాసం రాస్తా రనుకుంటాను," అన్నది నీరూదేవి.

"ఇంకా మీరు నన్ను మీ శత్రువుగానే ఎంచుతున్నారా ?"

నీరూదేవి నవ్వి...."ఎందుకు ఎంచను? పులి ఎక్కడైనా తన వొంటిమీది మచ్చలు మార్చుకోగలదా ?" అన్నది.

సుకుమార్ ఎక్కడినించో వచ్చి.... "పులి వొంటిమీది మచ్చలు మార్చుకోకపోయినా పెంచేవాళ్ళకు మాలిమి కావచ్చుగా?" అన్నాడు.

నీరూదేవి అన్నది: ..."నేను ఇంతకుముందు అడిగిన ప్రశ్నకు జవాబేమిటి? మహాత్ముని పిలుపుకు దేశమంతా జవాబిస్తూ ఉంటే మన యువతీయువకులు విలాసాల్లో మునిగి తేలటమా? మా నారీ అభ్యుదయసమితి ఒక నిర్ణయానికి వచ్చింది."

"అంటే మీ నారీవాహిని జండాలు పుచ్చుకుని బయలుదేరిందంటే ఇంగ్లిష్ సైన్యాలు భయపడి దేశం వదిలి పారిపోతాయన్నమాట." అన్నాడు సుకుమారుడు.

నీరూదేవి కొంచం కోపంతో అన్న వైపు చూసి, "నువ్వూరుకో అన్నాయి. నీదంతా ఎగతాళి!.......ఏం, మేము పికెటింగు చేస్తాము దుకాణాలదగ్గర. మీరు పిరికివాళ్ళు; పోలీసుల్ని చూస్తే భయం. మేము జైళ్ళకు పోవటమే కాదు; అవసరమైతే ప్రాణాలుకూడా వదులుకుంటాము." అన్నది.

నీరూదేవి కళ్ళలో నిప్పులు కనిపించినై. నేను స్తంభించిపోయాను. నాలో ఉద్రేకం కలిగింది. కాని సుకుమార్ వెటకారం వదలలేదు.

"మీ సైన్యం ఎప్పుడు బయలుదేరుతుంది? నేను మీ కేమీ సహాయ పడలేకపోయినా తమాషా చూట్టానికైనా మీ వెంట వస్తాను." అన్నాడు.

నీరూదేవి నావంక చూసి — "మీరుకూడా ఈ తమాషా చూసే గుంపులోనే చేర్తారా?" అన్నది.

నేను గంభీరంగా — "నేనింకా నా కర్తవ్యం నిర్ణయించుకోలేదు. ఆలోచించి చెప్తాను." అని సెలవుతీసుకుని వచ్చేశాను.

3

మర్నాడు సాయంత్రం నేను మెడికల్ కాలేజి డ్యూటీకి పోతున్నాను. గోల్ దీఘిదగ్గర చాలామంది పోలీసులు ఉన్నారు. ఇంకొంచెం ముందుకు పోతే యువతులు జండాలు పుచ్చుకుని దుకాణాలదగ్గర పికెటింగ్ చేస్తున్నారు. పోలీసులు వాళ్ళకోసమే నన్నమాట! ఒక సారాదుకాణందగ్గర మరీ ఎక్కువగా ఉంది గుంపు. నేనూ కుతూహలంతో ఆ గుంపులో కలిశాను. ఆ స్త్రీల జట్టుకు నీరూదేవి నాయకత్వం వహించింది. కాని నన్నామె చూడలేదు. పెద్దమనిషిలాగా ఉన్న ఒకాయన దుకాణంలోకి పోబోతున్నాడు. నీరూదేవి చేతులు

బోధించి చెప్పుతున్నది — "చూడండి, మీరు మర్యాదస్తులు; ఆ దుకాణంలోకి పోకండి."

ఆ మనిషి అదివరకే కొంచెం తాగివున్నా డనుకుంటాను. నీరూదేవి ముఖం వంక చూస్తూ — "వాహ్వా! కొంచెం హుషార్ వుంటానికి తాగుదామన్నా వద్దంటున్నావే?" అన్నాడు.

నీరూదేవి అంటున్నది :—"మీరు గౌరవకుటుంబీకులు. మీకు తెలియంది ఏముంది? సారా తాగడం మరణ్యాసం; మానెయ్యండి."

"ఏమన్నావు, సుందరాంగీ! సారా తాగవద్దనా? .... తప్పకుండా అలాగే వదులుతాను; నువు నీ చంద్రుడులాంటిముఖం ముద్దు పెట్టుకోనిస్తే!" అన్నాడు మాటలు తడబడుతూ.

ఈ మాట వాడు పూర్తిచేయకముందే వాడి ముక్కుమీద ఒక గుద్దుపడింది. దెబ్బతోపాటు బొటబొట ముక్కువెంట నెత్తురు కారింది. వాడు క్రిందపడి పోయాడు. ఇదంతా నా కుడిచేయి చేసింది, నాకు తెలియకుండానే! ఇక అక్కడి యువతులంతా 'దేవో, దేవో' అని కేకలువేశారు. సారాయి దుకాణంవాడు. పోలీసులకోసం కేకలువేశాడు. కాసేపట్లో ఇంకా పెద్దగుంపు కూడింది. యువతులు 'వందేమాతరమ్.' 'గాంధీమహాత్మాకి జయ్!' అని కేకలు వేయసాగారు. ఈ సమయంలో గుర్రం ఎక్కిన సార్జెంటు ఒకడు వచ్చి గుంపును చెదరగొట్టాడు. ఇంకో పెద్దఆఫీసరు వచ్చి నన్ను పోలీసుస్టేషనుకు తీసుకుపొమ్మని ఆజ్ఞాపించాడు. నన్ను పోలీసువాన్‌లో ఎక్కించి స్టేషనుకు తీసుకుపోయారు. రాత్రి ఎనిమిది గంటలకు సుకుమార్ వచ్చి నన్ను జామిన్‌మీద విడుదల చేయించా లని చూశాడు. కాని అక్కడ ఆఫీసరుకు తెలిసినవా రెవరూ దొరకనందు వల్ల విడుదల జరగలేదు; మర్నాడు కోర్టుకో తీసుకో మన్నాడు. సుకుమార్ నాకు భోజనపదార్థాలు వాళ్ళింటినించి చాలా తెచ్చాడు. నేను అవి భోంచేసి ఆరాత్రికి అక్కడే వున్నాను.

మర్నాడు పదిన్నరకు చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రీటుకోర్టులో హాజరు పెట్టారు. ఆవాళే నన్ను విచారిస్తా రని తెలిసింది. శంకరూ, సుకుమారూ, నీరూదేవి, ఇంకా ఆమె స్నేహితురాళ్ళు ముగ్గురూ నన్ను చూడటానికి వచ్చారు.

శంకర్ నాతో అన్నాడు:— "ఏమోయ్ కిశోర్! నువ్వెన్నాళ్ళనుంచి అయ్యావు సత్యాగ్రహివి? నా మీద ఉన్న గౌరవం కాస్తా మహాత్ముక్క

నాటితో కాజేసి కూచుంటివి. అసలు నేనే నిన్న వాళ్ళ జట్టుతో పోవలసిన మాట. ఈ సంగతి మా నాయనకు తెలిసి నన్నింటోనించి బయటికి రానివ్వ లేదు. నేను రేపు మున్‌సిఫ్ నయి కుటుంబగౌరం నిలుపుతానని ఆయన నన్నాం. నాకు అక్కడినుంచి తప్పుకువచ్చిన తర్వాత నీ సంగతి తెలిసింది. సరే, అది అలా వుంచు; నువ్వు చివరంటా ఇందులో ఉంటావా? మధ్యనే తప్పుకుంటావా?''

''కిశోర్! నీకు నేను వకీలును కుదిర్చాను. అతను నీకేసు డిఫెండ్ చేస్తాడు. నీ కిష్టమేనా?'' అని అడిగాడు సుకుమార్.

నీరూదేవి అన్నది:....''మీకు ఈ విషయంలో మహాత్మాగాంధీగారి అభిప్రాయాలు తెలుసనను కుంటాను వారు ప్రభుత్వంతో సహాయ నిరాకరణ చేయమన్నారు. అందుచేతనే మన సోదరసోదరీమణు లెంతోమంది ప్రతివాదం చేయకుండా నవ్వుతూ జైళ్ళకు వెళ్లుతున్నారు మీరు వారిజాడను నడిచి జైలుకి వెళ్ళుతారా? లేక వాదన పెట్టుకుంటారా?''

''నేను వాదించను; వాళ్ళమార్గానే నడుస్తాను.''

శంకరుడు నవ్వి....''ఈ మాటు నీ ప్రేమయజ్ఞానికి ప్రేమాహుతి లభిస్తుంది.'' అన్నాడు.

ఇది జరగుతూ వుండగా పోలీసు వచ్చి నన్ను కోర్టుకు పిలుచుకపోయాడు. నా స్నేహితులు కూడా నాతోపాటు కోర్టుకు వచ్చారు. నా విచారణ ఆరంభమయింది ఆ త్రాగుబోతే ఫిర్యాది. వాడు చెప్పాడు:.... ''నేను సారా దుకాణంలోకి పోతున్నాను. ఒక ఆడమనిషి నాకు అడ్డు వచ్చింది. నేను అమె అడ్డు లెక్కచేయకుండా దుకాణంలోకి పోతుంటే ఈ ముద్దాయి నన్ను కొట్టాడు. నాముక్కు పగిలింది. నేను క్రిందకూడా పడ్డాను.''

నీరూదేవిని అన్నమాటలు వాడు బయటపెట్టలేదు. వాడిని ఎవరూ ఆ సంగతులు అడగనూ లేదు.

ఆ తర్వాత డాక్టరూ, పోలీసూ సాక్ష్యం యిచ్చారు. నేను వాళ్ళు చెప్పిన వేవీ కాదనలేదు. ఆ తర్వాత మేజస్ట్రీటు ''నువ్వేమన్నా జవాబు చెప్పతావా?'' అని నన్ను అడిగాడు.

నేను జవా బివ్వనన్నాను.

అక్కడున్న ఒక వకీలు హేళనగా:.... ''ఈ కుర్రవాడు సత్యాగ్రహీ. గాంధీగారి శిష్యుడూ అన్నమాట. అయితే బాబూ! వాడి నెందుకు కొట్టావూ? మహాత్మాగాంధీ చెప్పిన అహింస ఏమయిందీ?'' అని అడిగాడు.

బహుశా ఈయన ముద్దాయి వకీ లనుకుంటాను. నే నాయనమాటలకు జవా బేమీ యివ్వలేదు.

మేజస్ట్రీటు అప్పుడే జడ్జిమెంటుకూడా రాసి వినిపించాడు.

"ముద్దాయికి! మూడుమాసాలు కఠినశిక్ష."

పోలీసులు నన్ను వెంటనే కోర్టునించి తీసుకుపోయారు.

నా మిత్రులు నన్ను చూడటానికి వెంట వచ్చారు. నీరూదేవి మందహాసం చేసి.... "ఇప్పుడు మీ జీవితం సార్థకం అయింది!" అని నా మెడలో ఒక నూలు దండ వేసింది. ఆమె సఖులుకూడా నాకు తలా ఒకదండ వేశారు. నాకు స్వర్గం చేతి కందినట్లయింది. ఇంకా కొంతమంది సత్యాగ్రహులు చేతేవరకూ నన్ను వాన్‌దగ్గరే ఉంచారు. అంతవరకూ వారు అక్కడే వున్నారు. నాయంత్రం వాన్ పోతుండగా 'వందేమాతరమ్' అన్న జయధ్వనులతో నన్ను వారు సాగనంపారు.

## నీహారిక చెప్పినది

## 1

కిశోర్ మెడలో మాల వేసి జైలుకు పంపి, నేను కలిగిన మనస్సుతో ఇంటికి తిరిగివచ్చాము. కోర్టులో ఉన్నంతసేపూ విజయోల్లాసమూ, స్నేహితురాళ్ళ వాత్సల్యమూ నాకు రెండో విచారాన్ని కలిగించలేదు. కిశోర్ నిర్దోషి అయినప్పటికీ పిరునిలాగా కారాగారానికి వెళ్ళాడు. ఇది నా సంతోషానికి కారణం. కాని సాయంకాలం ఇంటికి తిరిగివచ్చేవరకు నాలో ఆవేశంచాలా తగ్గిపోయింది- వాస్తవ ప్రపంచంలోకి వచ్చాను. అన్నయ్య బండిలో నాతో ఏమీ మాట్లాడ లేదు - ముఖం గంభీరంగా పెట్టుకు కూచున్నాడు. రాత్రి భోంచేసిన తర్వాత అన్నయ్య "ఏమే, నీరూ? కిశోర్‌ను జైలుకు పంపినందుకు నీకేమైనా పశ్చా త్తాపం కలుగుతున్నదా?" అని అడిగాడు.

నాకు ఆశ్చర్యంవేసి అన్నాను;.... "అదెలా? అతన్ని నేను జైలుకు పంపానా, నాకు పశ్చాత్తాపం కలగటానికి?"

"నీమూలానేగా పాపమతను జైలుకు పోయింది."

"ఎలాగ?"

"ఆనాటి నీ ఉద్రేకపూరిత ఉపన్యాసమూ, మీ పికెటింగుకు సహాయపడమని కోరడమూ, తర్వాత కోర్టులో డిఫెన్సు పెట్టుకోవద్దని వాదించటమూ అన్నీ నీ వేగా. నేను వకీలును అడిగిచూశాను....నిజం చెప్పేటట్టయితే కిశోర్‌కు

కై లు శిక్ష పడదన్నాడు. సుమో అంటే 20 సంవత్సరాల జరిమానా విధిస్తు నన్నాడు.''

నేను కొంచెం తగ్గి అన్నాను :....''నా కిష్టం తెలియదు. ఈ పరిస్థితిలో నా కర్తవ్య మనుకున్నది నేను చెప్పాను. అతను నా మాట వినాలని ఎక్కడ ఉంది? శంకర్ బాబు పికెటింగుకు రాలేదే, మరి?''

''కిశోర్ అలా ఊరుకోగలడటు? నీ కోసం అతను ప్రాణాలైనా ఇస్తాడు.'' అన్నాడు అన్నయ్య.

''చాల్లేద్దూ. నా కెవరి ప్రాణాలూ అక్కర్లేదు. ఎవరి కర్తవ్యం వాళ్ళు నిర్వహిస్తే చాలు.'' అన్నాను నేను.

''నీ కర్తవ్య మేమిటో తెలుసా? కిశోర్‌ను పెళ్ళిచేసుకోవటం. అమ్మ చని పోతూ నిన్నతని కొప్పగించింది. అదీగాక అతను నిన్ను చాలా ప్రేమిస్తు న్నాడు—''

నేను విసుగుతో—''ఇక చాలు, అవు—పెళ్ళి. పెళ్ళి అని నా చెవికింద అంటూఉంటే నే నెక్కడైనా వెళ్ళిపోతాను.'' అన్నాను.

''నిజంగా ఎక్కడకి పోతావూ?''

''నేను ఎవరికీ గుదిబండగానూ ఉండను; ఒకరి అధికారంక్రిందా ఉండను. నేను నా కాళ్ళమీద నిలబడా లని చూస్తున్నాను.''

''ఇదే ననుకుంటాను, నువ్వు నారీ అభ్యుదయ సమితిలో చేరినందుకు ఫలితం? మరి ఇంత కాలంనుంచి చదివిన చదువూ, బి. యే. పరీక్షా ఏమవు తుంది?''

''నేను ప్రైవేటుగా బి. యే. కు కూర్చుంటాను. ఈ ఉద్దేశాలు నాకు ఇప్పుడు కొత్తగా వచ్చినవి కావు. పూర్వంనుంచీ ఉన్నవే. ఇదివరకు నాకు అమ్మ ఒక బంధంగా ఉండేది. అది తెగిపోయింది. ఇప్పుడు నేను విశాలమైన ఆకాశంలో స్వేచ్ఛగా విహరించే ఒక పక్షిని.''

''కాని అమ్మ నీకు కట్టిపోయిన తాడు నీవు తెంచుకోలేవని నా నమ్మకం. ఇపుడు నాకు అర్థమవుతున్నది, అమ్మ దూరదృష్టి!''

''నువ్వు ఎన్నన్నా చెప్పు. నే నా బంధన ఒప్పుకోను. నేను నిలాంటి సోదరుడి బంధననే తెగ్గోసుకుంటూ ఉంటే, ఇంకొకరి బంధన మెందుకు ఒప్పుకుంటాను?''

"సరే, సరే, నీ ఇష్టం వచ్చింది చేసుకో. మనంమాత్రం హాయిగా తిని గప్పాలుకొడుతూ కూచున్నాము. కిశోర్ ఇప్పుడేం చేస్తూఉంటాడో తెలుసా? జైలుగుడ్డలు వేసుకుని, ఇనపపళ్ళెంలో ఉడికీ ఉడకని కూడు, నోటపెట్ట వీలు రాని కూరలు తిని, అర్థాకలితో, దొంగలతోపాటు కంబళిమీద పడుకుని దోమలు తోలుకుంటూ ఉంటాడు."

అన్నయ్యమాటలు వినేవరకు నా కళ్ళలో నీరు తిరిగింది. నేనవి చాటుగా తుడుచుకుని —"జైల్లో ఇన్ని కష్టాలుంటాయా? అలాగైతే పెద్దమనుషులు ఎలా ఉంటారు అందులో?" అన్నాను నేను.

"జైళ్ళు పెద్దమనుషులకోసం కాదు కట్టింది. అక్కడేమి పనులు చేయాలో నీకు తెలుసా? రాళ్ళు పగలగొట్టడం, గానిగ తిప్పటం —"

"ఘరానా వ్యక్తులుకూడా ఈ పనులు చేయవలసిందేనా?"

"జైల్లో ఘరానావ్యక్తులకూ దొంగలకూ తేడా ఏమీ లేదు. అంతా సమానమే. దయతలిస్తే అప్పుడప్పుడూ వాళ్ళు ఘరానావ్యక్తులకు ఆఫీసుపనులు ఇవ్వటంకద్దు. కాని ఇప్పుడు జైళ్ళనిండా ఘరానా మనుషులే నాయె — వారికక్కడ అన్ని ఆఫీసుపనులేమి ఉంటై?"

"జైలుకు పోయివచ్చినవాళ్ళదగ్గర విన్నాను నేను. సరే - ఇక పోయి పడుకో - చాలా పొద్దుపోయింది." అని అన్నయ్య లేచి వెళ్ళాడు.

నేనూ నా గదిలోకి వెళ్ళాను. ఆ మాటలు విన్నతర్వాత నా కిక పక్కమీద పడుకో బుద్ధిపుట్టలేదు. నేలమీద చాప వేసుకు పడుకున్నాను. అనేక ఆలోచనలతోనూ, దోమలబాధతోనూ బాగా నిద్రపట్టలేదు. చాలాసేపు కిశోర్ సంగతులే ఆలోచించటంవల్ల అతనిమీద నాకు జాలివేసింది.

ఉదయం ప్రమీల వచ్చి నేను నేలమీద పడుకోవటం చూసి అన్నయ్యను పిలుచుకువచ్చింది. అన్నయ్య వచ్చి-"ఇదేమిటే నీరూ? ఏమిటీ వ్యవహారం? నువ్వు రాత్రంతా ఇక్కడే పడుకున్నావా?" అన్నాడు.

నేను లేచి కళ్ళు నులుముకుంటూ —"ఆఁ. ఇది నాకు ప్రాయశ్చిత్తం!" అన్నాను.

అన్నయ్య పదిగంటలకు భోంచేసి కాలేజికి వెళ్ళాడు. నేను ఆపూట అన్నంలో పాలూ, మాంసమూ తీసుకోలేదు. ప్రమీల బలవంతం చేసింది - "ఇదీ నాకు ప్రాయశ్చిత్తము," అన్నాను నేను.

సాయంత్రం నాలుగు గంటలకు అన్నాయి కాలేజీనించి తిరిగివచ్చాడు. ఆ తర్వాత పదిహేను నిమిషాలకు ఆయనకోసం ఎవరో వచ్చారు. అన్నయ్య అతనితో డ్రాయింగురూంలో కూచుని మాట్లాడాడు, చాలా సేపు. ఆతర్వాత నా దగ్గిరికి వచ్చి, "ఆ వచ్చినాయన కిశోర్ అన్న. టెలిగ్రాం చూసుకుని కృష్ణనగరంనించి వచ్చాడు. కిశోర్ ఉండే రూంలో ఉంటున్నాడట. అతను జైలుకు పోయినందుకు చాలా విచార పడుతున్నాడు. ఎలాగన్నా అతన్ని విడిపించటానికి మార్గ ముందేమో నన్ను చూడమన్నాడు."

"నువ్వేమి చెప్పావు ఆయనకి?"

"ఏమి చెపుతాను? కిశోర్ తనకు తానై డిఫెండు చేసుకోకపోతే మనం ఏమిచేయగలం? అన్నాను. ఆయన చెప్పాడు, దీనికి అపీలు లేదని. హైకోర్టులో పిటీషను పెట్టాలట. కాని, దానివల్ల లాభం ఉంటుందనే నమ్మకం లేదన్నాడు. తనకు కిశోర్‌ను చూడాలని ఉందన్నాడు. ఆయనకు ఇక్కడిచోట్లు తెలియావట. నన్ను రమ్మని అడిగాడు. నేను తప్పక వస్తా నన్నాను."

మర్నాడు ఉదయం ఏడుగంటలకే అన్నయ్య వెళ్ళిపోయి, మళ్ళీ 11 గంటలకు తిరిగివచ్చాడు. వాళ్ళు జైల్లో కిశోర్‌ను కలుసుకున్నారట. అతను చాలా సంతోషంగా ఉన్నాడట. మూడుమాసాలకు ఎంతభాగ్యం; చూస్తూఉండగానే గడచిపోతై అన్నాడట. అన్నయ్య ఇంకో సంగతి చెప్పాడు. జైల్లో ఇప్పుడు రాజకీయ ఖైదీలను ప్రత్యేకంగా ఉంచుతున్నారట. వాళ్ళకు అంత ఇబ్బందులు లేవన్నాడు. ఈ మాట వినేవరకు నాకు చాలా స్వస్థత చిక్కింది.

కిశోర్ అన్న కాలేజీకి పోయాడు. అక్కడ పై అధికారులు ఆయనకు, కిశోరును ఇక కాలేజీలో ఉంచమని చెప్పారట ఇది విన్నతర్వాత ఆయన చాలా నిరుత్సాహ పడ్డాడట. కిశోర్ చదువు ఎటూ కాకుండా మధ్యనే ఆగితే ఏమిచేయాలో అతనికి తోచ లేదట. అన్నయ్యను సలహా అడిగాడట.

దీని కింత పెద్దఆందోళన ఎందుకో నాకు అర్థంకాలేదు. ఎంతో మంది విద్యార్థులు నాన్‌కోపరేషన్ ఉద్యమంలో తమకు తామై చదువు మానారు. వాళ్ళకంటే ఇది పెద్ద గొప్ప ఏముంది? "నీమూలానే కిశోర్ భవిష్యత్తంతా పాడయింది;" అంటాడు అన్నయ్య నాతో. అన్నయ్య మాటలు నాకు చాలా బాధ కలిగిస్తున్నాయి. నన్ని విధంగా ఏడిపిస్తూవుంటే నేనిక ఈ ఇంటిలో ఉండను. ఇంకో మార్గం చూసుకోవలసిఉంటుంది.

మర్నాడు నేను బేథూన్ కాలేజీకి పోతే ప్రిన్సిపాల్ నన్ను తన గదికి పిలిపించింది. నేను వెళ్ళాను.

"నువ్వూ, అరుణాసేన్, లతికాబెనర్జీ, సులేఖారాయ్, చిత్రాఘోష్ మొన్న పికెటింగులో పాల్గొన్నా రని తెలిసింది. మీకోసం కిశోర్ బెనర్జీ అనే అతను జైలుకుకూడా పోయాడట; నిజమేనా?" అని అడిగింది.

"నిజమే," అన్నాను.

"ఇలా మీరు బజారులో పికెటింగ్ చేయటం ఎంతవరకు చట్టసమ్మతమో మీకు తెలియందికాదు. ఈ విషయంలో గవర్నమెంటు సర్క్యులర్లుకూడా ఉన్నై."

"మేము గవర్నమెంటు కాలేజీలో చదువుతున్నాము కాబట్టి దేశసేవ చేయకూడ దని ఎక్కడఉంది? దేశంపట్ల మాకిక కర్తవ్య మేమీలేదా?" అని అడిగాను.

ఆమె మండిపడింది:—"నేను నీ ఆర్గ్యుమెంటు ఏమీ వినదల్చుకోలేదు. నేను మీ పేర్లు రిజిష్టరులోనించి తొలిగించమని సిఫార్సు చేయబోతున్నాను."

మీకు కర్తవ్య మని తోచింది మీరు చేయండి. మానవత్వం సంపాదించ టానికి చేసే కృషికి అడ్డువచ్చే విద్య ఒక విద్య కాదని నా ఉద్దేశం. నేను కాలేజీ వదలటానికి సిద్ధంగా ఉన్నాను."

ఆమె నన్ను ఇక పొమ్మన్నది. నేను ఇంటికి వచ్చేశాను నాకు ఇది ఒక విధంగా మంచిదే. ఇంకో బంధన తెగిపోయింది. పైగా కిశోర్‌ను మెడికల్ కాలేజీనించి తీసివేసినప్పుడు నామీద నెపం వేయటానికి వీలుండదు. నాకూ అతన్ని తీసివేసినందుకు అంతకష్టం కలగదు. కాని అన్నయ్య నాతో మొదటి నించీ వాదిస్తున్నాడు. 'నేను బి. ఏ. పాసు కానట. నావల్ల ఈ ప్రపంచంలో ఏ పనులూ కావట. పెళ్ళి చేసుకోకపోతే నా జీవిత మంతా వ్యర్థమట.' నేను పెళ్ళిచేసుకోకుండా జీవితమంతా ఆయనకు గుదిబండలాగా ఉంటానేమో నని అన్నయ్య అనుకుంటున్నా డనుకుంటాను. కాని నాకు అలా ఉండాలని లేదు. నే నెవ్వరికీ బరువు కాను. ఏదో ఉద్యోగం సంపాయించుకుని స్వతంత్రంగా ఒకరి దయమీద ఆధారపడకుండా ఉంటాను.

నే నిలాంటి మానసిక స్థితిలో ఉండగా ఒకనాడు శంకర్ మా యింటికి వచ్చాడు. నేను ఏదో కుట్టుతూ లైబ్రరీ గదిలో ఉన్నాను. ప్రమీలకూడా

ఏదో చదువుతూ అక్కడే కూచుంది. నేను శంకర్‌ను చూడగానే—"మీరిన్నాళ్ళ నించీ ఎక్కడ ఉన్నారు? పికెటింగ్ చేస్తున్నారా?" అని అడిగాను.

'నేను పికెటింగ్ చేయను—మునసబుగిరికి తయారవుతున్నాను. ఈ ఆందోళనలో ఇల్లు వదలిపోవద్దని స్వర్గస్థులైన మా తండ్రిగారి ఆజ్ఞ!" అన్నాడు.

"అయితే ఇప్పటినించే దాసత్వానికి తయారవుతున్నారన్నమాట! మరి నాకుకూడా ఒక ఉద్యోగం చూసి పెడతారా?" అని అడిగాను.

"మీ కెందుకూ ఈ దాసత్వం? బి. యే. కి కూచోరూ?"

"ఇక చదవటం కుదరదు. ప్రిన్సిపాల్ నా పేరు తీసివేస్తా నని చెప్పింది."

"ఓ. ఆవాళ పికెటింగ్ చేసినందు కనుకుంటాను. అందుకనే, ఆవాళ మా నాన్నగారు నన్ను బయటికి పోనివ్వంది. పోకపోవటం మంచిది కూడా అయింది."

"మునసబుగిరి సంపాయించటాని కన్నమాట. కాని మీ మిత్రు డలా అనుకోలేదే!"

"ఏలో రా! వాడిసంగతి ఎవరికీ అంతుపట్టదు. లోపల ఏమున్నదో బ్రహ్మకు తెలియును. ఒకసారి పోయి వాణ్ణి చూసిరావాలి."

"మొన్న అన్నయ్య పోయి చూసివచ్చాడు. చాలా ఉత్సాహంగా ఉన్నాడట."

ఎందుకు ఉండడూ? మీరు స్వయంగా దండ వేసి జైలుకు పంపితిరి!"

"కాని అతన్నికూడా మెడికల్ కాలేజీలో చేరనివ్వ రని విన్నాను. సరే ఆ సంగతి పోనివ్వండి. నేను చెప్పిన సంగతి మరిచిపోకండి. మీరు పత్రికలు చూస్తూ ఉంటారు. ఎక్కడున్నా ఆడపిల్లల స్కూల్లో టీచరుపని ఖాళీగా ఉంటే చెప్పండి."

"కాని, మీరు ఒకరి అధీనత వొప్పుకో మని ప్రతిజ్ఞ చేస్తిరిగా?"

నేను నవ్వి—"దీన్ని పరాధీనత అంటానికి వీల్లేదు. పొట్టకోసం, ఉద్యోగం చేయక తప్పదు. నే నొకరికి బరువుకాను. స్వతంత్రంగా బ్రతుకుతాను" అన్నాను.

"అయితే, ఇంటో వాళ్ల అధీనతకంటే స్కూల్లో సెక్రటరి అధీనత మంచి దంటావు. సరే. యింతకూ నువ్వు ఉద్యోగం చెయ్యటానికి సుకుమార్ ఒప్పుకుంటాడా?"

నేను నవ్వి, "అన్నయ్యతో నేను పోట్లాడాను. ఇక నేను ఆయన మాట కూడా వినను'' అన్నాను

''సరే, భవానీపూర్‌లో కొత్తగా ఆడపిల్లలకు ఒక హైస్కూలు పెట్టారు. అక్కడ ఏమైనా ఖాళీ ఉందేమో చూసి మీకు తెలుపుతాను. సుకుమార్ ఇంకా రాలేదు. ఈమాటు వచ్చినప్పుడు కలుసుకుంటానని చెప్పండి. ప్రమీలా! ఏమిటి నువ్వుకూడా చదువుమీద నాన్‌కోపరేషన్ సాగించావా?''

ప్రమీల నవ్వి- "నా చదువు అంత బాగా సాగటంలేదు. ఈ మధ్య గోలల్లో నాకు చెప్పేవారే లేరు'' అన్నది.

''ఇంటో గోల లుంటే నీకేం? నీ చదువు నువ్వు చదువుకోరాదూ? ... మీ చేతిలో ఆ పుస్తకం ఏమిటి శంకర్‌బాబూ!'' అని అడిగాను నేను.

''ఈ పుస్తకం మీకోసమే తెచ్చాను నారీ అభ్యుదయింమీద మిసెస్ ఫిలిప్ స్నోడన్ రాసింది. చాలా గొప్పపుస్తకం. మీరు ఒకమాటు చదివి చూడండి'' అని పుస్తకం నాకిచ్చి శంకర్ శెలవుతీసుకు వెళ్ళిపోయాడు.

## 2

మూడురోజు లైన తర్వాత శంకర్ మాయింటికి వచ్చి, ''మీరు నిజంగా ఉద్యోగం చేస్తారా?'' అని అడిగాడు.

''ఆఁ, ఏదైనా దొరికిందా?'' అని అడిగాను.

''నేను చెప్పలేదూ, భవానీపూరులో ఆడపిల్లల స్కూలు పెట్టారని; దానికి ఒక అసిస్టెంటు టీచరు కావాలట. కొత్తస్కూలు-జీతం 50 రూపాయ లిస్తారట. ఒక సంవత్సరం అయాక 60 చేస్తారట.''

నేను చాలా సంతోషించాను :- "ఒక్కదాన్ని నాకు యాభై చాలు.''

"ఇక్కడినించి స్కూలుకు పోతూ ఉండగలరా? మీ కేమీ ఇబ్బంది ఉండదుకదూ ?''

"కాని నే నింతవరకు ట్రాముల్లో బస్సుల్లో ఒక్కదాన్ని ఎప్పుడూ పోలేదు.. అన్నయ్య ఏమంటాడో ? అక్కడ దగ్గర్లో ఉంటానికి వీలులేదూ ? స్కూలుకు బోర్డింగులేదూ ?''

"బోర్డింగు పెట్టాలనే అనుకుంటున్నారు. కాని, మీరు స్వతంత్రంగా ఉండాలని ఇంత ప్రయత్నిస్తారే, ఒక్కరే స్కూలుకు పోలేరూ ?''

నేను సిగ్గుపడ్డాను :—"మీ రామాట అనేందుకు పూర్తి అధికార ముంది. సరే మొదట నాకు కొంచెం సంకోచంగా వున్నా తర్వాత అలవాటు పడ

తాను. ఇప్పుడు అన్నయ్య ఏమంటాడో కనుక్కోవాలి. నేను వుద్యోగం చేస్తావని అన్నప్పుడే మొహం ఒక ఇదిగా పెట్టుకున్నాడు నాతో సరిగా మాట్లాడటం లేదు కూడా."

శంకర్ అన్నయ్యను పిలిచాడు. అన్నయ్య వచ్చి "ఏమోయ్ శంకర్! నా మీద ఏదో కుట్ర పన్నుతున్నట్టు వుందే?" అన్నాడు.

"నీరూదేవి ఈమాటు స్త్రీ స్వాతంత్ర్యపతాకం చేతబట్టి రోడ్ల వెంట బయలుదేరబోతోంది! ఆ సంగతే చర్చిస్తున్నాము." అన్నాడు శంకర్.

"చూస్తే నువ్వే నీరూకు మంత్రితాగా ఉంది. నువ్వేమైనా చేయిగాని నగుబాట్లపాలు మాత్రం చేయకు" అన్నాడు అన్నయ్య.

"మీరు మొదటినుంచీ స్త్రీలని ఎగతాళీ చేస్తూనే వస్తున్నారు. వాళ్లు ఏది చేయబోయినా మీకు ఎగతాళీగానే ఉంటుంది. అంచేత మీ మాటలు లెక్క చేయకుండా మా పని మేము చేసుకుపోవటం మంచిది," అన్నాను నేను.

"మాపని మేము చేసుకోటం అంటే, టీచరుపని చేయటమా" అన్నారు అన్నయ్య.

"ఆఁ. ఆమె అలాంటిపనే చేయబోతోంది. ఇప్పుడు మీ అనుమతి కావాలి," అన్నాడు శంకర్.

"ఇంకా నా అనుమతి ఎందుకూ? నీరూ నా మాట విననని చెప్పనే చెప్పింది. ఇక తన కిష్టమైతే చాలు," అన్నాడు అన్నయ్య.

"అన్నాయ్! నువ్వు కోప్పడమాకు. కాలేజీలో నా పేరు తీసేశారు"- ఇప్పుడు కాళీగా ఇంట కూచొని తినటం నాకిష్టంలేదు. నేను టీచరుపని చేస్తూ ప్రయివేటుగా బి. ఏ. కి కూచుంటాను. దీంటో తప్పేముంది?" అన్నాను

"ఇది బాగానే వుంది. దీంటో నీ కిష్టంకాని దేమున్నది సుకుమార్!" అన్నాడు శంకర్.

"నువ్వెక్కడ చేస్తావ్ టీచరుపని? ఆడపిల్లలస్కూళ్లు ఎక్కువ లేవుగా" అన్నాడు అన్నయ్య కొంచెం మెత్తబడి.

శంకర్ భవానీపూరుసంగతి చెప్పాడు.

"భవానీపూర్ రావటం పోవటం చాలా కష్టం. మగవాళ్ళయితే ఫర్వాలేదు. అదీకాక నీరూ ఇదివరకు వొంటరిగా తిరిగిందికాదు" అన్నాడు అన్నయ్య.

"మొదట కొంచం ఇదిగా ఉన్నా తర్వాత అలవాటవుతుంది. నేను ఇక వొంటరిగా ఈ యింట్లో కూచోలేను." అన్నాను నేను.

"అంటే, ఇంగ్లీషులో చెప్పినట్టు 'చమటోడ్చి తింటా' వన్నమాట కాని ఆడవాళ్ళు వుద్యోగం చేయటమంటే నాకు రివల్సివ్‌గా వుంటుంది. అసలు మగవాళ్ళకే వుద్యోగాలు దొరకకుండా ఛస్తుంటే వీళ్లకూడా బయలుదేరితే ఎలా?" అన్నాడు అన్నయ్య.

"ఆడవాళ్ళంతా వుద్యోగాలు చేస్తారని ఎక్కడ వుంది!" అన్నాను నేను

"మరి నువ్వు మాత్రం ఎందుకు చేయాల్సివచ్చింది? సరే, నువ్వు వుద్యోగం చేయా లనుకుంటే చేసుకో. నా కేమీ అభ్యంతరం లేదు!"

నేను నవ్వి - "మాశారా, శంకర్‌బాబూ! అన్నయ్య ఇష్టపడ్డాడు. మరి యెప్పుడు వెళ్దాం అక్కడికి?" అన్నాను నేను.

"నేను ఇవాళ స్కూలు సెక్రటరీతో మాట్లాడి, రేపు ఉదయం 11 గంటలకు వచ్చి తీసుకుపోతాను."

"అయితే నేనుకూడా మీతో వస్తాను. నీకూ తిరిగివచ్చేటప్పుడు నా వెంట వస్తుంది" అన్నాడు అన్నయ్య.

మర్నాడు మేము ముగ్గురమూ ట్రాంలో భవానీపూరు వెళ్ళాము. ట్రాంలో జనం చాలామంది వున్నారు. అంతమంది మగవాళ్ళలో కలిసి కూచోటానికి నాకు ఏదో సిగ్గుగా వుంది. చాలామంది నోరు తెరుచుకు నా వంక చూస్తు న్నారు. మనదేశంలో పెద్దమనుషులకింద చలామణీ అవుతున్న వ్యక్తులే ఎంత అనుర్యాదస్తులు! నేను తల వంచుకున్నాను. నాకు అటూ ఇటూ శంకరూ, అన్నయ్యా కూచున్నారు. నేను స్కూలుకు పోయిందాకా తల ఎత్తలేదు.

శంకర్ సెక్రటరీ దగ్గరనించి ఒక ఉత్తరం తెచ్చాడు. నేను అది తీసుకుని హెడ్‌మిస్ట్రెస్ దగ్గరికి వెళ్లాను. అన్నయ్యా శంకరూ ఆఫీసుగదిలో కూచు న్నారు. హెడ్‌మిస్ట్రెస్ మిస్ సాధనా కాంతిలాల్ బి ఏ. బ్రాహ్మసమాజి 40 ఏళ్లు వుంటై. ఆనందంకంటే గంభీరం ఎక్కువ ఆమె స్వభావంలో. నేను వుత్తరం యిచ్చి నా పేరు చెప్పాను. ఆమె నన్ను ఎగాదిగా చూసి "మీ వయసు చాలా కొద్ది. మిమ్మల్ని ఏమని పిలవమంటారు?" అని అడిగింది.

నేను నవ్వుతూ- "నువ్వనే అనండి."

"చదువు ఎంతవరకు చదివావు?"

"మానలేదు. ఇంకా కాలేజీలో చదువను."

"నాన్ కో ఆపరేషన్ చేశావా?"

"ఒక విధంగా అంతే."

"ఈ ఉద్యోగంలో అంటిపెట్టుకు ఉంటావా?"

"ఉండా లనే ప్రయత్నం."

"అంటే పెళ్ళి అయిందాకా నన్నమాట. మరి ఇన్నాళ్ళు పెళ్ళి ఎందుకు చేసుకోలేదు?"

పెళ్ళితోకూడా నాన్‌కోఆపరేషన్ చేశాను."

"ఇంత చక్కటిదానివి ఎన్నాళ్ళు నాన్‌కోఆపరేషన్ చేయగలవు?" అని మిస్ సాధన దీర్ఘంగా నిట్టూర్చింది.

"నాకు ఏక్లాసు ఇస్తారు?" అని అడిగాను నేను.

ఆమె లిస్టుఅంతా చెప్పి నన్ను క్లాసులకు తీసుకుపోయింది. రమలా చటర్జీని, ఇంకా ఇతర టీచర్లనూ నాకు పరిచయం చేసింది. రమలకు 25 ఏళ్ళు ఉంటై. ఎప్పుడూ సంతోషంగా ఉండే స్వభావం. ఆ రెండు మూడు నిమిషాల సంభాషణకే మా యిద్దరికీ మంచిస్నేహ మయింది.

హెడ్ మిస్ట్రెస్ నన్ను మరునాడు 11 గంటలకు రమ్మన్నది. స్కూలు టైము అదే. తర్వాత ను వ్వెక్కడ ఉంటా వని నన్ను అడిగింది.

"పాటల్ డాంగా. ఇవ్వాళ మా అన్నయ్యతో వెంట వచ్చాను. ఇంకో మిత్రుడుకూడా వచ్చాడు" అన్నాను.

"కాని నువ్వు రోజూ ఇంతదూరం రాగలవా? నువ్వింకా చిన్నదానివి— మాలాటివాళ్ళకి ఫర్వాలేదు కాని" అన్నది.

నేనూ రావటానికి ప్రయత్నిస్తాను. మీ మాదిరిగా, నేనూ స్వశక్తిమీద ఆధారపడా లని నా ఉద్దేశం."

"సరే మరీమంచిది" అని చెప్పి ఆమె నన్ను పంపింది.

నేను అన్నయ్యతోకలిసి యింటికి వచ్చాను.

## 3

మర్నాడు పదిగంటలకే శంకర్ ఇంటినించి వచ్చాడు. నేను అతనితో బయలుదేరాను స్కూలుకు. బజార్లో ట్రాంకోసం ఆగవలసివచ్చింది. మాకు కొంచెం దూరంగా ఒకవ్యక్తి—20, 22 ఏళ్ళు ఉంటై; రేగిన క్రాపు, కళ్ళకు జోడు, మురికిగా ఉన్న కాలరుచొక్కా, వేస్టుకోటూ వేసుకుని నా వంక పళ్ళు యికిలిస్తూ చూస్తున్నాడు. శంకర్ వాడివేపు కోపంగా చూశాడు. వాడు శంకర్ని— "ఏం నాయనా? మీ కారుకు బయలుదేరావా? నేనుకూడా వచ్చేదా?" అని అడిగాడు.

(సశేషం)




ఈవేళ నా పేర ఒక పార్శిలు వచ్చింది. విప్పి చూస్తే జత చెప్పు లున్నాయ్. ఎవరు పంపించారో ఏమిటో? ఫ్రమ్ ఎడ్రస్ జిలిబిలిగా ఉంది.

నేను దీర్ఘంగా ఆలోచించాను. ఇదేమో ఆకతాయిల పనికాదు. ఎందుకంటే వచ్చినచెప్పులు పాతవిగావు; చింకివికావు; సరికొత్తవి; పైకప్పు పులిచర్మంతో మిలమిలా మెరిసిపోతున్నది. ఐతే — వీటిని ఎవరు పంపించినట్టు? ఆలోచించినా గుర్తుకు రాలేదు. కాని — హటాత్తుగా నా ఆలోచనలకు 'బ్రేకు' పడ్డది. పార్శిల్లో పక్కగా

లేత నీలంరంగు కార్డు కనిపించింది. దానిమీదఇంగ్లీషులో 'విత్‌కాంప్లిమెంట్స్ ఆఫ్ రాజాబహద్దర్ ఎన్. ఆర్. చౌధరీ రామ్ గంగాసేట్' - అని ఉంది. అది చూడగానే మెదడులో ఏదో తళుక్కు-మన్నది! వెంటనే ఎనిమిది నెలలక్రితం జరిగిన వృత్తాంతం గుర్తుకువచ్చింది!

* * *

రాజాబహద్దర్ చౌధరిగారి పరిచయ భాగ్యం ఒక స్నేహితునిమూలంగా కలకత్తాలో కలిగింది. ఆ స్నేహితుడు ఆ స్టేట్‌లో ఉద్యోగి. రాజాబహద్దర్‌గారి జన్మదిన సందర్భంలో, వారిచ్చిన విందులోపాల్గొన్నాను. పాల్గొనడమేకాదు, వారిమీద చిన్న కవితకూడ చేసి వినిపించాను. ఈ కావ్యచర్చవల్ల కలిగిన ఫలితం చెజేతులా లభించింది! పూర్వం అక్బరుపాదుషా ఆస్థానంలో అబ్దుల్ రహీం కవిపరేణ్యుడు రచించిన కవిత - కేవలం నాలుగు చరణాలకూ ముగ్ధుడై, పాదుషా నాలుగులక్షల మొహర్లు పురస్కారరూపంగా ప్రదానం చేశాడట! అదేవిధంగా రాజాబహద్దరు చౌధరీగారు నా కవితకు ముగ్ధుడై ఒకనాడు తమతో తేనీరు పరిగ్రహించడానికి ప్రత్యేకాహ్వానం పంపించారు. అందులో వారు బంగారంకేసుగల ఒక చేతి గడియారం బహూకరించారు. ఆనాటినుంచీ రాజా బహద్దరుగారంటే నాలో ఎనలేని గౌరవం పాదుకుపోయింది.

ఎనిమిది నెలలక్రితం రాజాబహద్దరుగారి నుంచి - వారు పాల్గొనబోయే పులివేట చూడడానికి రావల్సిందిగా ఆహ్వానం వచ్చింది. కలకత్తాలో నాకున్న పనులన్నీ ఎక్కడివక్కడ విడిచిపెట్టి ఉరక పరుగుల్తో బయల్దేరాను. కాగా అటవీప్రాంతాలు చూడడమన్నా, అక్కడున్న రకరకాలైన జంతువులూ, పక్షులూ, సరీసృపాలూ, కీటకాలూ, యిత్యాదుల్ని పరిశీలించడమన్నా నాకు చాల కుతూహలం. ఆ సంబంధమైన పుస్తకాలెన్నో చదివాను, సినీమాలు చూశాను. ఇప్పుడీ ఆహ్వానం పప్పుమీద నేయి చిలికినట్లయింది.

అతని మధ్యనుంచి, మీటరుగేజ్ మీద రైలు ప్రయాణించి ఒక చిన్నస్టేషనులో ఆగింది. అక్కడ నేనొక్కణ్ణే దిగాను. ప్లాట్‌ఫారం నుంచి పాల నురగలాంటి డ్రెస్సూ, లేత పసుపురంగు తలపాగా, ఎఱ్ఱని పటకాతో ఒక 'ఆర్డలీ' వచ్చి, సలాంచేసి "దయచేయండి హుజూర్!" అన్నాడు.

స్టేషనునుంచి బయటకొచ్చాను. మట్టి రోడ్డుమీద సువిశాలమైన ఒక మోటారు నిల్చునిఉంది. దీనిపేరు 'రోల్స్‌రాయస్' కాని రాజాబహద్దరుగా రుంచిన ముద్దు పేరు 'రోజ్'. ఆ మట్టిరోడ్డుమీద 'రోజ్' పరువు తీస్తున్నది. రెండు పక్కలా అరణ్య సౌందర్యం కన్నులపండువు చేస్తున్నది. ఇలాంటి కీకారణ్యంలో




"నీకు అప్పు ఏమాత్రం కావా లనుకుంటున్నావ్ ?"

ఘాతుక జంతువు లుండితీరుతవనీ, ఏ సమయంలో ఏది వచ్చి మోటారు అగ్ర హిస్తుందో అనీ భయంకూడా కలుగు తున్నది. ఆత్మరక్షణార్థం నా జేబులో ఒక ఫౌంటెన్ పెన్ తప్పించి మరేదీలేదు!

ఉన్నట్టుండి తక్కున మోటా రాగి పోయింది. నేను త్రుల్లిపడ్డాను! శంకి స్తున్న కీడు ప్రత్యక్షమైందే మోనని భయ కంపితు ణ్ణయిపోయాను! "పులిగాని_" అంటూ ంద గా ఆర్డలీ నవ్వి "లేదు హుజూర్! రాజాబహద్దరుగారి బంగళా వచ్చేసింది" అన్నాడు.

రోడ్డుకు ఎడమపక్క కొద్దిదూరంలో, నీలంరంగులో ఆ బంగళా కనిపించింది. మానవ సంచారంలేని యీ అరణ్యంలో ఒంటరిగా ఉన్న ఆ బంగళా చూసే సరికి నాలో ఆశ్చర్యమూ, ఒకవిధమైన భయమూ కలిగింది.

మోటారుశబ్దం విని బంగళానుంచి నలుగురు నౌకర్లు వచ్చారు. బంగళాకు సమీపంలో పెద్ద కందకం లాంటి ది ఉండడం అంతవరకూ నేను గమనించనే లేదు. ఆ నౌకర్లు – పెడల్పయిన దళసరి పెద్ద కర్రబల్ల ఆ కందకంమీద చేర

వేశారు. దానిమీదనుంచి మోటారు చల్లగా జారుతూ, రాజాబహద్దర్ ఎన్. ఆర్. చౌధరిగారి 'హంటింగ్ బంగ్లా' ఎదట నిల్చున్నది. న న్నాహ్వానించ డానికి రాజాబహద్దరువారు స్వయంగా వాకిట్లో నిల్చున్నారు. మా నాలుగుకండ్లూ క లు సు కొ నే స రి కి "హ లో ! దయ చేయండి ! దయచేయండి !... తమ కోసమే వెయిట్ చేస్తున్నాను !...ఇంత వరకూ టీ ఐనా తీసు కో లే దు !..." అన్నారు. ఆదరపూర్వకమైన వారి ఆహ్వానం నన్ను మంత్రముగ్ధుణ్ణి చేసి, మాటాడనిచ్చింది కాదు తెలివిమాలిన దద్దమ్మలా, పేలవంగా నవ్వి ఊరుకుండి పోయాను.

ఇ ం త దూ ర ం... క ష్టమని ఆలో చించక... వస్తారని భావించలేదు. తమ రాక ఎంతో ఆనందాన్ని కలిగించింది... పదండి ;" అన్నారు తిరిగి రాజాబహ ద్దరు. "థాంక్యూ వెరీమచ్ సర్" అని ఎలానో అనగలిగాను. ఐతే వారి వినయ సంపత్తి నన్ను ఆనందోద్రేకంలో ముంచె త్తింది. ఔను ! ఇలాంటి గుణగణాలు లేకుండా ఎవరైనా రాజత్వం పొంద గలుగుతారా ? దీన్నే కాబోలు 'రాజో చితవినయం' అంటారు అనుకున్నాను.

"ముందు స్నానం చేసి 'రిఫ్రెష్' అవండి !... టీ యీజ్ గెటింగ్ రెడీ" అంటూ ఒక నౌకరుతో "బాబుగారిని బాత్‌రూమ్‌కు తీసుకువెళ్ళు" అన్నారు.

ఈ మహారణ్యంలో ఇటువంటి రాజోచితమైన బందోబస్తు ఎలా అమి రాయో చూస్తుంటే నా కెక్కడలేని ఆశ్చర్యమూ వేసింది ! ఒక్క బాత్‌రూమ్ అందం వర్ణించాలంటే నా లో ఉ న్న మాటలు చాలవేమో ! నేలమీదా, గోడల మీదా నారూపం స్పష్టంగా కనిపిస్తున్నది. అంటే అవి అంత స్వచ్ఛంగా అద్దా లమర్చినట్టు ఉ న్నా య న్న మాట. 'బ్రాకెట్' మీద రకరకాలైన, విలువైన నాలుగు జ త ల 'టర్కిష్ టవల్స్' వేలాడుతున్నాయ్ ! ఆరు వెండి కేసుల్లో ఖరీదైన సబ్బుబిళ్ళ లున్నాయ్ !... గోడ కమర్చిన టేకుకర్ర అరల బ్రాకెట్‌లో రకరకాలైన, విదేశీ వాసన నూనెసీసా లున్నాయ్. విశాలంగా పరి శుభ్రంగా ఉన్న రెండు 'టబ్స్' – వాటి ననుసరించి సీటి పైపులు – వేడి నీటివి, చన్నీటివి ఉన్నాయ్. మీద షవర్ బాత్ పైపులు ఉన్నాయ్.

స్నానం పూర్తి అయింది. వేరొక బ్రాకెట్ మీద – కాలికోగ్లాస్ మల్లె పంచలూ, పట్టుబంగీలూ, చారల పైజమాలూ, వేలాడుతున్నాయ్. వాటిలో – కంటికి కొ స్త చవక బారులా కనిపిస్తున్న ఒక పైజమా తీసి వేసుకు న్నాను. బయట కొచ్చేసరికి నౌకరు నిల్చుని ఉన్నాడు. న న్ను 'డ్రెస్సింగ్ రూమ్'కు తీసుకుపోయాడు అక్కడ గోడలు కనిపించలేదు. దిగువనుంచి

మీదవఱకూ అన్నీ నిలువుటద్దాలే. ఒక పెద్దటేబిలు మీద వివిధ శృంగార సామగ్రి ఉంది. నేను తయారై బయట పడేసరికి రాజా బహద్దరుగారు లాన్‌లో కుర్చీలో కూచుని 'మైనిలా' చుట్ట తాగుతున్నారు. నన్ను చూడగానే కమాన్ మిస్టర్ ! టీ యీజ్ రెడీ!" అన్నారు.

అక్కడ ఉన్న సామానులు వర్ణన చేయకుండా ఉండడమే మంచిదేమో? టీ, కాఫీ, కోకో, ఓవల్టిన్, హార్లిక్స్... బ్రెడ్, కేక్, బిస్కట్లు, వెన్న, చనా, గుడ్లు...పదిరకాలైన ఫలజాతుల ముక్కలు. కప్ సాసర్లలోనూ, వెండి పళ్ళెరాల్లోనూ అమర్చి ఉన్నాయ్!... ఆదివరకే సతాయిస్తున్న ఆకలి ఆ వస్తువుల్ని చూసేసరికి ద్విగుణీకృతమైంది. అందువల్ల ఎదుటకు వచ్చిన వన్నిటినీ స్వహా చేయ నారంభించాను. రాజా బహద్దరుగారు మాత్రం రెండు బ్రెడ్ స్లయిసులూ, ఉడికించిన మూడు కోడి గుడ్లూ, నాలుగు పండ్లముక్కలూ ఆరగించారు. టీ మాత్రం మూడు పెద్ద కప్పులు త్రాగారు.

"బయట కొకసారి చూడండి —" అన్నారు రాజాబహద్దరు.

టీ టిఫిన్లు అప్పటికి పూర్తయిందేమో, సావగాశంగా బయటకు చూశాను. వాస్తవానికి ప్రకృతి హద్దు మీరిన సౌందర్యంతో శోభిస్తూన్నది! బంగళాచుట్టూ కట్టిన ముండ్లతీగల ఫెన్సింగ్ బయటప్రదేశం ఏటవాలుగా ఉంది. ఆ అడవినేల సమతలానికి, బంగళా గోడలమట్టం, నాలుగు వందల అడుగుల ఎత్తులో ఉంది. అందువల్ల ఆ బంగళా రోదసిలో ఉయ్యాల్లా ఊగుతున్న దేమో అనిపిస్తుంది! దిగువ ఘనీభూతమైన మహారణ్యం! ఒక పక్క నీలంగా పాముమెలికల్లా పారుతున్న కొండవాగు! అడవి సీమాంతంలో పహరా తిరుగుతున్నట్లు పర్వత పంక్తులు!

"బహు రమ్యంగా ఉంది —" అన్నాను సంతృప్తిగా నిట్టూరుస్తూ.

"రైట్! తమది కవిదృష్టి! తప్పక రమ్యంగా ఉంటుంది. ఈ ప్రదేశాన్ని గమనిస్తూంటే నాలోకూడా అప్పుడప్పుడూ ఏవేవో పిచ్చిపిచ్చి కవిత్వపు టూహలు పుట్టుకొస్తుంటాయ్!... చూడండి! ఆ లోయఉందే — మహా 'డ్రెడ్‌ఫుల్'...లోకంలో లేని 'ఫెరోషియస్' జంతువులు స్వేచ్ఛావిహారాలు చేస్తుంటాయ్!" అన్నారు రాజా బహద్దర్.

ఈసారి నేనటు భీత దృష్టితో చూశాను. నిజమే! మహా భయంకర స్థలాల్లో ఒకటి! ఐనా — యీ బంగళాలో — సురక్షిత ప్రదేశంలో ఉంటూ అంతగా బయపడాల్సిన అవసరం లేదు!...అడవి నుంచి, నాలుగువందల అడుగుల ఎత్తులో ఉంది బంగళా

చుట్టూ పెద్ద కందకం. నాలుగుపక్కలా తొమ్మిది పదడుగుల పొడవున-చక్కని ముండ్లతీగల ఫెన్సింగ్.

ఆ లోయవైపు చూపిస్తూ "ఆ ప్రాంతాల్లో వేటాడతారా? అని ప్రశ్నించాను. రాజాబహద్దరు నవ్వి "ఆ ప్రాంతంలో వేటాడ్డంవా? ఇంత వరకూ- ఆ వేపు - ఏ వేటగాని రైఫిలుగుండూ పోయిన పాపాన పోలేదు! చూస్తున్నారుగా వెనకగా ఉన్న ఆ పర్వతం? అది దాటుకు వెళ్ళడం — 'ఇంపాసిబుల్'! ఆఁ! వేటమాట అటుంచి ... అక్కణ్ణుంచి వస్తూ, యీ బంగళాపక్కగా పోతున్న వాగులో...అప్పుటప్పుటా చేపలు పడుతూఉంటాను —" అన్నారు.

"చేపలు...మీరు...పడతారా? ఆశ్చర్యంతో ప్రశ్నించాను.

"ఆఁ!... చేపల్లాంటివే!... ఒకటి రెండురోజుల్లో తెలుసుకుంటారు. ప్రస్తుతం జంతువులవేట, అనుకొంటున్నాం! అవి లభించకపోతే...చేపలు! ఐతే — మంచి ఎర లేనిది ఆ చేపలు పట్టడం — నాకిష్టపడదు! అసలు ఆనందమూ, ఆసక్తి కలగదు. కాని-అందులో చాలప్రమాదం ఉంది" అన్నారు.

"తమ రేమిటి చెబుతున్నారో...బోధపడలేదు" — సంకోచంగా అన్నాను.

రాజాబహద్దరు నవ్వి ఊరుకున్నారు. కొద్దిక్షణాల తరవాత "తమకు రైఫిలు, తుపాకీ ప్రయోగాలు తెలుసా?" అని ప్రశ్నించారు. ప్రసంగం మార్చాలని యీ ప్రశ్న వేసిఉంటారు.

"చిన్నతనంలో 'ఎయిర్‌గన్' ప్రయోగించేవాణ్ణి!" అని జవాబిచ్చాను. అతను మళ్ళీ నవ్వి అన్నారు -

"ఔను! తమబోటివారి కీ 'వెపన్స్' తో ఏం పని? తమ చేతుల్లో 'కలం' శోభించినట్టు యివి శోభించవు!... నేను పన్నెండోఏటనే రైఫిల్ ప్రయోగించేవాణ్ణి?..." అంటూ చటుకున లేచి బంగళాలోకి వెళ్ళిపోయారు.

నేనుకూడాలేచి ఒకపక్కగా వెళ్లాను. అక్కడ చిన్న కాటేజీ కనిపించింది. అందులో రకరకాలైన ఆయుధాలు వేలాడదీసిఉన్నాయ్! ఒకమూల నాలుగు రైఫిల్లున్నాయ్! ఒక కొయ్యకు రెండు రివాల్వర్లు చర్మపు కేసుల్లో వేలాడుతున్నాయ్. దానికి సమీపంలో ఒక 'షెఫీల్డ్' కత్తి పొడవైనదీ, బరువైనదీ ఉన్నది. దళసరిచర్మపు బెల్టుల్లో రైఫిలుగుండ్లూ, రివాల్వరుగుండ్లూ వరసగా అమర్చి ఉన్నాయ్. ఇంకో మూల - జరీతో చేసిన ఒరల్లో నేపాళీ భుజాలీలు- నాలుగు వేలాడుతున్నాయ్!... గోడల మీద లేడితలలూ, ఎలుగుబంట్ల తలలూ, పులిబుర్రలూ - ఇంకా దుప్పి, కణుసు, లేడి, ఎలుగు, పులి, కొండచిలువల చర్మాలూ ఉన్నాయ్. ఒక టేబులుమీద ఏనుగుతల - తొండమూ, దంతాల్తో సహా - అలంకరింపబడిఉంది. అంతా



"నేను కాదు నాన్నా...ఈ కుక్కే కాలుస్తూంట..."

చూస్తుంటే ఒక 'నేచురల్' మ్యూజియం లా కనిపిస్తున్నది!! చెప్పుకోవాల్సొస్తే-యిదంతా రాజాబహద్దరువారి కీర్తికి నిదర్శనం!!!

నేను వాటిని చూస్తుండగా రాజా బహద్దరువారు వచ్చి—"పదండి: 'లెటజ్ హేవ్ సమ్ ఎనర్జీ' (కాస్త హుషారు చేసుకుందాం)" అన్నారు.

గంటక్రితం చేసిన టిఫిను యింకా జీర్ణ ముఖానికి రాలేదు. 'ఇప్పుడు మరేమీ వద్దు—' అని చెబుదామనుకుంటూండగా, తను ముందుకు సాగిపోయారు; నేనూ అతణ్ణి అనుసరించక తప్పిందికాదు.

బయట - పడమర భాగంలో, దీర్ఘ చతురస్రాకారంలో ఒక 'లాన్' ఉంది. వివిధ రకాలైన స్వదేశీ, విదేశీ పూల మొక్కలు సిమెంటు తొట్లల్లో శోభిస్తున్నాయ్! మూడు నాల్గు చోట్ల 'వాటర్ ఫౌంటెన్స్' నుంచి సన్న ధారల్లో నీరు విరజిమ్మబడుతూ ఉంది! లాన్ మధ్య పేపబెత్తం కుర్చీలూ, పొడవాటి-మహాగనీకఱ్ఱ టేబిలూ ఉన్నాయ్! నే నక్కడకు చేరుకొనేసరికి, రాజాబహద్దరు అప్పుడే ఒకకుర్చీలో ఆసీనులై ఉన్నారు. 'ట్రే' లో-నురగలు కక్కుతూన్న పానీయాల గ్లాసుల్తో 'బోయ్' నిల్చుని ఉన్నాడు. ఆ ప్రదేశమంతా ఆ పానీయాల ఘాటువాసనతో నిండిపోయింది!

మందస్మితంతో "ఏమైనా పుచ్చుకుంటారా?" అని అతను ప్రశ్నించాడు.

మెల్లగా "థేంక్స్! ... ఒద్దు" అన్నాను.

"బీరు తీసుకోండి! చాల నెమ్మదైన సరుకు. ఆడవాళ్ళ డ్రింక్" అన్నారు.

"నో సర్!...ఎప్పుడూ తాగలేదు_" వినయంగా జవాబిచ్చాను.

"పూర్ క్రీచర్ !... నేను పద్నాల్గో ఏటనుంచే 'డ్రింక్' ఆరంభించాను!" అన్నారు పెదవులమీద అనుకంపన హాస్యాన్ని తెచ్చుకుంటూ !

నే నేజవాబూ యివ్వలేదు, 'బాయ్'_ట్రే తిప్పుతునే ఉన్నాడు. రాజాబహద్దరు గ్లాసు తీసుకుంటూ 'గట_గట' లాడించి వేస్తునే ఉన్నారు! అతని చూపులు క్రమక్రమంగా మందగించి పోతు న్న ట్లు గ్రహించాను.

"అచ్చా! తమ రేకారణంవల్ల 'రాజా' కాలేకపోయారో చెప్పగలరా? అని ప్రశ్నించా రతను హటాత్తుగా.

అనుకోనటువంటి ప్రశ్నకు జవాబివ్వ లేక. మొద్దుదద్దమ్మ లెలా పండ్లు బయట పెట్టి యికిలిస్తారో, నేనూ అలానే యికిలించాను.

"చె ప్ప లే రు క దూ?" రె ట్టిం చి ప్రశ్నించా రతను.

"చిత్తం!..." మెల్లగా జవాబిచ్చాను.

"తమరు ... మనుష్యుల్ని ... చంప గలరా?" మరీ అద్భుతమైన ప్రశ్న వేశారు.

అరే?.. ఇదేంప్రశ్న?.. నేను కంగా రెత్తిపోయాను. నా వాలకం గమనించి, స్వరంతగ్గించి "తమరు జవాబివ్వలేరు!... నాకుతెలుసు!... యూ ఆర్ ఏబ్సెల్యూట్లీ హోప్లెస్!" అంటూ లేచి, అంగలు చాచుకుంటూ బెడ్‌రూమ్ వేపు వెళ్ళి పోయారు.

నిషా తీవ్రంగా తలకెక్కి ఉంటుం దని గ్రహించాను. కించ త్తవ్యతా విమూఢ త్వంతో అక్కడే కూచుండిపోయాను. కాసేపట్లో గదినుంచి పెద్దపెట్టున 'గుఱ్ఱు' వినవచ్చింది! వెళ్ళి చూశాను. రాజా బహద్దరుగారు గాఢనిద్రలో ఉన్నారు! నోటిదగ్గఱ ఈగలు 'జుంమ్మ' ని నాట్య మాడుతున్నాయ్ !

* * *

ఆ రాత్రి వేటకు బయల్దేరాం! అడ విలో మా మోటారు మెల్ల మెల్లగా పోతు న్నది. 'హెడ్‌లైట్ల' తీవ్రమైనకాంతి ఎదురుగాఉన్న సంకీర్ణ మార్గంమీదా, పరి సరాల్లోని చెట్లమీదాపడుతున్నది. ఆవెలుగు కావల వనభాగం ప్రేతపురి ఏమోఅన్నట్టు గ భీ ర ం గా, భయంకరంగా కనిపి స్తున్నది! ... ప ర్వ త ప్రాంతంలో ఏనుగుల సమూహం స్వైర విహారం చేస్తూ ఉండొచ్చు! ... వి శా ల మై న అగాధాల్లో - కొండచిలువలు - లేళ్ళనో దుప్పులనో కణుసులనో మింగి, చుట్టలు చుట్టుకొని నిద్రిస్తూ ఉండొచ్చు! ... నిలువులకొద్దీ పెరిగిన చిక్కని రెల్లుపొద ల్లోనూ, కొండగుహల్లోనూ చిఱుతలూ, పులులూ ని టా రు న నిల్చొని, దీర్ఘ వాలాల్ని తాడిస్తూ, నోళ్ళు తెరుచుకొని

ఆవు లిస్తూ ఉండొచ్చు! ... ఎలుగు గొడ్లూ, ఏదుపందులూ ఆహారం కోసం పుట్టలూ, పొదలూ వెదుకుతూ ఉండొచ్చు! ... తక్కిన సాధు జంతువులు ప్రాణాలు బిగబట్టుకొని సురక్షిత ప్రదేశాలకోసం చెల్లాచెదురుగా తిరుగుతూ ఉండొచ్చు.

భయంతోనూ, రోమాంచితంతోనూ నేను మోటారులో ఒదిగి కూచున్నాను. రాజాబహద్దరు ఇంజను సమీపంలో, రైఫిలు పట్టుకొని తీవ్రంగా నాలుగు వేపులా చూస్తున్నారు. ఎక్కడా ఒక పిట్టపురుగు కనిపించలేదు. ఆపూట మేము వెళ్తూన్న ప్రాంతం ప్రాణశూన్యంగా వున్నట్టుంది! రాజాబహద్దరు చేతిరేడియం డైలువాచీముల్లు ఒంటిగంటన్నర సూచిస్తున్నది!

"రాత్రి వృధాగా పోయింది!... డేమ్ ఇల్లక్!" అన్నా రతను విరక్తిగా.

సీటుకు సమీపంలోని 'ప్లాస్క్' తీసి, మూత విప్పి, అందులోని ద్రవపదార్ధాన్ని గొంతులో దిగజార్చుకున్నారు. విస్కీ తీవ్రవాసన బండినంతా అలుముకుంది.

"థాంక్ గాడ్!" అంటూ అతను సర్దుకొనికూచున్నారు. విద్యుద్దీపాలకాంతిలో, రోడ్డుమీద ఏదో జంతువు నిల్చుని, ఆ దీపాలవేపు చూస్తున్నది. దానికండ్లు గుడ్డిదీపాల్లా మినుకు మినుకు మంటున్నాయ్. "ఎర్రసిందువు –" జంతువును పోల్చి డ్రైవరన్నాడు.

"డేమ్ –" అంటూ రాజాబహద్దరు ట్రిగర్‌నుంచి వ్రేలు తీసేశారు. కాని మరుక్షణంలోన్నే "ఇవాళ... ఏదవనీ... వేటాడి తీరుతాను –" అంటూ తిరిగి రైఫిలు లక్ష్యం చేశారు. రైఫిలుగర్జనా, మందుగుండు కంపూ మోటారంతా వ్యాపించింది!

"దాన్ని తెచ్చిమ్మా న్నారా?" డ్రైవరు ప్రశ్నించాడు.

"యూ స్లెస్!... బండి బంగ్లాకు పోనీయ్" అన్నా రతను.

* * *

అదేంచిత్రమో – వరసగా మూడు రాత్రులూ, ఆ మహారణ్యం చెప్పుకోతగ్గ ఒక నవ్యమృగం మాకు ప్రదానం చెయ్యలేపోయింది. దినభత్యానికి మాత్రం ఒక దుప్పీ, రెండు మేకపోతులూ లభించాయ్.

రాజాబహద్దరు 'మైనిలా' చుట్టకాలుస్తూ, నిరుత్సాహంతో గదిలో పచార్లు చేస్తున్నారు. అతని ఆకృతిలో ఆక్రోశమూ, పెదవులమీద కఠిన నిష్ఠురతా తొంగిచూస్తున్నాయ్. ఒక్కొక్కసారి రైఫిల్ ఎత్తిపట్టి, తిరిగి యథాస్థానంలో ఉంచివేస్తున్నారు. నేపాళీ భుజాలీని వేళ్ళతో పదునుచూస్తూ, మళ్ళీ పెట్టివేస్తున్నారు!... రెండుచేతులూ వెనక్కు

కట్టుకొని, ఆ భయంకరాటవి వేపు గంభీరంగా చూస్తున్నారు.

బట య వ రం డా కు వచ్చి "బోయ్!... పెగ్" అని కేకవేశాడు. నాకుమాత్రం యిక అక్కడ ఉండడానికి మనస్కరించలేదు. బయట వారి ధనం మీదా, భోగ విలాసాలమీదా, రాజోచిత మర్యాదలమీదా ఎన్నాళ్ళు చలాయించదము? రాజాబహద్దరు అనుగ్రహం ఉందని ఎంతకాలం నిశ్చింతగా విందు చేస్తూ కూ చుం టా ను? అవతల కలకత్తాలో ఉద్యోగమూ, సంసారమూ, మంచీ, చెడూ చూసుకోవద్దూ?

నాల్గోనాటి ఉదయం "ఇక శెల విప్పించండి!" అన్నాను వినయంగా. అప్పుడే అతను 'బోయ్' యిచ్చిన 'పెగ్గులు' స్వీకరిస్తున్నారు. అది నాల్గో 'పెగ్'! దాన్ని గళం కిందకు దిగజార్చి గొంతు సవరించుకొని "తమరు... వెళ్ళిపో... తలుస్తున్నారా?" అని ప్రశ్నించారు.

"చిత్తం!... కాస్త జరూరు పను లున్నాయ్!" జవా బిచ్చాను.

"కాని... తమకు... నా వేట... ఇంకా 'ఎగ్జిబిట్' చేయనేలేదే?"

"మరొకప్పుడు _"

"హుం!... బహుశా తమరు _ అనుకుంటూ ఉండొచ్చు... ఈ రైఫిల్సూ, రివాల్వర్లూ, జంతువుల త ల లూ, చర్మాలూ, అన్నీ ఒక 'ఫార్స్' అని?" పెదవులు బిగించి, గుర్రుమనే స్వరంతో అన్నారు.

"లేదు... లేదు! ఎంతమాట శెల విచ్చారు? ఈ బెంగాలులో తమబోటి గొప్ప 'హంటర్' లేరని వేనోళ్ళతో ప్రజలు చెప్పుకుంటున్నారు! నాలాంటి అనామకుణ్ణి ఎలా మరోలా భావిస్తాను?... ఐనా తమ 'పొజిషన్'కు తగిన వన్యమృగం లభించకపోతే ఏం చేస్తారు?" అన్నాను దృఢస్వరంతో.

"సరే!... తమ రొకసారి నాతో దయచేయండి!" అంటూ అతను బంగళా వెనక్కు తీసుకుపోయారు. సరిగ్గా అదేస్థలం! నాలుగువందం అడుగులదిగువ పెద్దలోయ, దా న్ననుసరించి రెండు వైపులా మహారణ్యం! ఐతే _ యింకోవిశేషం అక్కడ చూపట్టింది!... పదిహేను _ పదహారు మూరల పొడవులో, ఐదారడుగుల వెడల్పులో, రెండుపక్కలా 'రేలింగ్' తో చిన్న వంతెనలాంటిది, శూన్యంలో వేలాడుతున్నది! దానికి అవతల _ చివర _ రెండుచక్రాలు _ పెద్దపెద్ద బావులమీద ఉండేలాంటివి _ ఉన్నాయ్! ఆ చక్రాలకు బలమైన తాళ్ళతో కట్టిన _ రెండు ఇనప 'హుక్కులు' ఉన్నాయ్! ఆ సరంజామా అంతా దేనికోసమో _ తెలుసుకోలేకపోయాను!

"కమాన్... దిస్ వే!" అంటూ రాజాబహద్దరు ఆ వంతెనమీదకు వెళ్ళి

నిల్చున్నారు. నేనూ అతని వెనక వెనగ్గా వెళ్ళి నిల్చున్నాను. ఆ వంతెన దిగువ, నాలుగువందల అడుగుల లోతున – రేఖా మాత్రంగా కనిపిస్తున్న వాగూ, దానికి రెండుప్రక్కలా కీకారణ్యమూ కనిపిస్తున్నది! ఆ వంతెన నుంచి వాగువేపు చూస్తుంటే కండ్లూ, తలా గిర్రున తిరిగిపోయాయ్!

"ఇదంతా ఏమిటో బోధపడిందా?" అతను ప్రశ్నించారు.

"ఉఁ హూఁ!" తల అడ్డంగా త్రిప్పి క్లుప్తంగా జవాబిచ్చాను.

"నేనుపట్టబోయేచేపకు.. ...తయారీ! ఇది...చాల రహస్యంగా... చేయాల్సి వస్తుంది! ఎందుకంటే...? మోస్ట్ డేంజరస్!"

"ఐ యామ్...సారీ సర్!... నాకేంపీ బోధపడలేదు" అన్నాను కండ్లు వెళ్ళబెడుతూ!

"ఆఫ్‌కోర్స్!...కాని...దిస్‌నైట్, ఈరాత్రి అంతాబోధపడుతుంది! ఈ వేట చూడ్డానికే తమర్ని రప్పించాను! ఇదేదో తమాషాగా అంటున్నాననుకోగలరు!... యూవిల్ సీ దిస్‌నైట్; ... ఐతే ఒక సంగతి!... దిసీజ్...మోస్ట్ కాన్ఫి



డెన్షియల్ !...అం...పరమ రహస్యం ఎప్పుడూ, ఎక్కడా, ఎవరితోనూ వివరించకూడదు !..." అన్నారు దృఢ స్వరంతో.

"చిత్రం !" అన్నాను అంతా అయోమయంగా ఉన్నా.

"అసలు రాత్రి గడిస్తే...త మరిక్కడ మరి ఉండడానికి వీల్లేదు." అన్నారు బంగళా వేపు నడుస్తూ.

ఒక కర్రవంతెన ! రెండు చక్రాలు ! వాటికి హుక్కులు ! ఇవి...చేపను వేటాడే సామగ్రి ! ఐతే...ఈ వేట...పరమ రహస్యం ! కాగా — అపాయకరం !...రెండోకంటికి తెలియకూడదు! తెల్లవారితే ఆ స్థలంలో మరి — ఉండడానికి వీల్లేదు !...

ఏమిటో !...ప్రతిదీ నా కొక మహా సమస్యలా కనిపించింది ! ఎలా పరిష్కరించుకోవడం?... రాజాబహద్దరుగారినే అడిగితే ?—ఛ ! తప్పు తప్పు !...సభ్యతా విరుద్ధం !...ఐనా అడగడానికి సాహసం ఉండొద్దూ ! కాగా — రాత్రికి అంతా తెలుస్తుందటగా ? ... అనుకుంటూ నడుస్తున్నాను...బంగళాకు సమీపంలో ఐదారుగురు పిల్లలు ఆడుకుంటున్నారు, ఎవరో కొండజాతులకు సంబంధించిన వారిలా ఉన్నారు ;...పైగా బేవార్సుపిల్లలట ! ఎవరో కనిపారేస్తే — ఆ బంగ్లాలో ఉన్న దర్వాన్లూ, నౌకర్లూ, ఆయాలూ వాళ్ళకింత తిండి పెట్టి పెంచుతుంటారట ! రాజా బహద్దరుగారికి ఆ పిల్లలంటే ఏదో మోజు అట ! ప్రతి రోజూ, బంగళా రెండో అంతస్థునుంచి, ఆ పిల్లల మధ్యకు రొట్టెముక్కలూ, బిస్కట్లూ, పండ్లూ, మిఠాయిలూ విసురుతుంటారట. వాళ్ళు వాటికోసం కొట్లాడుతూ కేకలు వేసుకుంటూ దొరికినవన్నిటినీ తింటూ ఉంటారట !

ఇవ్వాళకూడా ఆ పిల్లలకు రాజా బహద్దరుగారి దర్శనం అవడంతో "సలాం హుజూర్ ! బ్రెడ్ సార్ ! బిస్కట్ సార్ !" అంటూ కేకలు వేశారు. అందరూ నాలుగేళ్ళకు పైబడీ ఎనిమిదేళ్ళకు లోబడీ ఉన్నారు ! రాజాబహద్దరు రెండో అంతస్తుకు వెళ్ళి అక్కడనుంచి బిస్కట్లూ, రొట్టెముక్కలూ విసిరారు ! పిల్లలు ఉరక పరుగుల్తో వెళ్ళి వాటి మీద పడి లాక్కొని తిన నారంభించారు ! తింటూ "సలామ్ సార్ ! థేంక్యూ సార్ !" అని సలాములు చేశారు. వాళ్ళను చూస్తూంటే నా కేమిటో చెప్పరాని వాత్సల్యం కలిగింది ! పాపం ! ఏ తల్లి పిల్లలో ? ఎక్కడవారలో ?... మంచి చెడుగులూ, పాప పుణ్యాలూ, దగా మోసాలూ, కుళ్ళు కుట్రలూ తెలుసుకోలేని అమాయక జీవులు !

రాత్రి 'డిన్నర్ టేబిల్' దగ్గర రాజా బహద్దరుగారితో అన్నాను.

"ఈ రాత్రి కే...చేపలవేట...". అన్నానో లేదో అతను నావేపు వక్రంగా చూశారు. పగ లంతా మధుపానం, ధూమపానం చేస్తూండడం వల్లనేమో కండ్లు చింతనిప్పుల్లా ఉన్నాయ్! నాలుక బెరడుకట్టిపోయి మాటలు స్పష్టంగా రాలేదు! కాగా, ఆ హావ భావ విలాసాలు చూస్తూంటే ఆ హృదయంలో ఏదో వాకొనరాని, అగోచర మైన అల్లకల్లోలం సతాయిస్తున్నట్టు ఉన్నది. అత నలా చూస్తూ "హాఁ!... ఈ రాత్రే!–" అన్నారు! తరవాత 'మైనిలా' చుట్ట వెలిగించి, నాలుగైదు పీల్పులు గాఢంగా పీల్చి, పొగ ఒదుల్తూ "ఇక తమరు పరుంటారు కాబోలు– వెళ్ళండి!...ఆ 'టైమ్'కు నే నొచ్చి తమర్ని...లేపుతాను!" అన్నారు. ఆ స్వరంలో కాఠిన్యంకన్నా, ఆజ్ఞాభావం ఎక్కువగా ద్యోతకమైంది! అప్పు డతను తనలో తాను లేస్తట్టుగా – కనిపించారు. వెంటనే నేను లేచి 'గుడ్‌నైట్' చెప్పి నా పడకగదికి వెళ్ళిపోయాను.

'స్ప్రింగ్' మంచమూ, నాలుగు వేపులా బాలీసులూ, తలభాగంలో మెత్తని దిండ్లూ, దోమతెరా, ప్రశాంత వాతావరణమూ – ఇన్ని హంగు లున్నా నిద్రమాత్రం రావడంలేదు! మస్తిష్కంలో వివిధాలోచనలు సుళ్ళు తిరుగుతూ పరిభ్రమిస్తున్నాయ్!... కండ్ల ఎదట క్రరవంతెనా, చక్రాలూ, హుక్కులూ, తాళ్ళూ, దిగువ అగాధ మైన లోయా, అందులో సెలయేరూ, వాటిప్రక్కల మహారణ్యమూ...అక్కడ రాజాబహద్దరుగారి చేపలవేటా – అంతా పెద్దవిషవలయంలా తాండవిస్తున్నది! మంచంమీద దొర్లుతూ దొర్లుతూ ఎప్పుడు నిద్రపోయానో తెలియదు, చల్లని హస్త స్పర్శతో త్రుళ్ళిపడిలేచాను!...అప్పుడు 'టైము' ఎంతయి వుంటుందో!... కిటికీబయట – వేలాది మిణుగురుపురుగులు స్వేచ్ఛావిహారం చేస్తున్నాయ్!... దూరంనుంచి కీచురాళ్ళధ్వనులు వికృత రాగాలాపనల్లా వినిపిస్తున్నాయ్.

మంచుముక్కల్లాంటి ఆ హస్తస్పర్శ రాజాబహద్దరుగారిది!

"పదండి!... టైమైంది –" అన్నా డతను

నే నేదో మాటాడ బోయేసరికి అతను పెదవులమీద వేళ్ళుంచి "ఉష్!... మాటాడక పదండి –" అన్నారు.

ఆ గంభీర నిశీథంలో ఆ నిశ్శబ్ద ఆహ్వానమూ, కాబోయే వేటా, దాని కార్యకలాపమూ – అంతా రోమాంచితమైన, భయంకర డిటెక్టివునవల ఉపక్రమణికలా చూపట్టింది! ఏదో అజ్ఞాన భయంతోనూ, అపరిష్కృత సమస్యల తోనూ నా శరీరం ప్రకంపించి పోతున్నది. ఐనా – మంత్రబద్ధ మైపోయి

నట్లు, రాజాబహద్దరుగారి మాటకులోనై అతని వెనువెనుక నడచుకుపోయాను.

బేటరీలైటు కాంతిలో త్రోవ చూపిస్తూ అతను నన్ను ఆ కర్రవంతెన దగ్గరకు తీసుకుపోయారు! అక్కడ వేటకు అంతా అమరిఉంది! రెండు కుర్చీలూ, వాటి ప్రక్క గుండ్లతో నిండిన రైఫిల్లూ ఉన్నాయ్. ఇద్దరు నౌకర్లు, ఆ హుక్కులకు పెద్ద పొట్లంలాంటిది తగిలించి ఆ చక్రాలమీదుగా నదిలోకి దించుతున్నారు. రాజాబహద్దరు చేతిలోని తొమ్మిది షెల్లుల బేటరీలైటు స్విచ్ నొక్కి ఆ కాంతిని దిగువకు పోనిస్తున్నారు. అప్పుడప్పుడు ఆ పొట్లం జీవం ఉన్నదానిలా కదుల్తూ నింపాదిగా దిగుతున్నది.

"అదేమిటండీ...ఆ పొట్లం?" నేను మెల్లగా ప్రశ్నించాను.

"ఎర—" రాజాబహద్దరు క్లుప్తంగా గంభీరంగా జవాబిచ్చారు.

"ఎరా?...దేనికి?"

"చేపకు—"

ఐతే...ఆ ఎర...ఏమిటి... కదుల్తూ—". మధ్యలోనే—" కాసేపట్లో తెలుస్తుంది!...ఇప్పు డేమీ ప్రశ్నించవద్దు—"అదే గంభీరస్వరంతో అన్నారు. ఐతే—ఆ స్వరంలో గాంభీర్యమేకాకుండా ఒక విధమైన బెదిరింపుకూడా ఉన్నట్టు ద్యోతక మైంది. అతని నోటినుంచి విస్కీఘాటువాసన గుప్పుగుప్పున వస్తున్నది! ఆ సమయంలో అతను—తెంపరితనంతో యుద్ధానికి బయలుదేరిన మహాయోధునిలా ఉన్నారు! ఇక నేను — జరుగుతున్న దేమిటో లవలేశమైనా బోధపర్చుకోలేక సతమతమవుతున్నాను. తలా తోకా లేని నాటకం చూస్తూన్న ప్రేక్షకునిలా, అతని పక్కను, కుర్చీలో కూచొని ఉన్నాను.

ఆకాశంలో అల్లుకున్న చిక్కనిచీకటి చీల్చుకుంటూ చంద్రరేఖ బయటకు వచ్చింది. దాన్నుంచి వస్తున్న అస్పష్ట కాంతి దిగువ నదిమీదా, పక్కలనున్న బండరాళ్ళమీదా పడుతున్నది! కాసేపటికి ఆ లోయలోని దృశ్యం స్పష్టంగా గోచరించింది. హుక్కులకు తగిలించిన పొట్లం నది ఒడ్డుకు, ఇసుకతిన్నె మీద చేరుకుంది! అదికాస్త ఎక్కువగా కదల నారంభించింది! రాజాబహద్దరు ఒక చేతితో రైఫిలు సంధానించి పట్టుకున్నారు! రెండో చేతితో టార్చి వెలుగు ఆ పొట్లంమీద వేస్తున్నారు.

ప్రతీక్షతోనూ, స్తబ్ధతతోనూ నిమిషాలూ, గంటలూ గడిచిపోతున్నవి! రాజాబహద్దరుగారి టార్చి - వెలుగుతూండడం, ఆరిపోతూండడం అయి ఉంది. రేడియం డైలులోని వాచీ ముళ్ళు అవిరామంగా నడుస్తున్నవి. నా కేదో

మాయ కమ్ముకుంటున్నట్లు, దాని ప్రభావంవల్ల మత్తు ముంచుకువస్తున్నట్లు అనుభవిస్తున్నాను!

అంతలో - హటాత్తుగా రైఫిలు శబ్దించడమూ, వెనువెంటనే - నాలుగు వందల అడుగుల దిగువ పెద్దపులి కాంద్రించడమూ ఒకే క్షణంలో నా చెవుల్లో పడ్డవి! కుర్చీ సహితంగా నేను గజగజ లాడిపోయాను!

టార్చి వెలుతురు నది ఒడ్డునున్న రాళ్ళ మీద పడ్డది! ఆ వెలుతురులో విశాల కాయంతో ఒక బెబ్బులీ, దాని పంజాల మధ్య ప్రచలిస్తున్న ఆ పొట్లమూ స్పష్టంగా చూశాను! ఆ పులి దీర్ఘవాలం - చచ్చిన పాముతోక ఆడుతూన్నట్టు - యింకా ఆడుతూనే ఉంది! మీదనుంచి - వజ్రాయుధం పడ్డట్టు - ఆ రైఫిలు గుండు ఆ పులి తలమీదపడి భేదించుకుంటూ పోయిఉంటుంది! అంత ఎత్తునుంచి, అంత హటాత్తుగామృత్యువు అలా వచ్చి పడుతుందని ఆ కరాళ వ్యాఘ్రం తలపోసి ఉండకపోవచ్చు నేమో? - పాపం!

రాజాబహద్దరుగారు అత్యంతోత్సాహంతో "వెల్‌డన్" అని కేక వేశారు! అప్పుడు తెలుసుకున్నాను. ఆ చేప ఏమిటో - దాన్నెలా వేటాడేరో!

"చేపను పట్టుకున్నారు!—కాని అది మీద కెలా వస్తుంది?" అన్నాను కౌతుకంతో!

"ఆ హుక్కులతోనే వస్తుంది!... అంతా 'ఆటోమేటిక్ ఎరేంజ్‌మెంట్-'" అన్నా రతను ఆనందంతో!

రాజాబహద్దరుగారి విచిత్రపు వేటను అభినందించుదామని నోరు విప్పేటంతలో - నా చెవులకు - మానవ శిశు ఆక్రందనం వినవచ్చింది! అది, ఆ ఆక్రందనం క్షీణంగా ఉన్నప్పటికీ, అతి స్పష్టంగా వినవస్తున్నది!...సందేహం లేదు!...మానవ శిశురోదనమే! అది... వంతెన దిగువనుంచి - నాలుగు వందల అడుగుల దిగువనుంచి వస్తున్నది.

నాలో ఎక్కడలేని ఆవేశమూ ముంచుకొచ్చింది! పిచ్చివాడిలా - "ఇదేనా ఎర? ఎలాంటి ఎర? ... ఆ చేప - అంటే - పెద్దపులి...దాన్ని చంపడానికి తమరు వేసిన ఎర - ఏమిటి?" అన్నాను.

"షటప్!" రాజాబహద్దరు గారు గర్జించి రివాల్వరు నా గుండెలమీద ఆనించారు! దాంతో నేనూ, నేను కూర్చున్న కుర్చీ, ఆ కర్ర వంతెనా, ఆ యడవీ - సమస్తమూ బొంగరంలా తిరిగిపోతున్నట్టయింది! రాజాబహద్దరుగారు వెంటనే నన్ను తమ సందిట్లో బంధించనట్లయితే ఆ క్షణంలో నేను - ఆ లోయలో - నాలుగు వందల అడుగుల దిగువనున్న ఆ అగాధంలో, ఆ

బండరాళ్ళమీద పడి ఏమైపోయి ఉండేవాణ్ణో ?

* * *

ఒక దర్వాను చేరదీసిన బేవార్సు మానవ జీవం ఈ మహారణ్యంలో అప్రమైపోయిందని మర్నాడు తెలిస్తే – దాన్ని ఒక వింత విషయంగా తీసుకోవాల్సిన అవసరం ఎవరికీ లేదు : కాని – అదే రోజున – రాజాబహద్దరు ఎన్. ఆర్. చౌదరీ మహాశయులు – ఒక 'రాయల్ బెంగాల్ టైగర్'ను – ఒకే రైఫిలు గుండుతో చంపారన్న వార్త – దేశం నాలుగుమూలలా ప్రాకి ప్రజల్ని ఆశ్చర్యంలో ముంచివేసిఉంటుంది :

* * *

ఎనిమిది నెలల క్రితం జరిగిన వేట అది : ... ఈ వేళ – బహు సుందరంగా, ఆకర్షణీయంగా ఉన్న యీ జత చెప్పులు – సరికొత్త వి – పులి చర్మంతో తయారు చేసినవి – బహుమానంగా వచ్చాయ్ : వెంటనే తొడిగాను : ... కొద్ది దూరం నడిచాను : ... ఎంతో మృదువుగా – సున్నితంగా ఉన్నాయ్ : కాని – ఆ భయంకర స్థలం ... ఆ భీభత్స దృశ్యం ... అబ్బా : ......



# కామోన్మత్తుడు

పవలు రేల వాకిళులకు వన్నెల
తెర లిరు సంజలు, ఎవ రున్నారు
గదిలో మదిలో ఎవరూ లేరు
ఎవరూ లేరు — ఎవరూ రారు.
గగనధమనుల నపుంసక హింసను
సహియించే ఊషర విఫలాచల
ఖేదం మోదంలేని క్రతువు అది
విసిగిన నేను కావలిని వెలుపల
ఈ దినచర్యకు అర్థం ఏమీ?
ఆ అర్థానికి ఎవ్వరు హామీ?
గత శైశవ మరకతనందనమున
దయగల చేయూతను గొని నడచిన
వేళల ఏదో స్ఫురియించేదీ.
అర్థం ఉన్న ట్లనిపించేదీ
తృణదళముల అమలిన హిమకణములు
ప్రణమితతరుమర్మరలాలనములు
వ్రణవిక్షతములు కాని చరణములు
ప్రాణం పోసే బాలానిలముల
ఏదో లీలగ స్ఫురియించేదీ.
ఆ మాయాకాంచనమృగ మేదీ?
ఈ దాహం దహియించని హృదయము
ఈ నెత్తురు చవిచూడని పెదవులు
పీడకలలుగా మారని వాంఛలు
వెదకలేదు ఆనాడు పవిత్రత
చిరునగవుల పరిశుద్ధపు మిత్రత
సామాన్యపు సంతృప్తి చాలు నని
రే బవళుల ఊరేగింపును గని
సంతసించు గుంపున నే నొకడిని
నా వెన్నున కన్నార్పని ప్రేతము
ఏ అదృశ్య శక్తికి విక్రీతము
పూవు చిదిమి నెత్తావి వెదుకమని
ఒడలికడలి కావల సంజీవిని
పొడమే చల్లని దీవి వెదుకమని
చెవిలో గుసగుసలాడే ప్రేతము
ఏ రహస్యశక్తికి సంకేతము?
తనువుల సికతను కనకవీచికల
గికురించే ఆ మృగమరీచికలు
మోహావాహమా? స్నేహదాహమా
నా పిపాసకే ప్రతిభాసము అది
నా దురాశపై పరిహాసము అది.
ఆ గుండియను చెండి ఆ కండల
ఇసుకలోని స్నేహం పిండాలని
ఆ ఎముకలు భగ్గున మండాలని
నా కసి ఆ మసిలో నిండాలని
ఉంది కాని, అచ్చట ఏమున్నది
నే చెరచిన రమ్యత ఏమైనది?
నేను తిరుగబడి ఫల మేమున్నది
నయనవాపికల నిండిన త్రాసము
తనువున మరణపు శైత్యావాసము
పిడికెడు బూడిద వడకెడు ఊపిరి
నా దాహపు తరగల గీసిన గిరి.
ఒక్కక్షణం చూచాను మృత్యువును.
మృత్యువులో జీవితరహస్యమును.

బైరాగి




రెండు మూడేళ్ళనించీ యెక్కడికో విశ్రాంతికి ఒక నెలరోజులు పోవామని రామారావు కోరుకుంటున్నాడు; గానీ యీనాటికి వీలుపడలేదు. వేకువ ఝామున లేచినది మొదలు రాత్రి నిద్దరపోయేవరకూ తీరుబడిలేని పనులు. ఆతనిని వెతుక్కుంటూ సమస్యలు వచ్చిపడుతున్నయ్. పదుగురిలో అతని పేరు ఒక యువనాయకునిగా బాగా చలామణీ అవుతోంది. చదువూ, సంస్కారం, డబ్బూ, యే విషయం మీదైనా వుపన్యసించగల తాహతు అతని భవిష్యత్తు గురించి చాటి చెప్పుతున్నాయి.

కోరుకున్న విశ్రాంతి తీసుకునే సమయం చిక్కకపోవటంతో విశ్రాంతి అసలు అవసరమా అన్న ఒక ప్రశ్న వుదయించింది. తను తనకోసమే కాకుండా ప్రజలకోసం చెయ్యవలసిందెంతో వుంది. తను తండ్రి గడించిన బట్టలమిల్లు, సిమెంటు ఫ్యాక్టరీల్లో భాగస్వామియైనా లోకంకోసం పాటుపడేవారి జాబితాలో పడిపోయాడు. ఒకనాటి నడిరాత్రి యేదో ఒక కలగని

చప్పున తెలివొచ్చింది. మళ్ళీ నిద్దర పట్టిన కొద్ది క్షణాల్లో ప్రశాంతంగా ఆలోచించగలిగాడు. ఇలా రోజూ ఆలోచించగలిగితే యెంతో బాగుండేదనుకున్నాడు. అలా ఆలోచించటం యీ పట్టణంలో, యీ బాధ్యతలతో, యీ రణగొణ ధ్వనులలో సాధ్యంకాదు. తను ఆలోచించి యే పనీ చెయ్యలేదనీ జీవితం అంతా యాంత్రికంగా కదలిపోతోందనీ తట్టింది.

విశ్రాంతికి పోదామనుకునేసరికి యెక్కడికి పోదామన్న సమస్య వుదయించింది. ఎవరితో వెళ్లాలి? తనకు లీలగా జ్ఞాపకం వుంది. ఒకసారి విమానంమీద వస్తూ ఒక కొండమీద భవనం చూసాడు. ఆ దగ్గరలో ఒక చెరువు వుంది. ఇంకా మనసులో ఆ భవనం మాసిపోకుండానే ఆ ప్రాంతాలనించి వచ్చే మనిషితో ఆ విషయం ముచ్చటించాడు. రోజూ యేదో ఒక సమయంలో అనుకోకుండా అబద్ధం ఆడవలసినవాడు యీసారి కోరి అబద్ధం ఆడాడు. అదీ భార్యతోనే! పదిహేను రోజుల్లో మారుమూలలో రాజకీయాలు సరిదిద్ది వస్తానని బయలుదేరాడు. తను యెక్కడున్నదీ యెవరికైనా తెలిస్తే తన యేకాంతవాసం భగ్నమై సమస్యలు దండెత్తుకొస్తాయని తన భయం.

ఒంటిగా కారునడుపుతూ పట్నం, పల్లెలూ దాటిపోయాడు. ఇంతవరకూ తన ఆలోచనలు గజిబిజిగావున్నాయ్. కారు యెత్తైన ప్రదేశాలకు యెగబ్రాకుతుంటే యిరువేపులా లోయలూ అక్కడక్కడా అగపడిన అడవి మృగాలూ హృదయాన్ని వుల్లాసపరిచాయ్. ఎప్పటికీ తరగని అడవి బాట జాబు చెట్లనించి అల్లుకొని పోతోంది. ప్రకృతిమాత ఒడిలో పడి పాలు త్రాగిన పసిపిల్లవానిలా అయిపోయాడు. పక్షులు కిలకిలలు ఆమె జోలపాటై బాటే చీరై వుయ్యాలగా వూగుతూ తనను మోగన్ను నిద్దర వుచ్చినట్లయింది. రాలినపూలు గాలికి కారువేపు కదులుతూ ఆహ్వానించాయ్.

కొండశిఖరంపై కోవెలలా తెల్లగా వుంది రహదారిబంగళా! ఏ మహానుభావునికి తట్టిందో యిక్కడ యిది కట్టించాలని! ఆకాశానికీ బంగళా కప్పుకూ మధ్య అడ్డేమీ లేదు. అప్పుడప్పుడూ రెక్కలు ఆడించుకుంటూ పోయే పక్షులూ, పోటీపైన పందెంలో పోడిపోతున్న తెల్లని మబ్బులూ. మబ్బుల మీదుగా అనంతాకాశం!

చుట్టూ పచ్చని ప్రకృతి. దూరంగా కొండలు గోడల్లా నునుపుగా పెరిగి ఆకాశానికి అంటుకున్నాయ్. ఈ కొండపై కెగసి తనను బెదరిస్తుందనే భయంతో కాబోలు సూర్యుడు మైదానంలో కంచే చల్లబడ్డాడు.

బంగళాకి రెండు వందల గజాల దూరంలో ముందుకు మూడు గుట్టలు ముద్దుగా కలిసి ఒక మడుగును యేర్పరచాయ్. నీలికాటితో నిండిన మడుగు చూసి నీలి ఆకాశం నివ్వెరపోయి అందులో తన ప్రతిబింబాల్ని చూసుకుంటోంది.

గాలి వీస్తూ నగ్నంగా పలుకరించింది గగనం ఒక మెరుపుతో కమ్మని కబురంపింది. నీరు ఆనంద బాష్పాలను గలగల రాల్చి ఆహ్వానించింది మన్ను మన్నన చేసి పాదాలను తాకి ముద్దు పెట్టుకుంది అగ్ని వేడి తేనీరు అందించింది. రామారావు బంగళా చుట్టూ తిరిగాడు. పెరట ఒక యిల్లు వుంది. ఆ యింట్లోనే బంగళా నౌకరున్నాడు. ఏభై యేళ్ళ ప్రాయం. స్వచ్ఛమైన నీటిలాంటి మనసు. వీస్తున్న గాలిలాంటి ఆప్యాయత అతనిది. కొద్ది నిముషాల్లోనే అతని దగ్గర సంవత్సరాలతరబడి నమ్మకంగా పనిచేస్తున్న నౌకరులా తయారయ్యాడు.

రామారావు వారండాలో వాలు కుర్చీమీద బనియను పంచెతో కూలబడి పోయాడు. హమ్మయ్యా అనుకున్నాడు. ఇలాంటిచోటే విశ్రాంతి యిలా ఒంటిగా తీసుకోవాలన్న కోరిక యెన్నాళ్ళకు ఫలించింది? సమస్యలు. నటనలు, బాధ్యతలు, నచ్చని పనులు చేస్తేగాని జీవించే పరిస్థితిలో లేని బ్రతుకూ, హోదా, కీర్తికి ప్రాకులాటా యిన్నీ వగైరా బరువైన రాళ్ళుగా - నరాలమీద, గుండె మీద, మెదడు మీద పడుతున్నట్లు ఉండేవి. వీటిపోట్లాట నిండి బైట పడ్డానన్న తలపు తనకు యెంతో హాయి నిచ్చింది. ఆక్కడే యెదురుగా నున్న విరిగిన చెట్టుకొమ్మల ప్రక్కనే మళ్ళీ చిగురించిన చిగుళ్ళూ, అలా చెట్టు మీద నించి యింకొక చెట్టు మీదికి యెగిరి తనవైపు చూసి పళ్ళికిలించిన కోతులూ, గాలికి పండొకటి రాల్చిన వృక్షం.... అన్నీ తనమనస్సు శాంతింప జేసుకోడానికి ఆలోచనలను రేపించాయ్.

ఇలా యిదివరకు ఆలోచించే అవకాశం తనకు చిక్కలేదు. ఇప్పుడు ఆలోచిస్తుంటే తన జీవితంలో యేం తలపెట్టినా, యే కార్యం చేసినా, ఒకరికి ఒక మేలు చేసినా, తను చేస్తున్న ప్రతి ఒక్క పనిలో, కదలికలో, తలంపులో, చివరకు తన భార్యయందున్న వలపులో - కోరికలున్నాయ్ - స్వలాభాపేక్షతోనే చేస్తున్నాడు తను! అంతరాంతరాల్లో తనకున్న అశాంతి అందుకే తనకు యిలా రావాలనే కోరికను పుట్టించింది. అతను చేసే ప్రతీ పనిలోనూ నమ్మకంగా వుండాలని యిదివరకు వుబలాట పడ్డాడు. కానీ మనిషి కున్న ప్రతీకోరికా నెర

వేర్పుకోడానికి తన స్వంత రూపం, ఆలోచనలు, సిద్ధాంతాలూ మార్చుకొని వేరే రూపంతో నాటకంలో పాత్రలా నటించాలి. అంటే జీవితం ఒక నాటకం—అది నిజం కాదు. అది అనుభవించలేని నిర్వచించలేని కల. మాయామోహితమైనవాడే మనిషి. ఆ మాయే మనిషిని అనంతమైన కోరికలతో, వాటిని సాఫల్యం చెయ్యటానికి అంతులేని తాపత్రయంతో ఆడిస్తుంది. అనంతమైన కోరికలను పరిమిత జీవిత వ్యవధిలో యెంత తాపత్రయపడినా తీర్చుకోలేడు [illegible] తీర్చుకోలేని కోరికలతో [illegible] తీర్చుకోలేని దాహంతో [illegible] ఎప్పటికీ [illegible] పొట్టితో [illegible] ముగిసిన నిరాశ, నిస్పృహ, [illegible] నాటకాన్ని నటిస్తాడు సంసారంలో [illegible] యెంత గొప్ప మనిషైనా చివరి అంకం తప్పించుకోలేడు. అది చావు కాబట్టి జీవిత నాటకం విషాదాంతమే అవుతుంది.

రామారావు తనను గురించి తాను ఆలోచించుకోవాలన్న కోరిక కొంతైనా తీర్చుకోగలుగుతున్నాడు. ఏ పని చేసినా తన శ్రేయస్సుకోరే కంటే యెదుటివాళ్ళ శ్రేయస్సు దృష్టిలో పెట్టుకొని చేయటం నుంచి దనిపించింది. అనుకోవటమంత సులువుగా మానవనైజాన్ని మార్పించటం సాధ్యం కాదు. మనస్సు ఒక క్షణంలో పొందిన అనుభూతులు, మరో క్షణంలో మారుతుంటాయ్. కదిలితే గాలే నిలకడలేని దనుకుంటే అంతకంటే వేగాతి వేగంగా మనసు కదిలి పోతుంది. [illegible] చల్లగాలి తుఫాన్ రోజున వెర్రిగా వీస్తుంది. అలాగే యీ క్షణంలో మంచి ఆలోచనలతో నిండిన మనస్సు మరో క్షణంలో క్షీణిస్తు పోతుంది. అందుకే మనిషికి నీరసం [illegible] రోగాలు కావు – అతని మనస్సే!

ఇలాంటి ఆలోచనలు ప్రస్తుత క్రొత్త [illegible] రెండు [illegible] బ్రతుకు [illegible] ఆలోచనలను [illegible] చేస్తున్నాయ్. తన ప్రేమను, అనురాగంతో ప్రదర్శింపబడిన అనుభూతులూ అందుకునే [illegible] రెవరూ లేరు. అతని వృత్తిలో పరిచే పనులు గాని, మాటలు గాని అనేవాళ్ళెవరూ [illegible] లేరు. ఏ విషయం ముచ్చటించినా, అర్థం చేసుకొని అభిప్రాయం యిచ్చే అన్యోన్యతగల మనుష్యులు లేరు; అధమం తనను తిట్టేవాళ్ళైనా లేరు. ఒక గాఢమైన నిశ్శబ్దం, నిరాడంబరం, నిర్వీర్యం చేస్తున్న బ్రతుకు, బంతిలాంటి కోరికలను కప్పిపెట్టే ఆలోచనలు. పొంగని నరాలు, లాలాజలం వూరని నోరు, పాస లాడని కళ్ళు –




"చూడు నాన్నా: అమ్మ తలకిమాసినోడి కూతురా, తలకిమాసినోడి కూతురా అని అంటున్నది ?"

ఇవన్నీ విసుగెత్తించ సాగినయ్. తనను తానే భయపెట్టుకోగలిగే ఆలోచనలు రాగానే యిది మూడు నాలుగు రోజులు వుండటానికి ఫరవాలేదుగానీ వారాల తరబడి వుండే ప్రదేశం కాదనిపించింది.

నాలుగురోజులున్నాక ఏకాంతం భరించరానిదైంది. ఎంతసేపని తను యీ చెట్లవైపు, కొండలవైపు, జంతువులవైపు చూసుకొని ఆలోచించగలడు? మౌనంగా యివన్నీ చూపించిన ప్రేమబాసలు అర్థం కాకుండా పోతున్నాయ్. పంటో యీ యీదరగాలి, యీ మెరుపులూ-చినుకులూ; గాఢాంధకారం. ఇక్కడ ఎలక్ట్రిక్ దీపాలు లేవు; వంట చేసుకోడానికి గ్యాస్ స్టవులు లేవు; కావలసినంత గాలి పొందగలిగే ఎలక్ట్రిక్ పంఖాలూ లేవు; ఒక ఎయిర్ కండిషన్ గదైనా లేదు— అన్నీ అధునిక సౌకర్యాలున్న తన స్వంతయిల్లూ, స్వజనం, స్వంతవూరూ పైనున్న మమకారపు ముద్దను కరగించుకోలేకపోయాడు.

రాత్రుళ్ళు పులుల అరుపులు,

నక్కల గోల - ప్రకృతి మొర్రో మని యేడుస్తున్నట్లు ఒక్కటే ఘీంకారం - నిద్దర పట్టడంలేదు. చెరువులో మధ్య మధ్యను నిల్చున్న గుట్టలు రాత్రుళ్ళు చుక్కల వెలుగులో భూతాల్లా అగు పిస్తున్నయ్. చెట్లు జుత్తు విరబోసిన పిచ్చి ఆడదానిలా అర్థంలేని శబ్దాలు చేస్తున్నయ్, అడవి మొరటుగా రీతి లేని దైనోదాన్ని రానురాను తుడిచి పెట్టుకొనిపోయింది.

భార్య జ్ఞాపకానికి వచ్చింది. ఊరక నే కూర్చుంటే ఏం తోచటంలేదు. ఎంతకని; యేదైనా చదవటం తల నొప్పి వస్తోంది. ఇక్కడ తిండి బాగా లేదు. చల్లని నీరులేదు. ఏదీ ఒంట బట్టకుండావుంది. ఒంటి కేమైనా వస్తే దగ్గరలో డాక్టరులేడు. అక్కడ తను విడిచిపెట్టిన వ్యాపారం, యింకా సెటల్ చెయ్యవలసిన పనులూ, ఎంద రికో యిచ్చిన వాగ్దానాలూ, యెందరి వద్ద నించో తను పొందవలసిన వుప కారాలూ, అనవలసిన వినవలసిన మాటలూ, పడవలసిన తాపత్ర యాలూ, కొనవలసిన కీర్తీ, పెంచ దలచిన ఆస్థి హంగులూ అన్నీ ఒకటి మీద ఒకటి పడి తన మనసును కల్లోలం చేస్తున్నాయ్. తను యీ అడివిలో మనశ్శాంతికోసం తపస్సుచేసే పరిస్థితి కాదు; సంఘంలో వూరూపేరూతో మసలుతున్నాడు.

బంగళా వరండాలో చెయ్యొత్తి స్తంభానికి ఆన్చి యిలా ఆలోచిస్తూ నిల్చున్నాడు రామారావు. తిరిగి పోదామని అనుకొని చెయ్యి తీసు కుంటూ ఒకసారి మీదకి చూసాడు. సాలెగూడులో ఒక యీగ చిక్కు కుంది. సాలెపురుగు సంతోషంతో గెంతులు వేసుకొనివచ్చి యీగను భక్షించింది. ఈగకొట్లాట సాలెపురుగు ఆవేశం స్పష్టంగా తిలకించాడు. కాస్సేపయ్యాక మళ్ళీయథాస్థానంలో గూడులో ఒకమూల కాచుకొనివుంది. రామారావు గూడులోని మూడు దారాలు తెంపాడు, అలా యింకా చూస్తూనే వున్నాడు. ఒక్కసారి గాభరాపడింది వెన్వెంటనే తమా యించుకున్న సాలెపురుగు గూడును మరమ్మత్తు చేసుకుంటోంది, రెండు రోజులక్రితం పాము కప్పను మ్రింగటం చూసాడు. ఈ అడవిలోనే ఒకజంతువు, ఒక కీటకం బ్రతుకుకోసం తోటి జంతు వులను, కీటకాలను మ్రింగుతూండే టప్పుడు ఒక మనిషి తన మనుగడ కోసం యింకో మనిషికి అన్యాయం చెయ్యటం ప్రకృతిసిద్ధంగానే వుందను కున్నాడు. ఈ సంసారం ఒకసాలె గూడు. సాలెపురుగులా వ్యూహం పన్ని అందులో చిక్కుకున్నవాళ్లను భక్షించటంవల్లనే మనిషి సంఘంలో బ్రతక గలుగుతున్నాడు. ఎవరో

మోసం చేసినా, దాడి చేసినా మళ్ళీ తన ప్రతిభచే సాలెగూడును మరమ్మత్తు చేసుకున్నట్లుగా సంసారాన్ని చక్కబరచుకుంటున్నాడు. ఈ ప్రకృతిలో జంతువులకూ, కీటకాలకూ వున్న పన్నాగాలూ, ఆవేశాలూ, ఆక్రోశాలూ, ఆకలీ, క్రూరత్వం అంతా మనుషులకీ వున్నాయ్. అందుకే వాళ్ళు సంఘంలో నివశించగలుగుతున్నారు. అవే లేకపోతే ఒకరి నొకరు అన్యాయం చెయ్యరు. ఒకరి కొకరికి పోట్లాటలుండవు. ఏదో సంఘర్షణ లేనిది యీలోకంలో యేదీ జరగదు. సంఘర్షణ అన్యాయం, అవినీతీ లేనిది రాదు. అంచేత సంఘంలో న్యాయమెంత అవసరమో అన్యాయం అవసరం అంతేవుంది. నీతి అవినీతి రెండూ వీటి నిత్య సంఘర్షణ వల్లనే సంఘం సజీవమైయుంది. సంఘీయులు క్రొత్త క్రొత్త బ్రతుకు తెరువులు, సుఖపడే అవకాశాలూ వెతుక్కుంటున్నారు.

లేదా అంటే మనసులు మట్టిముద్దలయ్యేవి; సంఘం నిర్జీవమయ్యేది.

తిరిగి పోదామని నిశ్చయించుకునేసరికి వద్దు వద్దని చెట్లు గాలికి తలలూపాయ్. ఆకాశం కోపంగా వెలిగి నల్లని తెరనించి గర్జించింది. అడవి మృగాలు అరచుకుంటూ రొప్పుకుంటూ పోతున్నాయ్. కడసారిగా బ్రతమాలని నీరు వర్షమై వచ్చిపడింది. ఐనా పోదామనే నిశ్చయం పోలేదు. అన్నీ సర్దుకుంటే—

"తోవలో పిడుగు పడగల్దు—యెల్లొద్దుబాబూ."

రామారావు తలెత్తి చూసాడు. ఏ దైనా వనకన్య యిలా వర్షానికి తడుచుకుంటూ వణుక్కుంటూ వచ్చేసిందేమో నని.

"ఎవరు నువ్వు?" అని ప్రశించాడు.

"నా కూతురు బాబు - ఊరెల్లి తిరిగొచ్చింది" అందుకున్నాడు వెనకనించి బంగళా కాపరి. నల్లని శిల్పసుందరిలా యెదురుగా నిల్చున్న ఆమె వేపు భ్రాంతీ, పొగడ్తా, ఆవేశం కలసిన కళ్ళతో చూసాడు. శిల్పాచార్యుడు యౌవనంలో చెక్కిన శిల్పంలా యీ సుందరిని బ్రహ్మ బింకంగా నున్నప్పుడు సృష్టించి వుంటాడు. ఆమె యువకవి ఆవేశంతో వ్రాసిన ప్రేమగీతిలా, చకచకా పరుగులెడుతోంది. తొలివర్షాలకు కొండలమీదనించి ఆకులలములను తోసుకుంటూ జారిపోయే సెలయేరులా వుందీ సుందరి. మేఘావృతమైన ఆకాశంలో వెలిగే మెరుపుల్లా ఆమె చూపులున్నాయ్. ఎవరహో; నీ వెవరహో! అని గాలి ఘోష పెట్టూ పరుగెడుతోంది. అన్ని ప్రకృతిశక్తుల విన్నపాలను తిరస్కరించిన అతని మనసు ఆమె బానకు లొంగిపోయింది.

"నీ కూతురు పేరు?"

"కాసులమ్మ"

"పెళ్ళయిందా ?"

"ఇంకా లేదు బాబయ్యా-న్యారైనోడు ఇతపడ లేదు."

"వంట చేతనౌనా ?"

"మా రాజా .... ఆ డి వి వం ది మాంసం—అవిపకూర దానంత బాగా యెవురూ వండనేరు !"

"నీ కూతురు పాడగలదా ? పని పాట్లు చేసుకోగలదా ?"

"పెళ్ళోరులా అన్నీ అడుగుతు న్నారు మారాజా; ఇంటికి లచ్చిమి దే వౌ తాది. ఏ కుటుంబానపడితే ఆ కుటుంబానికి గవరవం తెస్తాది. ఇది యే యబ్బకూతురు దొరా ? మొగుడి దగ్గర పిల్లలా వుంటాది. పగా యోడు పళ్ళికిలి స్తే పులౌతాది" కూతురి నడ వడిపై విశ్వాసాన్ని మీసం మువ్వి గొప్పగా చెప్పేడు.

ఇంత పెద్ద సమాధానంలో హుందా, గర్వం రామారావుకి కని పించింది

"నీ వంటతో నా కడుపు నిండటం లేదు. ఈ రాత్రికి నీ కూతురువంట తిననీ" అన్నాడు.

కాసులమ్మ వడ్డించింది. ఇంత వుప్పు మిరపకాయలు వేసి వుడక బెట్టిన కూరైనా వదలకుండా తిన్నాడు. ఏదో స్వాభావికమైన రుచి జిహ్వాకు తగిలింది, ఆ కూరలో పల పంతా వలకబోసినట్లుంది.

"బాబుగారు తిన్నారు...." అని గెంతింది తండ్రిదగ్గర.

తెల్లారాక తెలివొచ్చింది. అలా పరుపుమీద నించే తూరుపు వేపు చూశాడు. రెండుకొండల మధ్యనించి వుదయభానుడు మీద కెగసిపోతు న్నాడు. పొగమంచు తెరనించి చూస్తూంటే చల్లని పూర్ణచంద్రునిలా గున్నాడు. ఆ మంచుతెరల నించి ముద్దగా ముద్దుగా చొచ్చుకొనివచ్చిన వెలుగులానే కాసులమ్మ వచ్చి కిటికీ దగ్గర నిల్చొని "తెల్లారింది దొరా !"

ఆమెముఖం రెండుకొండలమధ్య నించి పైకెగసిన బింబంలానే వుంది. ముడుకులు దిగని మంచుతెరలాంటి చీరను చుట్టుకొని ప్రక్కగా నిల్చొని వుంది. ఆ తూరుపు కొండలూ ఆ బింబం యెంత దూరంలో వున్నాయో ఆమే అంతదూరమైనట్లు ఆమె ప్రక్క నూవు చెప్తోంది.

రావు లేచి తలుపు తీశాడు. ఆమె చీపురుతో గది తుడుస్తున్నంత సేపూ అద్దంలో తల దువ్వుకుంటూ అతని ముఖాన్ని కాకండా ఆమె ప్రతిబింబం లోని యౌవనపు బిగువును చూసి మురిసిపోతున్నాడు.

అద్దంలో అతని ముఖ మొక్కటే కనబడేసరికి వికారంగా వుంది కళ్ళు

పెద్దవిచేసి చూసాడు. ప్రతిబింబంలో కనపడే కళ్ళు తిరిగి తంద్రిగా చూసి తన గుండెలోనికి చొచ్చుకున్నాయ్. అద్దాన్ని అక్కడ పడేసి పెరటి కెళ్లాడు.

"యేడి నీరు దించాను దొరా!"

వేడినీరు మీద పడగానే ఒక్క సారి తను కలనించి మేల్కొన్నట్లయింది.

"తిరిగి పోతాను. ఇక్కడ వుండాలనివున్నా వుండలేను" అనుకున్నాడు. అలా అనుకున్నది తన మనసు కాదు - తన ఆత్మ! ఆత్మ సాధారణంగా ఓడి పోతుంది. బహుశః చివరకు జయించడానికేమో!



నాగంరోజుల్లో ఆమెను చూస్తే గానీ వుండలేనంత మమకారం యేర్పడింది. తన భార్యనైనా తన శరీర విషయంలో యీమెలాంటి శ్రద్ధ తీసుకోలేదు. వంట మనిషి వండుతాడు. ఇద్దరూ కలసి తింటారు. ఆమె కుండవలసిన సమస్యలూ, అభిరుచులూ, ఆవేశాలూ ఆమెకున్నాయి. ఒకరి నొకరు అర్థం చేసుకొని బ్రతకాలి. అలా అర్థం చేసుకోవడమంటే యెదుటివారి అవసరాలను తిలకించాలి. వాటికి అవకాశం యివ్వాలి. వాళ్ళ కోరికలను తీర్చగలగాలి. ఆధునిక యుగంలో భార్యాభర్తల మధ్య వున్నబంధం ప్రేమబంధం కాదు - కోరికలబంధం! కోరికలు తీర్చుకోక పోతే ఆ బంధం వదులై ఒకోసారి విడిపోతుంది. నటనకు ప్రాధాన్యం యీయకపోతే భార్యాభర్తలు అను

కున్న సుఖాన్ని పొందలేరు. కానీ యిక్కడ అలా కాదు. కాసులమ్మ ప్రవర్తనఅంతా స్వాభావికంగా వుంది.

మళ్ళీ కొంత సేపయ్యాక యింకోలా ఆలోచించుకున్నాడు. ఈ ప్రకృతి యిక్కడ నిల్చొని చూస్తే ఒకలా కనిపిస్తుంది కంటికి; యింకోలా కనిపిస్తుంది పైనించి చూస్తే.

మళ్ళీ అనుకున్నాడు. "తిరిగి పోతా నని."

సాయంత్ర మైంది. నెత్తి మీద ఆకాశంలో నల్లని మేఘాలు వేరు కుంటున్నాయ్. పడమటి కొండల మీదనించి ఆవల నున్న లోయలలోనికి దినకరుడు దిగుతూ తెల్లమబ్బులను కప్పుకున్నాడు. వంట యింటిలోనికి వెన్నెల్లాంటి ఆ వెలుగు చొచ్చు కుంది. రెండే కొంగలు నడినింగిలో విహరిస్తున్నాయ్. ఆరు చిలుకలు పాడుతూ గిరగిరా తిరుగుతున్నాయ్. వంటయింటి గుమ్మందగ్గర నిల్చొని-

"కాసులమ్మా - ఏం కూర ?" అన్నాడు.

ఒక అడవి పువ్వు వికశించినట్లు ఆమె నోరు విప్పగా తెల్లని పళ్ళవరస అగుపించిది.

"వంకాయకూర బాబూ" అంది.

ఎవరో పాడిన గుత్తివంకాయ కూర పాట జ్ఞాపకం వచ్చి ఆమె వేపు నిదానించి ఒకసారి చూశాడు. ఆమె సిగ్గుతో తలవంచుకుంది. ఆకాశం వే పొకసారి చూసి-

"ఈవేళ బాగా వాన వస్తుంది."

"రాదుబాబూ" అంది.

"మబ్బులు చూశావా?"

"మబ్బులుంటే వానొచ్చేస్తుందా? ఎర్రిగాలి మబ్బుల్ని తుడిచిపెట్టేదా?"

అలానే గాలి వచ్చింది. మబ్బులన్నీ తూరుపుదిక్కుకు కదలిపోయి మాసి పోయాయ్. మనసులో మళ్ళీ ఉద యించిన ప్రశ్న అక్కడినుంచి అతనిని కదలించి బంగాళా వరండాలో కుర్చీ మీద కూర్చోబెట్టింది. వంట పూర్తయ్యే సరికి యింకా వెలుగు బాగానేవుంది. చేత మట్టిబిందె పట్టుకొని చెరువునుంచి రెండుసార్లు నీరు తెచ్చి తన ఎదురుగా నున్న పూలమొక్కలకు పోస్తోంది. అతని కంటికి వంగుతూ వాలుతున్న ఆమె ఒక వనకన్యలా అగుపించింది. తన మనసులో ఋష్యాశ్రమాలూ, అందులో విచ్చలవిడిగా తిరిగే లేళ్ళూ —వాటి వెంట శకుంతల లాంటి కన్యలూ—గాంధర్వ వివాహాలూ.... యివన్నీ తిరగబొచ్చినయ్. కావ్యం, ప్రకృతికన్య .... యే అందాలైనా మనిషికి పిపాస వుంటేగానీ అందంగా కనపడదు. తనకు నిజంగా దాహం వేసింది. మూడోసారి ఆమె నీరు పోస్తుంటే చేయి అడ్డుపెట్టి తాగుదా మనుకున్నాడు.

అంతలోనే బిందె ఖాళీ అయి పోయింది. ఆమె తిరిగిపోతుంటే అలా చూస్తూ చివరకు చెరువు దగ్గరకు వెళ్ళాడు. ఆమె చెరువులో యీదుతోంది. గట్టుమీద నిల్చున్నాడు. సింగి నుండి రెండే రెండు చుక్కలు మురిసిపోతూ యీ నీటిలోనికి చూస్తున్నాయ్. తామర రేకులు చుట్టూ పాన్పులా వున్నాయ్. కలువ మొగ్గల మధ్య కదులుతున్న రంగు రంగుల చేపలా వుంది ఆమె! రావు మనసు కట్టుకోలేకపోయాడు. తనూ చెరువులో దూకా లనుకున్నాడు. తనకు యీత రాదు. ఈత వస్తే లోతేం చేసును! అయినా ఆ వేశంతో చెరువు గెంతి ఆమెదరి చేరా లనుకున్నాడు. ఆమె కౌగిలితో అలా మునిగిపోయినా చివరి దశలో భయం తనను ఆవరించక పోను. భయంనించి బయటపడటంలో మనిషి యెప్పుడైతే నెగ్గాడో అమరజీవిగా వుండిపోతాడు.

తను నిశ్చయించుకునే సరికి ఆమె వెనుతిరిగి చూసింది సిగ్గుతో బట్ట సర్దుకుంది. నీరు అల్లల్లాడింది. నీరజ పత్రాలు లాంటి ఆమె కళ్ళు అదరి పడ్డాయ్. అతను ఆమె వస్తున్న వేపు కదిలాడు. ఒడ్డుకు చేరి గబగబా లేడి పిల్లలా గెంతు లేసుకుంటూ యింటి వేపు కదలిపోయింది. తిరిగి చూసి, మళ్ళీ గట్టుమీద కూర్చుండిపోయాడు. కాళ్ళు చాపాడు. పాదాలు నీటిలో మునిగాయ్. అందమైన పాదాలు వికారంగా కనిపించిన క్షణం యింతవరకు ఆవేశపు టందంతో తొణికిన మనసూ వికారమయింది. "తిరిగి పోతానని" మళ్ళీ అనుకున్నాడు. ఈ నాటి యీ తలపు అక్కడ వున్నంతసేపూ మనసులో మెదలుతూనే వుంది. తన బాణాన్ని తప్పించుకొని పరుగులెత్తింది యీ లేడి. పిలుకాడు పొందే నిస్పృహా అతనూ పొందగలిగాడు. చీకటి అలముకొంటోంది. మెల్లగా లేచి బంగళా వేపు కదిలాడు. ఎదురుగా బంగళా కాపరి చేతిలో ఒక లేడిని పట్టుకొని యెదురయ్యాడు.

"బలే కట్టం మీద పట్టుకొన్నా దొరా!"

ఆ లేడి ఒకసారి అమాయకంగా తన వేపు చూసి తల వంచింది. రాత్రి భోజనం దగ్గర అలాంటి కళ్ళు అగపడ్డాయ్. ఆ వంటమనిషి కూతురు అన్ని పనులూ ఆమె చకచకా చేసుకొని పోయింది. తనతో సరిగ్గా మాటాడ లేదు. ఒక విధమైన అలక ఆమె స్వభావంలో కనపడింది. మధ్యాహ్నం ఒక క్షణం నిద్దర పోయాడు. ఏవో కోతులూ, కొండముచ్చులూ యీ బంగళామీదపడి ధ్వంసం చేస్తున్నట్లు. అప్పుడే పులులు పురుముతున్నట్లు మిగతా జంతువులతోపాటు ప్రాణం మీద తీపితో భయంగా అరుస్తూ పరుగు

లెత్తుతున్నట్లు కలగన్నాడు. తెలివొచ్చి చూసేసరికి యింట్లో యెవరూ లేరు. అంతా ప్రశాంతంగా వుంది. వరండాలో కుర్చీమీద కూర్చొని పడమటివేపు చూస్తున్నాడు. మనసులోని కలలో పెరిగిన పుద్రేకం యింకా చావలేదు. ఆ భయం యింకా గుండెలో పొడుస్తోంది. అలాంటి సమయాన ప్రక్కనే భార్య వుంటే సగంభయం ఆమె కౌగిలి తగ్గించేది. తెలివి రాగానే యెదురుగా కాసులమ్మ వుంటే అంత పని చేసేవాడే.

అలా చూస్తుండగానే అల్లంత దూరంలో చెట్టుమీదనించి పుల్లలు రాలటం గమనించాడు. లేచి గబగబా చెట్టు క్రిందకు వెళ్ళాడు. మీదకు చూశాడు. కాసులమ్మ పొయ్యికోసం పుల్లలు చెట్టుమీద విరుస్తోంది. నిశ్శబ్దంగా చూడగలిగిన పరిస్థితి దాటి పోయింది. చెట్టెక్కాలని ప్రయత్నించాడు. ఆమెను చెట్టునించి దింపాలి.

''కాసులమ్మా—నా నెత్తిన పుడక పడింది.'' అన్నాడు, చేతిలో ఒక కర్ర పుల్ల పట్టుకొని.

''ఇక్కడే వున్నావా దొరా?'' అంది.

''అవును'' అంటూ మీదకి చూసాడు. ఆమె చెట్టు దిగబోతోంది.

అప్పటికే పడమటి ఆకాశం యెరుపెక్కింది. అతని ఆవేశం రక్తంలా ప్రవహించబొచ్చింది. ఇంపుగా ఉత్తి యెర్రనిపూలతో ఆకులులేని గుల్ మహార్ చెట్లు రెండు మరింత యెరుపెక్కాయ్. దిగిన ఆమె, మోములో దరహాసం ఆ పువ్వులంత అందంగా వుంది.

పుల్ల లేరుకొని గంపలో పెట్టూ ''ఎప్పుడెల్లిపోతావు దొరా?'' అంది.

''నేను వుండటం నీకు కష్టంగా వుందా?''

''అయ్యబాబో — అంతమాటే — ఎందరో దొరలు వచ్చారుగానీ— నీలాంటి దొర యెప్పుడూ రాలేదు.''

''నే నెప్పుడూ యిక్కడే వుండిపోతాను.''

ఆమె బుగ్గమీద చెయ్యివేసుకుంటూ ''యిచిత్రం - పట్నందొరలు అడవిలో వుండిపోగలరా? నిజంసెప్పు దొరా - నిజం.''

''ఒకమాటంటాను - కోప్పడవు కదా?''

''సెప్పు దొరా!''

''నేనంటే నీకిష్టమేనా?''

ఒకసారి చిలిపిగా చూసి ''అమ్మో— యిష్టమే - నాకు మా అయ్యంటే యిష్టం, యీ సెరువంటే యిష్టం - యీ సెట్లూ చేమలూ, గుట్టలూ, గొడ్లూ - అన్నీ నా కిష్టమే.''

''అది కాదు - ఇటుచూడు'' అంటూ కళ్ళు నిదానించి ఆమె కళ్ళల్లోనికి

చూశాడు. "అలా చూస్తుండావేం దొరా? ఇక్కడే వుండిపోతానంటివే— నన్ను కట్టుకుంటావేంటి?"

అలా అంటూ నే బుట్ట నెత్తిన యెత్తుకొని ఒకసారి వెనుతిరిగి చిన్న నవ్వునవ్వి వెళ్ళిపోయింది. ఆమె వెనుక నించి వీచినగాలి యెర్రటి పూలను తోసుకుంటూ పోయింది. అతని ఆవేశపు మనసు గాలితోపాటు ఆమె వెంట నంటుకునే కదలింది.

అగాలి అలా వేస్తూనేవుంది. ఆ రుద్రని ఆకాశం యెరుపును తగ్గించి మెరుపులను మెరిపించింది. భోజనం పూర్తయ్యేసరికి గాలీ వర్షం ముంచు కొచ్చింది.కిటికలన్నీ వేసుకొని ముసుగు పెట్టుకున్నా నిద్దర రా లేదు. బైట భీభత్సం, పైనించి అక్కడక్కడా నీరు చిమ్మి టపటప చినుకులు రాలు తున్నాయ్. రానురాను కొద్దిగా చలి వేయసాగింది. కాసులమ్మ ప్రక్క నుంటే యెంత బాగుండే దనిపించింది. కాసులమ్మ గురించి మనసంతా ఆలో చనలతో నిండిపోయింది. ఆమె నిర్మలా కాశంలా, పచ్చని ప్రకృతిలా—అర మరికలులేని, అమృత హృదయంతో తనను ఆకర్షించింది. అతను యెంత ప్రయత్నించినా ఆమెను చేర లేక పోయాడు. కదలినా, నవ్వినా, మాటాడినా, ఆమె యేం చేసినా స్వాభావికమే వుట్టిపడ్తోంది. అబద్ధం, అవినీతీ, వెర్రి ఆవేశాలూ, నటనలూ ఆమెకు దూరంగాపోయాయ్. అందం నగ్నంగా ఆమె అన్ని అవయవాల్లోనూ చొచ్చుకుంది. అమాయకం ఆమె సొత్తు. నిరాడంబరం వీటన్నిటికీ మెరుగులు దిద్దింది. ప్రకృతి యెత్తు పల్లాలు ఆమె శరీరపు వంపుల్లో మూర్తీభవించాయ్. ప్రకృతిలో పరుగు లెత్తే మోహపు లాలింపు లన్నీ ఆమె యిముడ్చుకుంది. గాలీ, వర్షం, భూమీ, వెన్నెలా, వెచ్చదనం అన్నీ కూడి ముద్దుగా యీ వనకన్యను పెంచాయ్. ఆమె యిముడ్చుకున్న అంశా లన్నీ చేష్టలలో చూపించి, కవ్వించి కమనీయ, రమణీయమైన ఆలోచనలను అతనిలో కలుగజేసింది.

ముసుగులూ, మూతివంపులూ, బెడదలూ, బెంగలూ, హోదాలూ, బ్రతుకు తెరువులూ, నటనలూలేని నగ్నమైన ప్రేమను బహుశః తొలి సారిగా తన జీవితం అనుభవించే గడి యలు అసన్నమైన వనుకున్నాడు.

పైన గాలీవాన బీభత్సం చేస్తూనే వుంది. తనలోని ఆలోచనలు అడ్డూ అపూ లేక పరుగులెత్తున్నాయ్.

తెల్లవారిలేస్తే నటిస్తేనేగానీ బ్రతక లేని ఆ సంఘంలోనికిగానీ, ప్రతి కౌగిలీ ఒక కోరికతో జతపర్చే యెప్పుడూ ఒక లా నే వుం డే ఆ ప్రేమ మధ్యకు యెందుకు తను మళ్ళీ పోవటం? కాసు

ఆమ్మ రోజు కోలా కన్పిస్తోంది. పళ్ళతో ఆకులతో నిండిన ఆమ్రవృక్షంలావుంది. చల్లని ఆహ్లాదాన్నిచ్చే గాలిలా, తన కోరికల దాహాం తీర్చడానికి సెలయేరులా వుంది. ఈ చలి కాచుకోడానికి ఆమె మంటలా తన దగ్గర వుండాలి. తనలో మండుతున్న మంటలను ఆర్పుకోలేకపోయాడు. ఆమె తండ్రి యెక్కడికో పోయివుంటే తనే ఆమెను బలవంతంగా లోనికి తెచ్చుకొనేవాడు. ఈ అగ్ని చల్లారదు. చల్లారకూడదు. చల్లారితే కోరికలుండవు. కోరికలు లేక పోగానే మనిషికి బ్రతకాలనివుండదు. మట్టిముద్దలా మనిషి క్రిందనే కూలి వుంటాడు. అతని గుండె ప్రేమతో పొంగిపోయింది. కోరికలతో అతని మనసు బరువెక్కిపోయింది. ఇక్కడే యీమెను పెళ్ళాడి యీ అడవిలో జాహాటంగా, యెండకు యెండి, వానకు తడిసి విహారించి తరిద్దామనుకున్నాడు. ఆదిమానవజంట పొందిన స్వేచ్ఛను యీమెను కట్టుకొని తనూ పొందాలని భీష్మించుకున్నాడు. లేచి కిటికీ తెరిచాడు. గాలి అతనిని త్రోసివేసింది. అతని కోరిక అంతకంటే తీవ్రంగా వుంది. ఏనుగు తొండాల్లా రాలుతున్న వర్షపు ధారలుకంటే వడిగా అతని రక్తం వేగంగా ప్రవహిస్తోంది!

"కాసులమ్మా నిన్ను నేను కట్టుకుంటాను ఇప్పుడే నా ప్రక్కకు రా" అని చెయ్యిపట్టుకొని లాగుకు రావటానికని తలుపు తెరిచాడు. ఒకప్పుడు తండ్రి అడ్డుపెత్తే అతనిని బయటకు త్రోయటానికి సిద్ధపడ్డాడు. అతని నిశ్చయం మేఘాల్లో గర్జించింది. ఆ శబ్దంతోపాటు పెరటియిల్లు ధబేల్ మని కూలిపోయింది.

"కాసులమ్మా" అంటూ అరుస్తూ రావు పరుగెత్తాడు. ఒక మెరుపు మెరిసింది; ఒక వురుము వురిమింది. మెరుపంత శక్తితో, కూలిన కప్పును వూడబీకుతున్నాడు. కొద్దిసేపట్లో బంగళాకాపరి యేడుస్తూ అతని సహాయానికి ఒక మూలనించి లేచాడు.

కాస్సేపయాక మెరుపు జాణా కారంతో మెరిసింది. కాసులమ్మ మెరుపు వేసిన బాణం తగిలి గాయపడినట్లు దూలం అడుగున పడివుంది. ఇద్దరూ కలసి బయటకు తీసి ఆమెను బంగాళాలోనికి తెచ్చారు. ఏ పరుపు మీద ఆమెను కౌగలించి పడుకుందామనుకున్నాడో అక్కడే ఆమెను వుంచాడు. ఇంకా కొనవూపిరి వుంది. తలకు గుడ్డ కట్టాడు. తలుపు లన్నీ వేసేసాడు. దీపం వెలిగించి ఆ వెలుతురులో ఆ వాడిపోతున్న పువ్వు వేపు చూశాడు. తలవేపు కూర్చొని తన తొడపై ఆమె తల బెట్టాడు. అలా ఆమె చేతులూ, ముఖం, శరీరం అందిన



వరకూ తడిమాడు. ఒక్కసారి ఆమె మీదపడి ఏడవసాగాడు. ఆ ఏడుపుకు గాలివాన కదలిపోయింది.

తెల్లవారింది. బయటకు వచ్చి చూశాడు. కూలిన, విరిగిన చెట్లు, భూమిని కోసిన నెఱ్ఱెల్లూ, చచ్చిన జంతువులూ, జారిన రాళ్ళూ రప్పలతో అంతా బీభత్సంగా వుంది. అతని కంటికి ప్రకృతీ, తన బ్రతుకూ అంతా తెగిన సాలెగూడులా అగుపించింది.

# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

### జరిగిన కథ

*[తిరుపతికొండమీద, అక్కడనే కాలేజీలో చదువుకుంటూన్న కరుణాకరం అకస్మాత్తుగా కనుపిస్తాడు. సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని పద్మను వివాహం చేసుకోడానికి తన ఒప్పుదలను శ్రీహరిద్వారా తెలియపరుస్తాడు. అందుపై రఘూ, మాధవీలు పద్మతో సంప్రదించి, ఆమె తన యిష్టమును తెల్పినమీదట జానకమ్మకు తెలివిడిచేస్తారు. అందరూ యీ అకస్మాత్ పరిణామానికి ఆశ్చర్యపరవశులౌతారు.]*

—ఇక చదవండి.

## 66

నూతన వధూవరులను భగవత్ దర్శనం చేయించి మర్నాడు పాపనాశనం బయల్దేరారు. శ్రీనివాసుని కొండలకంటె ఎత్తైన కొండలమధ్య విశాలమైన మలుపులతో నున్న బాటమీద బస్సు దూసుకుపోతుంటే, అందరి మనస్సులు ఆహ్లాదంతో నిండిపోగా వుత్సాహంగా కబుర్లు చెప్పుకోసాగారు. ఒక్క మాధవిమాత్రం మౌనంగా యేమేమో తలపోయసాగింది.

'అప్పుడు, చక్రపాణి కుటుంబంతో కలసి తిరుపతి వచ్చినప్పుడు, పాపనాశనం కూడ వెళ్ళారు. ఈ పాపనాశనం ప్రాముఖ్యతా, ప్రత్యేకతా పాణి ఎంతబాగా వర్ణించి చెప్పాడనీ ! ఇంకా ఆనాటికంఠం చెవులలో ప్రతిధ్వనిస్తూనే వుంది......

బస్సు ఆగడం మాధవి గమనించనేలేదు. "లే అమ్మా" అని పిల్చేవరకు. బస్సు దిగి నడకసాగించారు. జానికమ్మ పూలూ, పసుపుకుంకుమల్తో వున్నపళ్లెం కొంది, పాపనాశన గంగదగ్గర పూజచెయ్యడానికి. మెట్లుమెట్లుగావున్న దారిని వుత్సాహంగా గంతులేస్తూ ఎక్కుతున్నారు. ఇందిరా, పద్మా భర్తలతో కలసి. కోతులు !

ఎన్నికోతులు! చిన్నవీ, పెద్దవీ, నామాలున్నవీ, వింతవింతకోతులు. యే మాత్రం భయంలేకుండా యాత్రికుల దగ్గరిగా వచ్చి తినటాని కేమైనా పెట్టమని చెయ్యి చాపు తున్నాయి. ప్రక్కనే అమ్ముతూన్న శనగపప్పు, మరమరాలు కొని వాటికి వుత్సాహంగా పెడుతున్నా రందరూను. రఘు, సరోజిని, కమలాకూడా చిన్నపిల్లలలా వుత్సాహంగా వినోదించసాగా రా కోతులతో. ఒకనా డీ కోతులతో ఇంతకంటె వుత్సాహంగా వురకులేస్తూ పరుగులెట్టిన మాధవి ఈరోజు అన్ని ముచ్చట్లూ తీరిన అవ్వలాగా ఇతరులను నిర్లిప్తంగా చూస్తూ నడవసాగింది.

'మళ్ళీ ఈ జన్మలో తిరిగి లభిస్తాయా ఆ సుఖసంతోషాలు ?' అనుకొంటూ నడుస్తూన్న మాధవి వెనుకనుంచి ఎవరో పట్టుకు లాగినట్టయి ఖంగారుగా వెనక్కు తిరిగి చూచింది. ఒక పిల్లకోతి ! ఒకచేత్తో మాధవి చీరచెంగు పట్టుకుని మరొకచెయ్యి చాపి యేమైనా పెట్టమని మూగగా అర్ధిస్తోంది. ముదముతో మురిసి రిగొనవలసిన ఆ సంఘటన మాధవిలో మూగిబాధను రేకెత్తించింది. అప్పు డిలాగే ఒకకోతికి తాను సెనగపప్పు యివ్వబోయి అందీ అందకుండా కవ్విస్తుంటే అది గబుక్కున తనచెయ్యి పట్టుకుంది. భయంతో తాను ఖంగారుపడ్తూంటే పాణీ, చెల్లెళ్ళూ ఒక్కటై తనను వేళాకోళం చేశారు. కోతి నీకు 'షేక్‌హాండ్' ఇస్తోం దంటూ. అతి మధురమైన ఆ స్మృతి అలలు అలలుగా కదలి దుఃఖం తెరలు తెరలుగా వచ్చేసింది.

"మాధవీ," అంటూ సరోజిని దగ్గరకు రావడంతో కోతి దానిదారిన అదిపోయింది.

"ఏమిటి భయపడ్డావా ?" అంది తిరిగి సరోజిని.

"లేదు." కళ్ళు తుడుచుకుంది మాధవి. "ఏదో జ్ఞాపకం వచ్చింది వదినా" అంది

"పద" నిట్టూర్చుతూ దారితీసింది సరోజిని.

రెండు అంగలు ముందు నడుస్తూన్న రఘు వెనక్కు వచ్చాడు. "నేను చాలా మూర్ఖుణ్ణి వదినా. ఈ ప్రదేశా లన్నీ నిన్ను బాధిస్తాయేమో అనే ఆలోచనే లేకపోయింది నాకు. ఇవ్వాళే వెళ్ళిపోదాం ఈ వూరినుంచి. విచారించకు. కొంచం ఓపికపట్టు."

అందరూ మౌనంగా నడవసాగారు. అల్లంత దూరంలో పాపనాశన గంగ హోరెత్తుతూ కొండలనుండి జాలువారుతోంది. ఆ నీరు ఎక్కడికో క్రింద క్రిందకు గల గలా పరుగులెడ్తోంది. దారిప్రక్కల కూర్చున్న భిక్షకులకు చిల్లరడబ్బులు వేస్తూ నడుస్తూన్న మాధవి చటుక్కున ఒకచోట చేష్టలుదక్కి నిలబడిపోయింది.

"వదినా!" దూరంనుంచి రఘూ, ఇందిరలు పిల్చిన పిలుపు ఆమెకు విన్పడలేదు.

"ఏమిటే అమ్మాయి అలా చూస్తున్నావ్?" దగ్గరలోనే వున్న కనకమ్మ పలకరింపు అసలు వినిపించలేదు.

"ఏమిటి మాధవీ ఆ బైరాగివాడి నలా చూస్తావ్?" సరోజిని మాధవి భుజాలు పట్టుకు కుదిపింది.

ఆ కుదుపుకు తెలివివచ్చినట్టయి మాధవి "మాష్టారూ!" అంటూ ఒక్క ఉదుటున ఆ బైరాగి పాదాలు పట్టేసుకు రోదించసాగింది.

ఆసనం వేసుకు కళ్ళు మూసుకు కూర్చున్న ఆ బైరాగి దిగ్భ్రాంతితో లేచి పారిపోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

అప్పటికప్పుడే జనం పోగైపోయి ఆ దృశ్యం వింతగా కుతూహలంగా చూడసాగారు.



రఘూ, అతడివెనకనే శ్రీహరీ, కరుణాకరం పరుగెట్టుకొచ్చారు.

"నీ కేమన్నా మతిపోయిందా వదినా?" మాధవిని రెక్కపట్టుకు లేవతీయబోతూ, ఆ బైరాగిని తేరిపార జూచిన రఘు "అన్నయ్యా" అని బలంగా వాటేసుకున్నాడు.

ప్రదేశ మంతా రోదనధ్వనులతో నిండిపోయింది.

"మేష్టారూ," అంటూ కరుణాకరం, శ్రీహరీ రెండుచేతులూ పట్టుకున్నారు.

బైరాగిగా వున్న చక్రపాణికి ఇక పారిపోవడం సాధ్యం కాలేదు. నిర్జీవంగా తలవాల్చి నిల్చున్నాడు.

"ఇలా మా ఖర్మకు మమ్మల్ని వదలిపోతావా నాయనా? నీకోసం మాధ వెంత దిగ్గులిపోతోందో ఎరుగుదువా? లేమ్మా మాధవీ" అంది జానకమ్మ ఏడుస్తూ

"లే మాధవీ" కాళ్ళదగ్గిర పడున్న మాధవిని లేవనెత్తుతూనే వెర్రికేక పెట్టాడు చక్రపాణి.

"ఏమైంది?" అంటూ ఆత్రంగా నాడి చూచాడు రఘు. "ఫర్వాలేదు. హఠాత్తుగా చూడడంతో తట్టుకోలేకపోయింది." వుండండి. ఇలా పడుకోబెడదాం.

చెట్టుక్రింద పడుకోబెట్టి చల్లటినీళ్ళు ముఖాన కొట్టేసరికి తేరుకుని లేచింది మాధవి. యేమేమో మాట్లాడబోతూండగా "వద్దు వదినా, ఏమీ మాట్లాడవద్దు. దయుంచి నా మాట వినండి అందరూ ఆమురాలో వున్నారు. ఎవరూ, ఏమీ, మాట్లాడవద్దు. త్వరగా ఈ పాపనాశనం దర్శనం చేసుకుని కాసిని నీళ్ళు నెత్తిన జల్లుకుని పోదాం; ఇంటికిపోయి తీరిగ్గా మాట్లాడుకోవచ్చు." అంటూ అన్నచెయ్యి పట్టుకుని ముందు దారి తీశాడు. అందరూ మౌనంగా అనుసరించారు

"నా పాపా లన్నీ నాశనమైపోయాయి తల్లీ. నా బిడ్డలందర్నీ చల్లనిచూపు చూచావు గంగమ్మతల్లీ," అంటూ సంతోషంగా స్నానం చేసింది. జానకమ్మ పాపనాశన గంగలో.

కొందరు స్త్రీలు చెట్ల కొమ్మలకు గుడ్డలతో బెడ్డముక్కలు వ్రేలాడ దీస్తూం డడం ఆశ్చర్యంగా కన్పించిన కమల "అదేమిటండీ అత్తగారూ? వాళ్ళలా చేస్తు న్నారు?" అనడిగింది.

జానకమ్మ చూచి "అయ్యో. ఈ సంతోషంలో మర్చిపోయానేవ్; రండి మీరు నలుగురూ అలా కట్టండి; బెడ్డ నుచ్చుకు బిడ్డ నిమ్మని కోరుకోండి," అంటూ సిగ్గు పడ్తూన్నా వూరుకోక మాధవి, కమల, ఇందిర, పద్మల నలుగురిచేతా వుయ్యాల్లు కట్టించింది, హేళనగా నవ్వుతూన్న శ్రీహరీ రఘులను అధికారంగా మందలించి లెంపలు వాయించుకునేట్టు చేసింది. కుటుంబంలో నిండుదనం, పరిపూర్ణత్వం నెల కొంటున్నట్టు తోచింది ఎవరిమట్టుకు వారికే.

## 67

సన్యాసివేషం విసర్జించి సంసారిరూపం ధరించాడు చక్రపాణి. గదిలో పడుకున్న అతడిదగ్గిరికి వెళ్ళి నిల్చుంది మెల్లగా మాధవి.



సవ్వడి విని తలెత్తి చూడలేదు పాణి ; దగ్గరగా నడచివచ్చిన పాదాలను చూచి పల్కరించలేదు.

భర్తభుజంపై చెయ్యివేస్తూ "ఇంకా యింతకఠినంగా ఎలా వుండగల్గుతున్నారు? ఇన్నాళ్ళూ నేనేమైపోయానో, ఎంత కుమిలిపోయానో, ఇప్పుడైనా పరామర్శించాలనిలేదా మీకు ?"

బరువుగా తలెత్తిన చక్రపాణి కళ్ళనిండా నీళ్ళు వున్నాయి. "నేను మాత్రం సుఖంగా సంతోషంగా వున్నాననుకున్నావా మాధవీ? ఆనాడు అమాయకురాలివైన నిన్ను వదలిపోవటానికి నేనెంత నరకయాతన ననుభవించానో. ఇల్లు వదలినది లగాయతు అనుక్షణం నువ్వు గుర్తువచ్చి ఎంత బాధపడ్డానో, ఎన్నికష్టా లనుభవించానో మాటలకు అందదు." గొంతు పూడిపోయింది.

"ఎప్పుడో ఒకప్పుడు తిరిగివస్తా ననే ఆశ ఏమూలనో లేకపోతే ఎప్పుడో ఈ లోకం వదలిపోయేవాడను" ఎంతప్రయత్నించినా మాధవికి దుఃఖ మాగలేదు.

ఆ కన్నీళ్ళు తుడిచి అరికట్టడం పాణికి వల్లగాకపోయింది.

"ఏ సుఖమూ లేకపోగా కుటుంబానికి క్రొత్త అప్రతిష్ఠ ఒకటి తోడైంది. ఆ పరిస్థితులలో నీకా యింట్లో మరీకష్టమని వెళ్ళిపోయాను మాధవీ. నాతోనే గదా నీకా యింటితోగల బంధం? మీ నాన్నగారి అనాదరణకుకూడ నేనే కారణం. నేను లేకపోతే స్వతంత్రిగా రానిస్తారనీ. నువ్వైనా సుఖంగా వుంటావనీ అనుకున్నాను మాధవీ."

"అక్కడే పొరబడ్డారు అన్నగారూ," అంటూ ప్రవేశించింది సరోజిని. మాధవి లేచి సరోజినికి దగ్గరగావచ్చి కూర్చుంది.

"భర్త ఎక్కడో కష్టాలుపడ్తూంటే భార్య సుఖంగా వుండగలదా? మాధవి చిలిపి పిల్లనే మీకు తెల్సుకానీ ఎంతటి అభిమానం పట్టుదలా వున్నాయో మీ రెరుగరు. అప్పటికీ ఇప్పటికీ ఒక్కసారైనా మా గడప త్రొక్కలేదు. నాలుగు గోడల మధ్యనే కాని. ఒక్క పంటా, వినోదంకూడా ఎరుగదు."

"నిజమే. చాల పొరబడ్డాను" మెల్లగా అన్నాడు పాణి. క్రమంగా అందరూ చేరుకున్నారు గదిలోకి మెల్లగా. కుటుంబవిషయా లన్నీ తెల్సుకున్నాడు పాణి. అంతకూ యింతకాలం ఎక్కడెక్కడ తిరిగారు? ఏం అనుభవం గడించారు బావగారూ?" అన్నాడు కరుణాకరం నవ్వుతూ.

"కడుపు తరుక్కుపోయిందిరా బాబూ, నీ బైరాగిగుడ్డలు చూచేసరికి!" కళ్ళు ఒత్తుకుంది జానకమ్మ.

మౌనంగా కూర్చున్న రఘును పల్కరించాడు పాణి: "ఏరా రఘూ, కోపం వచ్చిందా? భారమంతా నీ ఒక్కడిపైనా పడవేసిపోయాను".

"నాకు కోపమా అన్నయ్యా." నిండుగా నవ్వాడు రఘు. "అదేం లేదు. ఇప్పటికైనా తిరిగివచ్చావు; అదే ఆనందం. శాంతిని వెతుక్కుంటూపోయిన నీకు



బహుశః సుఖం, శాంతీ మనం సృష్టించుకోవడంలోనే వుంటాయని ఈ పాటికి తెలిసేవుండాలి".

"నిజంరా రఘూ, నిజం," అంటూ కొంచంసేపాలోచించి చెప్పడం ప్రారంభించాడు పాణి.

"దూరపుకొండల నునుపును చూచి మోసపోవడమే కాని దరిజేరినకొలదీ ఎన్ని ముళ్ళకొండలలో పడిపోతామో, ఎంతంత రాళ్ళూ రప్పలూ తగిలి బోర్లపడతామో అనుభవం మీదగాని తెలియలేదు. ముఖం కన్పించేసరికే గుసగుసలాడుకుంటూ వ్రేలెత్తి చూపించిన ఆ మనుష్యులున్న ఆ వూరినుంచి సాధ్యమైనంత త్వరలో పారిపోవాలని ఆ వేళ స్టేషన్‌కి పోయి కన్పించిన ట్రెయినెక్కేశాను. అది మెడ్రాస్ మెయిల్. అనేకరకాల మనస్తాపాలతో - దానికి తోడు ఆ రోజంతా భోజనం చెయ్యలేదేమో - అలసి నిస్త్రాణతో నిద్రపోయాను.

"మర్నాడుదయం పదిగంటలవేళ హఠాత్తుగా వులిక్కిపడిలేచాను. చుట్టూ పోలీసులూ, జనమూ! బూట్ కాళ్ళతో తన్ని లేపుతున్నారు. అయోమయంగా లేచాను. ఆశ్చర్యం! నా బట్టలనిండా రక్తం! ప్రక్క బెర్తుమీద రక్తపుమడుగులో వున్న స్త్రీశవం! విషయం అర్థమైంది. ఒక అపకీర్తిని సహించలేక పరారైన నాపై మరో నీచాతి నీచమైన అపవాదు పడింది. చేతులకు బేడీలు పడ్డాయి. ఛీత్తా

రాలు, ఘోషణలూ మధ్య తలవంచి నిర్జీవంగా కారాగారానికి నడిచాను. అక్కడ నా చేత మాట్లాడించటానికీ, నేరం ఒప్పించడానికీ పోలీసులు పడ్డ శ్రమ అంతా ఇంతకాదు. నిల్చోబెట్టి చుట్టూ భగ భగా మంటలు మండించారు. లాఠీలతో మోకాళ్ళ చిప్పలు బ్రద్దలు గొట్టి కారం జల్లారు........."

జానకమ్మా, మాధవీ ఒక్కసారి గొల్లు మన్నారు. కమల నిశ్శబ్దంగా రోదిస్తూ అక్కడినుంచి లేచిపోయింది. అందరి కండ్లనుండీ అశ్రుధారలే. గట్టి గుండె నిబ్బరం గల రఘూ, కరుణాకరం కూడా కళ్ళు తుడుచుకున్నారు.

తిరిగి మొదలుపెట్టాడు పాణి. "ఎన్ని బాధలైనా పన్నెత్తకుండా ఓర్చాను. కడకు వాళ్ళకు మూగివాడినేమో నన్న అనుమానం కూడా వచ్చింది. రాజమండ్రి సబ్‌జైల్‌లో వుంచి, హత్యారోపణతో కోర్టువారి ఎదుట నిలబెట్టారు. ఎవరూ నన్ను పలికించలేకపోయారు. ప్రతివారికీ మూగివాడా, మతిస్థిరం తప్పినవాడా – ఈ రెండే అనుమానాలు, ఎవ్వ రేమనుకున్నా, నే నేమైపోయినా నాకు బాధలేదు. అందుకేనేమో అంత పాషాణంలా నిలబడగలిగాను!

"వాద ప్రతివాదాలు సాగుతున్నాయి. ఈ వింతముద్దాయిని చూడటానికి జనం ప్రతిదినం కోర్టు ఆవరణంతా క్రిక్కిరిసి పోయేవారు.

"కోర్టువారు నాకు ప్లీడర్ని ఇస్తామంటే అనంగీకారంగా త ల వూ పా ను. అదొక్కటే మొత్తంమీద నే నిచ్చిన జవాబు. కాని మూగిగా, విరాగిగా నిల్చున్న నాపై అన్ని నేరారోపణలతో చట్టరక్షకు లంతా విరుచుకుపడడం చూచి జాలిపడి చౌదరిగా రని గొప్ప పేరుమోసిన క్రిమినల్ లాయర్, నా తరఫున తనకు తానే వకాల్తా తీసుకొని వాదించమొదలెట్టారు."

"చల్లని తండ్రి, వెయ్యేళ్ళు వర్ధిల్లాలి భగవత్కృపవల్ల" జానకమ్మ నోటి నిండా దీవించింది.

"జాలికీ, నీతి నిజాయితీలకూ ఆయనకు పెట్టినది పేరట రాజమండ్రిలో. నా వంటి నిస్సహాయంగా నిలబడిన అనేకమందికి ప్రతిఫల రహితంగా ప్రాణదానం చేసిన పుణ్యాత్ములట ఆయన. ఎంత జాలిగుందో, అంత కఠినంగానూ అన్యాయా న్నెదిరిస్తారట. నిశ్చయంగా వురిశిక్ష పడవలసిన నేను ఆయన కృపవల్ల, ఆయన పటిష్ఠవాదంవల్ల పోలీసుకేసు వీగిపోయి ఏ శిక్షా లేకుండా బయటపడ్డాను.

" 'చూడు బాబూ, ఎవరివో సుశిక్షితుడులా కన్పిస్తున్నావ్. కానీ నువ్వెంతమంచి వాడివైనా నోరుమూసు క్కూర్చుంటే లోకం నీ మంచితనం గుర్తించకపోగా, ఎదురు తన తప్పులన్నీ నీ మీద రుద్ద ప్రయత్నిస్తుంది. భగవంతు డిచ్చిన వాక్కు



నుపయోగించుకొని. అన్యాయాన్ని ధైర్యంగా ప్రతిఘటించి, న్యాయాన్ని వెదకి పట్టుకో' అంటూ ఎదురు నాకొక పదిరూపాయలిచ్చి పంపాడు. ఎటు పోవడానికి తోచక గోదావరి నీటితో పుష్కలంగా కడుపునింపుకుని, అక్కడే వున్న విష్ణుమూర్తి ఆలయంలో పడుకున్నాను. ఎటు పోవడానికి, ఏం చెయ్యటానికీ మార్గం తోచడం లేదు. 'అసలు జీవించటమెందుకు? జీవితం చాలిస్తేనో'—అన్న ఆలోచనతో గంటలు గంటలు కొట్టుకుపోయేది. ఆలయంలో దొరికిన ప్రసాదం తిని గోదావరి గట్టుమీద పడుకుంటూ వారంరోజులు గడిపేశాను.

"ఒక రోజున ఒక బైరాగి నాదగ్గర కూర్చుని మెల్లగా మాటలలోకి దింపాడు. నే నెక్కువగా మాట్లాడలేదు. కాషాయ వస్త్రాలు ధరించని బైరాగిని, అని చెప్పి వూరుకున్నాను. అయితే మా మఠంలోకి రమ్మన్నాడు. వెళ్ళాను. ఉదయమే లేచి స్నానం చేయడం, దైవప్రార్థనానంతరం వూళ్ళో భిక్ష మెత్తడం, తిరిగి సాయంత్రం భిక్ష, నిద్ర, ఒక విధంగా నిర్మలంగానే గడిచిపోయేది. కాని క్రమంగా నాకు బోధపడసాగింది. నే ననుకున్నంత నైర్మల్యం లే దక్కడ. అప్పుడప్పుడు ఎవరో ఆడవాళ్ళు వస్తూండేవారు. రాత్రుళ్లు రాత్రుళ్లు మఠంలోని సాధువులు అదృశ్య మయ్యేవారు. తిరిగి రెండు మూడు రోజులకు మళ్ళీ ఉదయ మయ్యేసరికి మఠం లోనే నిద్రపోతూండేవారు. ఇదంతా అర్థంకాకపోయినా నా కెందుకని వూరుకున్నాను.

ఒక రోజు అర్ధరాత్రి మెలకువ వచ్చేసరికి గుసగుసలు, నవ్వు గలగలలు వినిపించాయి. జాగ్రత్తగా విన్నాను; అర్థమైంది. పగలు గతిలేని బిచ్చగాండ్రు, రాత్రి పూట గజదొంగలు! ఆ ఆడవాళ్లు, వాళ్లు పనిపాటలు చేసే ధనవంతుల ఇంళ్ల అనుపానులు చెప్పేవాళ్ళన్నమాట!

" 'ఈ క్రొత్తవాడేమిటికి? మన కేమి వుపయోగం?' ఒకడి గొంతు స్పష్టంగా వినిపించింది.

" 'అంత తెలివితక్కువవాడినా?' మరోగొంతు పల్కింది. 'మరీ గడ్డుసమస్య ఎదురైనప్పుడు రెండు ఉన్న నగలు చేతిలోపెట్టి వాడినే పోలీసులకు వప్పజెప్తేసరి!'

"మెల్లగా అక్కడనుంచి పారిపోయాను. మళ్ళీ జీవనసమస్య ఎదురైంది. ఎక్కడ, ఎలా నా బాధల్నీ నన్ను నేను మరచిపోయి బ్రతకగలనో వెదకసాగాను. అనేక కూలిపనులు చేశాను. పడవలరేవులో బస్తాలు మోస్తూ అక్కడే పడుకుంటూ గడపసాగాను. వుండుండి గోదావర్లో దూకేద్దామా అనిపించేది ఒక్కొక్కప్పుడు. అలా బ్రతకలేక బ్రతుకుతూండగా ఒకరోజున పడవసరంగుతో మాట్లాడుతున్న పెద్ద మనిషొకడు కనిపించాడు. సరంగు నన్నతనికి చూపించి 'చాలా నమ్మకస్థుడు. ఎవరిగొడవా అక్కర్లేదు, ఎవరూ లేనివాడు. అంతో ఇంతో చదువొచ్చనుకుంటాను. మీరు పనికొస్తాడు.' నా కేం అర్థంకాలేదు. అ క్రొత్తాయన నన్నెగాదిగా చూచి 'నీ కేమి దుంగలూ, దూలాలూ ఎత్తం. తిండీ, బట్టా పుష్కలంగా ఇస్తాం. నెలకు వంద జీతం. నన్ను మెప్పిస్తే అసలు ఎంతైనా ఇస్తాను. నమ్మకంగామాత్రం ఉండాలి.'

"ఆశ్చర్యపోతూనే అంగీకారంగా తలవూపాను.

" 'చదువొచ్చా?' దారిలో అడిగాడు.

" 'బహుకొద్దిగా' అన్నాను.

"ఆరోజు నుంచే నాకు పని ప్రారంభమైంది. మెయిల్‌కీ, జనతాకీ, బస్సుకీ ఎప్పుడు వాళ్ళెక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెళ్ళాలి. వెళ్ళి ఎవ్వరితోనూ మాట్లాడకుండా చేతులు కట్టుకుని నేలమీద బూట్ కాలు రాస్తూ నిల్చోవాలి. కాస్సేపటికి ఎవరో వ్యక్తి తెచ్చి నాకు ఏదైనా వస్తువిస్తాడు. మౌనంగా అది స్వీకరించి, భద్రంగా యజమానికి వప్పజెప్పాలి. ఆ వస్తువులు వివిధరూపాలలో వుండేవి. ఒక్కోసారి తాళంవేసిన టిఫిన్ కారియర్, ఒక్కోసారి కారు, సైకిల్ ట్యూబులు, మరొకసారి సీలువేసిన నూనెడబ్బా, ఒక్కొక్కప్పుడు పసుపుబట్టలు వాసెనగట్టిన బిందెలు. వాటిని మూతతీసి చూడటానికి ప్రయత్నించకూడదు; జాగ్రత్తగామాత్రం తీసుకెళ్ళి



ఒప్పజెప్పాలి. అలా ఒకనెల చేశాను; అందులో ఏముంటే నాకెందుకు? నావృత్తి. నా బాధలు మరొక వైపుండేవి. యజమాని నన్ను మెచ్చుకుని నాజీతం మూడయాభై చేశాడు. ఒకరోజున బస్సులో ఒక ఆడమనిషి వచ్చి మూతికి పసుపుబట్ట కట్టినబిందె ఒకటిచ్చింది నాకు. 'పోలీసులు మారువేషాల్లో వెంటాడుతున్నారు. తప్పుదార్లు త్రొక్కించు' అని రహస్యంగా చెప్పేసి వెళ్ళిపోయింది.

"అర్థమైంది నాకు. నేను చేస్తున్న ఈపని చాల ప్రమాదమైనదీ, చట్టవిరుద్ధమైనదీ నన్నమాట! ప్రమాదమైతే నాకు చింతలేదు. చట్టవ్యతిరేకమై, ప్రభుత్వాన్ని మోసం చేసేపని అంటేమాత్రం - చాల బాధపడింది హృదయం. బిందెను నేరుగా యింటికిగాక, సందుగొందులన్నీ తిరిగి ఒక సత్రం జేరుకున్నాను. నన్ను వెంటాడుతున్న వ్యక్తులిద్దరూ అనుమానం తీరిపోయి, ఎక్కడో అంతర్ధానమైపోయారు. సత్రంలో ఒకగది తీసుకుని తీరిగ్గా బిందెమూతి కట్టు విప్పాను. రాగిరేకు సీల్ చేసివుంది. అదీ బ్రద్దలుకొట్టాను. ఆశ్చర్యం! నిండా దొంగ కరెన్సీ. ఇదన్నమాట నే నిన్నాళ్ళుగా చేస్తున్నపని! ఒక్క క్షణంలో కర్తవ్యం నిశ్చయించుకున్నాను. ఆ బిందెను ఆ సత్రం గదిలోనే వుంచి గదికి తాళంవేసి పోలీసులకు వివరంగా ఆ దొంగవర్తకుల ఆచూకీలు, నివాసాలు తెలుపుతూ ఉత్తరం వ్రాసిపడేసి ఊర్నూ వదిలేశాను.

"లోకంలో ఎక్కడికి వెళ్ళబోయినా అవమానం, అత్యాచారం, అధర్మం. అవన్నీ చూస్తే మన కుటుంబంలో జరిగిన విశేషాలు - తప్పుకాదని నేననుకాని - దానిని నేను భూతద్దంలో చూచి ఎంత భ్రమించానో, నాకు నేనేగాక కుటుంబానికి కూడ ఎంత పెద్దశిక్ష విధించానో గ్రహించి కృంగి, కుమిలిపోయాను.

"అన్యాయం అధర్మంతో బ్రతికేవారు కొందరైతే తెలిసో తెలియకో స్వప్రయోజనం కోసమై తప్పులు చేస్తూ గుంభనగా బ్రతికేవారు మరికొందరు. మరొక వర్గం వుంది. చేసిన తప్పుపని తెల్సుకొని ఇతరులు వ్రేలెత్తి చూపకముందే వాళ్ళంతట వాళ్ళే గోరంతలు కొండంతలుగా చేసుకు బాధపడేవాళ్ళు. ఈ కోవకు చెందినవాడిని నేను. అందుకే అంతబాధపడీ అందర్నీ క్షోభకు గురిచేశాను. తిరిగి ఇంటికి రావాలని అనుకున్నాను.

"ఆరా తీయగా మీరంతా వైజాగ్‌లోనే వున్నారని తెలిసింది. అక్కడికి వచ్చాను. అందరి విషయాలూ తెల్సుకున్నాను. భిక్షుకుడు మాదిరిగా వచ్చి ఆరాత్రి అందర్నీ చూచాను. మనస్సు సంతోషపడింది. కష్టాలలో వదిలేసిపోయి, సుఖంగా వున్నప్పుడు నేనూ బ్రతికున్నానని చెప్పుకోవటానికి మనస్సు అంగీకరించలేదు. ఆనాడంత కష్టంలో దరీతెన్నూ గానక విలపించే అందర్నీ నిర్దాక్షిణ్యంగా వదలిపెట్టిపోయి ఇప్పుడు తిరిగివచ్చి కలియడానికి ముఖం చెల్లలేదు.

"అందుకే తిరిగి ఆ యింట్లోంచి బయటపడ్డాను. ఇక ఈ లౌకిక విషయాలలో పట్టింపులేకుండా ఈ జీవితాన్ని నాకు నేనే ఎలాగో వెళ్ళదీసేయదల్చుకున్నాను. న్యాయంగా, ధర్మంగా, మంచిగా బ్రతికే - సజ్జను లన్పించుకొనే - మనుష్యులుండే ఈ సంఘంలోని క్రుళ్ళు ఎన్ని విధాలుగా వ్యాపించుకుపోయిందో సాధారణ మానవులను దాని బిలోర శాసనాలు ఎంత బాధపెడ్తాయో గ్రహించిన నేను దానికి దూరంగా బ్రతుకదల్చుకున్నాను. అందుకు కాషాయ గుడ్డలు, రుద్రాక్షలూ అనవసర మనీ, మనస్సే అన్నిటికీ దర్పణ మనీ నిశ్చయించుకున్నాను.

"ఎన్ని బాధలుపడ్డా నాకుభగవంతునిపై నమ్మకంమాత్రం నశించలేదు. అందుకే తిన్నగా తిరుపతి జేరుకొన్నాను శ్రీనివాసుని దర్శించాను. కుటుంబాన్ని ఎప్పుడూ అలాగే చల్లగా కాపాడమని ప్రార్థించాను ఆ పైన అక్కడ ఎలా బ్రతుకుతున్నానో చూచారు కదూ?"

"అయితే ఆ రాత్రి......మీరేనా?" అంది కళ్ళు తుడుచుకుంటూ మాధవి.

'ఔ' నన్నట్లు మౌనంగా తల వూపాడు పాణి.

"చేజేతులా వదలుకున్నా మన్నమాట అప్పుడు" అంటూ నిట్టూర్చాడు రఘు.

"అదీ మనమంచికే" విట్టూర్చాడు ఛక్రపాణి. "కష్టాలన్నీ గట్టెక్కి ఈ పవిత్ర క్షేత్రంలోనే మన కుటుంబంలోని వెల్తులు పూడ్చాలని సంకల్పించుకున్నాడు ఆ శ్రీనివాసుడు."

"చూశావా వదినా," రఘు అన్నాడు. "పాతివ్రత్యానికున్న విలువ ఏ కాలంలోనైనా ఒకటే నంటే విన్నావా? నీ మొర వినలేకపోయాడా భగవంతుడు."

"నన్నలా అనొద్దు రఘూ. మహాసముద్రంలో నీటిబిందువు వంటి అల్పురాల్ని. ఇదంతా ఆ భగవత్కృప: అంతే. ఎన్ని కబుర్లేనా చెప్పవచ్చు. ఎన్నిశాస్త్ర పరిశోధనలైనా చెయ్యవచ్చు. కాని భగవద్విలాసాన్నిమాత్రం తప్పించుకోలేరు. విధిగా తల ఒంచవలసిందే."

"అమ్మా, పద్మ ఏదీ?" హఠాత్తుగా అడిగాడు పాణి.

"నీ ఎదుట పడటానికి సిగ్గు పడ్తోంది. ఈ కష్టాలన్నీ తనవల్లనే వచ్చాయని" అంది జానకమ్మ.

పాణి లేచి పద్మకోసం వెళ్లబోగా కరుణాకరం "కూర్చోండి నేను తీసుకొస్తాను," అంటూ గదిఅవతలకు పరుగెట్టాడు.

అయిదు నిమిషాలకు కరుణాకరం వెంట శోకమూర్తిలా లోనికి అడుగుపెట్టింది పద్మ.

"పద్మా, ఇటు రామ్మా." ప్రేమ వుట్టిపడ్తూంది పాణి పిలుపులో. ఒక్కసారి ఆశ్చర్యంగా చూచి "అన్నయ్యా" అని మీద వాలిపోయింది పద్మ.

"పెళ్ళికూతురివి. ఏడవ్వొచ్చా?" అంటూ కళ్ళు తుడిచాడు పాణి.

"అప్పుడు నువ్వు చెయ్యవలసిన పెళ్లన్నయ్యా; బుద్ధిలేక ఇన్ని కష్టాలపాలు జేశాను." వెక్కి వెక్కి పడింది పద్మ.

"పోనీ ఇప్పటికైనా గుర్తించావు. సరైన మార్గంలో పడ్డావ్. కరుణాకరం ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను;" అన్నాడు పాణి ఇద్దరి చేతులూ కలిపి పట్టుకుంటూ.

రఘు అన్నాడు. "కరుణాకరాన్ని మెచ్చుకోవటం కాదు, అందరూ అంతటి క్షమాగుణం అలవర్చుకోవాలి. ఎవరేమనుకొన్నా ఒక విషయం నిర్మొహమాటంగా చెప్పదలచుకొన్నాను. ఇంతకూ కారణం అసలు అమ్మ. పిల్లలకి కడుపునిండా తిండి పెట్టి సాకడంతోనే తమబాధ్యత అయిపోయిం దనుకొనే వాళ్ల పిల్లలిలాగే అయిపోతారు. పద్మకు తను బుద్ధులు నేర్పలేదు. మనను చెప్పనిచ్చేది కాదు. దానితో అది ఎవ్వరిభయం లేకుండాపోయింది...సరే! నీ మట్టుకు నువ్వు ఆద

ర్శాలమీద నడిచే అతీతవ్యక్తివి. ఎవ్వర్నీ బాధించవు, నొప్పించవు. కాని నువ్వు చేసిం దేమిటి? అడుగడుగునా ఆదర్శమంటూ ఆత్మశాంతికి దూరమయ్యావు. కాలేజీలో, అనంతయ్యగారి విషయంలో, కడకు పద్మ విషయంలో అన్నిటా నువ్వదే తెలివితక్కువతో ప్రవర్తించావు. ఆదర్శాలనేవి ఆకాశంలో మిలమిల లాడ్తూ మనల్ని వూరించే తారకలు. వాటి కాంతిలో సాగిపోవడంలో సౌఖ్య ముంది కాని, వాటి నెగిరి పట్టుకుని గుప్పిట్లో ఇముడ్చుకో ప్రయత్నిస్తే జీవిత మిలాగే పసివాడూ-జాబిల్లీ చందంగా హాస్యాస్పద మైపోతుంది. మహామునులకే అంత సాధ్యంకాదు. ఇక మనమా? ఒక్క నక్షత్రకాంతే కాదు. సూర్యుడు, చంద్రుడు, గాలి, వాయువు మొదలైన శక్తు లన్నిటిక్రిందా భూమిమీద నిలబడ్డ సామాన్య మానవులం మనం.

"నక్షత్రాలు సూర్యకాంతిలో కన్పించవు. సూర్యుడిని మేఘం కప్పివేస్తుంది. మేఘాన్ని వాయువు తరుముతాడు. వాయువును తన గుప్పిట్లో పెట్టుకుంటాడు పరమాత్మ. ఇవన్నీ ప్రతి ఒక్కరూ ఎరుగున్నవే. అయినా, ఈ కఠోరసత్యాలను జీవితాల కన్వయించుకోవడం తెలియక బాధపడి యింకొకర్ని బాధపెడ్తారు.

"అనంతయ్యగారి కోరిక నంగీకరించడంలో నీ వ్యక్తిత్వం స్వల్పంగా దెబ్బ తినడం నిజమే కాని అదొక్కటే గుర్తించావుకాని అందువల్ల ఎన్ని హృదయాలెంత క్షోభకు గురయ్యాయో ఆలోచించావు కాదు. అంతటి వెన్నవంటి హృదయంలో పాషాణాన్ని కూడా పుట్టించావు నీ ప్రవర్తనవల్ల.

"వదినకు నీపైగల ప్రేమకు మురిసిపోయావేకాని తల్లిదండ్రుల రక్తమాంసాలతో ఒక ముద్ద అయిన బిడ్డ వారికి శాశ్వతంగా దూరం కావటాని కెంత క్షోభిస్తుందో అర్థం చేసుకోలేకపోయావు. నువ్వు ఇల్లు వదలివెళ్ళాక అనంతయ్యగారు వచ్చి పిల్చినపుడు వదిన చెప్పిన సమాధానం నా గుండెల్ని కలచివేసింది.

"ఎంత సున్నితంగా ఎంత వాడిగా చెప్పింది! 'కన్న ఇంటికి రావాలని ఏ కూతురి కుండదు నాన్నా? మీరు పిలుస్తారనీ, ఆదరిస్తారనీ కళ్ళు కాయలుకాచేటట్టు ఎదురు చూచినన్నాళ్ళూ మీ రిటు చూడనేలేదు. మీరు పిలవనిదే వచ్చినా, పలకరించారు కాదు. ఇవ్వాళ మీరు సాదరంగా పిలిచినా రాలేకపోతున్న దౌర్భాగ్యురాల్ని: నా భర్తవల్లే మీకు దూరమైన నేను, తిరిగి ఆయనతోనే మీ యింట అడుగుపెడతాను. నాపై బద్ధవిరోధత్వం పూనిన తలితండ్రుల అండనే, నేను లేనప్పుడు, బ్రతికిం దని మీ అల్లుడుగా రనుకుంటే నా ఆత్మాభిమానం దెబ్బతినదా?'

"వదిన ఒక్కొక్క మాటలోను వేలాది భారతస్త్రీల హాహాకారాలు నా చెవులకు వినిపించా యారోజు.

"అలాగే కాలేజీ విద్యార్థుల పేపర్లు విషయంలోనూను. బొత్తిగా చదువుకు అనర్హుడైన మొద్దుకు మార్కులు వేసి అన్యాయంగా పైకి లాగడం అక్రమం; కాని శ్రమపడి చదివీ, దురదృష్టం వల్ల ఒకటి రెండు తేడాలలో వచ్చిన మార్కులు కలుపమని నిన్నడిగారు వాళ్లు; వాళ్ళ అలవాటుకొద్దీ లంచం ఇవ్వబోయారు. కాని, అది తీసుకోవడం మానేసి నీకై నువ్వు దయా దాక్షిణ్యాలూ గలిగి — ఆ రెండు మార్కులూ వేసేసి గట్టెక్కించవచ్చే? పరీక్షల విషయం, విద్యార్థుల కష్ట సుఖాలు తెలుసున్నవాడివేకదా! ఆ సమయానికి ఏవో విధంగా వ్రాసి మార్కులు తెచ్చుకున్న ప్రతివాడూ ఉత్తీర్ణతకు అర్హుడేనా? తక్కువమార్కు లొచ్చిన ప్రతివాడూ తెలివితక్కువ వాడేనా? కాదు. పరీక్షలలో జరిగే వన్నీ, జరుగుతున్న వన్నీ మనకు తెల్సు.

"సరే ఇక అసలు విషయానికొద్దాం. ఇంట్లో ఒకళ్ళు యేదైనా తప్పుపని చేశారంటే దాని ప్రభావం అందరిపైనా వుంటుంది. దానికి ఇంచుమించు అందరు కూడా బాధ్యులే అయ్యుంటారు. చదువు మానేసి గాలికి తిరుగుతూ ఇదేం చేస్తున్నట్టూ అనే సంగతి పట్టించుకోలేదు. సరే ఒక అకృత్యం జరిగింది. ఇహనైనా సరిదిద్దడానికి ప్రయత్నించక, బెదరిపోయి అందర్నీ అగాధంలో కాకిగోల మధ్య వదలేసి నీమట్టుకు నువ్వు ముఖం చాటుచేసుకున్నావు.

"ఎవ్వర్నీ నీకై నువ్వు ఒక మాటతోగాని, చేతతోగాని బాధించవు — అని అనుకుంటున్నావు. కాని ఈ నీ అదృశ్యం ఎందర్నెన్నివిధాల బాధపెట్టిందీ ఎరుగుదువా? నోరు మెదపకుండా, శారీరకంగా బాధించకుండా మౌనంగానే ఎవ్వరూ వెయ్యనంత పెద్ద శిక్ష వేశావు.

"ఆదర్శాలంటూ ప్రాకులాడ్డమేకాని ఒక ఆదర్శంకోసం మరెన్నెన్ని విధ్యుక్త ధర్మనిర్వహణలు బలిచేశావో ఆలోచించలేదు. కట్టుకున్న భార్యనూ, కన్న తల్లినీ ఖర్మకు వదలి నీదారి నువ్వు చూసుకోమని ఏ ఆదర్శం బోధించింది? ఒక ఆదర్శం కోసం కర్తవ్యం విడనాడడం ధర్మమా?" దీర్ఘమైన తన వుపన్యాసాన్ని ఆపుజేశాడు రఘునాథ్.

చక్రపాణి తలవొంచు క్కూర్చున్నాడు; పులకలేదు, పలకలేదు. జానకమ్మ ఆగకుండా కన్నీరు కారుస్తూనేవుంది.

రఘు తిరిగి మొదలు పెట్టాడు. "నేను నీకంటె చిన్నవాడిని. నిన్ను దెప్పుతున్నా ననీ, బోధిస్తున్నా ననీ అనుకోవద్దు. నీ విస్మృతి ఎవరి కెంతెంత బాధ కల్గించిందో అశ్రువుల రూపంలో చూపిస్తున్నారు వాళ్ళు. ఇవ్వాళకాదు, ఆనాడు నీ అంతర్ధానం నాటినుంచీ ఈనాటివరకు అలాగే వున్నారు. నేను కూడ బలహీ

నత ప్రదర్శిస్తే ఇంకా దిగజారిపోతా రని ప్రయత్నంమీద దిగమ్రింగేవాడిని; యేకాంతంగా ఏడ్చేవాడిని.

"నా బాధ వీళ్ళలో యే ఒక్కరికంటె తక్కువైందికాదు. పైగా చాలా ఎక్కువేమో కూడా. నువ్వు నాకు అన్నవు, తండ్రివి, స్నేహితుడివికూడా. నువ్వు లేవని తెలిగ్రాం అందుకున్ననాడు, కుడిభుజం ఎవరో నరికేసినట్లయింది; గాలి తుఫాన్‌లో నిస్స హాయంగా నిలబడినట్లయింది. మహాసముద్రమేదో విజృంభించి మీదకు వస్తున్నట్టు హడలిపోయాను. అన్నగా, కుటుంబ పెద్దగా నీ క్రింద నీ కనుసన్నలలో మసిలిన నేను కుటుంబ యజమాని నవ్వడాని కెంత కుమిలిపోయానో, ను వ్వూహించ గలవు. అది భారం; మీద వేసుకోవడానికి జంకడంకాదు;

"అసలు నాన్నగారి బాధ్యతలు దురదృష్టంకొద్దీ నువ్వు మోయవలసివచ్చింది. అటువంటి నీ స్థానంలో నేను నిలబడటానికి పడ్డ ఆవేదన మాటలతో వర్ణించ నలవికానిది.

"సరే, ఎలాగో యింటికి జేరుకున్నాను. పద్మ విషయం విన్నాను. తల కొట్టేసినట్లయింది. నీ అంతర్ధానం శరీరంలోభాగాన్ని వేరుచేసినట్లయింది. కాని పద్మ చేసినపని శరీరాన్ని నిలువునా దహించివేసినట్లయింది; ఏటివాలుకు సర్దుకునికొట్టుకు పోగల స్వభావ మున్న నాకే అంత బాధ కల్గించిన పని సత్యమూర్తివైన నీ కెంత బాధాకరమై కన్నీల్లు వదలేట్లు చేసిందో వూహించగలిగాను. కాని ప్రతివారూ అటువంటి బలహీనతలకు లోనై ఇటువంటి పనులు చేస్తే ప్రపంచ మేమైపోతుంది?

"ఇందుకు వివాహం చెయ్యబోయి ఎన్ని అవమానాలపా లయ్యానో నీ కేంతెల్సు?

"పెద్దకొడుకు లేచిపోయాడు—పెద్దకూతురు లేచిపోయింది. ఇది మాత్రం కాపురం చేస్తుందా? ఇవే మాటలు, ఇవే విమర్శలు. ఇద్దరి ప్రవర్తనకూ సహ స్రాంశం భేదం వున్నా లోకం పరిభాషలోమాత్రం ఒకటే అయ్యింది. లోకానికి విమర్శించడమేకాని కారణ మక్కర్లేదు. శ్రీహరికి మన విషయా లన్నీ తెల్సుగనుక ఏ వంకా లేకుండా ఇందును చేసుకోవడానికి సిద్ధపడ్డాడు.

"ఇందు వివాహంగురించి ఇక్కడకు వచ్చిన దగ్గర్నుంచీ వదిన మరీ ఎంత దిగజారిపోయిందో చెప్తే విని నువ్వు నిజంగా ఆశ్చర్యపోతావు.

"'ఈ కొండలమీద అయిన మా వివాహం ఇలా పరిణమించింది. ఇక్కడ దేవుడు అనుకూలుడు కాదు, ఇక్కడ జరిగినపని ఫలవంతంకాదు. వెళ్ళిపోదాం' అని మొదలెట్టింది. 'ఎందుకో జీవితం? నా సంతోషాన్ని హరించిన ఈ కొండలమీదే జీవితం చాలిస్తే బాగుండును' అండిట కమలతో. నిజంగా నేను హడలిపోయాను.

అందుకే వదినను క్షణం విడవకుండా కాచుకొస్తున్నాం నేనూ, కమలా. ఈ వారం రోజుల్నించీ రాత్రిళ్లు నేనూ, శ్రీహరీ వంతుల ప్రకారం మేల్కొని కూర్చుంటున్నాం. వదిన ఏ అఘాయిత్యం చేస్తుందోనని. భగవంతు డనుకూలించాడు కాని, లేకపోతే వదిన తప్పకుండా అంతపనీ చేసేదే.

"పద్మను నేను క్షమించి ఆదరించడానికి కారణం పూర్తిగా కమల. వెళ్ళిపోతూ నువ్వు వ్రాసిన ఉత్తరంలో పద్మ విషయం వ్రాశావు. అయినా ఆ విషయంలో నేను నీ మాటకు విలువ ఇవ్వలేకపోయాను. కమల నా చేత ఆపని చేయించింది. అందుకే నా శ్రీమతి అయింది.

"ఇంతకూ అందరి జీవితాలూ సుఖాంతమై కుటుంబంలో తిరిగి శాంతిసంతోషాలు నెలకొని, తిరిగి సమిష్టి భవనం సాగించబోతూన్న ఈ శుభసమయంలో సూటిగా ఒక విషయం చెప్పదలిచాను.

"నా సుఖంకోసం అని స్వార్థంతో కాని, నా ఆదర్శం కోసమనే వేడితోకాని ఎవరైనా ఏదైనా పని జేయబోయేముందు దానిలోని నీతీ నిజాయితీలనూ, కుటుంబంలోని, వంశంలోని యితర వ్యక్తులపై దానివల్ల కలిగే ప్రభావమూ

ఫలితాలూ క్షుణ్ణంగా, వివేకంగా ఆలోచించాలి; విచక్షణ కలిగి ప్రవర్తించాలి." సంభాషణకు ముగింపు సూచిస్తున్నట్లు కుర్చీనుంచి లేచాడు.

"నిజం రఘూ." చక్రపాణి తమ్ముడి భుజం తట్టాడు. ఈ జ్ఞానం నీలో సహజంగానే వుంది. అనుభవంవల్ల కాని నాకు తెలియలేదు. ఇవి తెలిసివచ్చేసరికి సమయం దాటిపోయింది. అన్నివిధాల నీతో ఏకీభవిస్తున్నాను నేను."

అందరిముఖాలలో దరహాసం వెల్లివిరిసింది. హృదయాంతరాళాలలో ఆనంద తరంగాలు వుప్పొంగాయి.

కమల అందుకొంది. "అక్కా, సిరి శ్రీనివాసుని దరి జేరింది. మరి ప్రయాణ మెప్పుడు ?"

రెండు రోజుల నాటి తన మాటాలు పురస్కరించుకుని కమల హాస్యం చేస్తోం దని గ్రహించింది మాధవి.

ఆమె సమాధానం చెప్పేలోగానే జానకమ్మ అందుకొంది. "వెళ్దాంలేం దమ్మా; తిరిగి అందర్నీ ఈ విధంగా ఇక్కడ కలిపిన ప్రత్యక్షదైవం ఆ శ్రీనివాసుణ్ణి రే పుదయమే శుచిగా దర్శనం చేసుకుని మరీ వెళ్దాం," అంటూ దేవాలయం దిశగా తిరిగి "ఎప్పుడూ నా బిడ్డల్నీ, కుటుంబాన్నీ చల్లగా చూడు తండ్రీ. మనుషు లందర్కీ నీ పేర్లే పెడ్తాను."

"అబ్బో, అందరికీనా?" అన్నాడు రఘు నవ్వుతూ.

"ఆం, అందరికీని. ఎవ్వరూ ఏమీ మాట్లాడకండి." అధికారంగా, తల్లిగా ఆజ్ఞాపించింది జానకమ్మ.

మరునాటి ప్రాతఃకాలం కుటుంబ మందరూ సుస్నాతులై, శుచిగా భక్తిశ్రద్ధలతో శ్రీనివాసాలయానికి వెళ్లారు. నవరత్నఖచిత స్వర్ణాభరణాలతో ఆపాదమస్తకం దేదీప్యమానంగా ప్రకాశిస్తూ, మహత్య మంతా మూర్తీభవించినట్లున్న ఆ కలియుగ వైకుంఠవాసుని— అభయప్రదాన మిస్తూ నిలిచిన ఆ శంఖు చక్రధారిని గోవింద నినాదాలతో దర్శించి, భక్తిప్రణామా లర్పించి పవిత్రమై, ఎనలేని సంతోష ప్రశాంత పూరితమానసులై వెలుపలికి వచ్చారు.

హేమంతశోభ వర్ణనాతీతంగా వుంది. హిమానీబిందు పరిషిక్త దేహులైన పర్వత సానువులనుండి నిర్మల ప్రాతర్మందానిల తరంగాలు మెల్ల మెల్లన వచ్చి చల్ల చల్లగా మేనిని సంతోషింప జేస్తున్నాయి. గిరిశిఖల నుండి సూర్యరశ్మి హేమంతకాంతులు విరజిమ్ముతూ క్రమంగా అంతటా ప్రాకసాగింది.

నిన్నటివరకూ మనఃప్రలోభకారియై ఆవేదనకారణ మైన ఆ హేమంతశోభ నేడు మాధవికి మనోతేజఃప్రతారణకారి అయ్యింది.

మనోభీష్టాలను నెఱవేర్చుతూ, కలకాలం చల్లగా కాపాడమని ప్రార్థిస్తూ, ఆలయ గోపురాగ్రాన్ని తిరిగిచూస్తూ నడక సాగించారు.

"వినడమే కాని నేనెప్పుడూ చూడలేదు. ఈ వైభోగాన్ని, ఈ భువన మోహన రూపాన్ని దర్శించ వేయి కనులైనా చాలవు బావగారూ," అన్నాడు సంపూర్ణహృదయంతో కరుణాకరం.

"నిజం" అన్నాడు చక్రపాణి. "సాక్షాత్తూ ఆ మహావిష్ణువే ఇక్కడ వశిస్తున్నాడు. లేకుంటే ఆ దివ్యసన్నిధిలో సర్వాన్నీ మఱచి ఎందుకంత మైమఱచిపోతాం ? ఎంత చూచినా ఎందుచేత వర్ణించ శక్యం గాకుండావుంది?" అని కొంచంసేపాగి, "ఆ శ్రీ వేంకటేశుని చిద్విలాసం కాకపోతే, చిన్నాభిన్నమైపోయిన సంసారం తిరిగి ఇక్కడిలా కలియడం, అందరి సమస్యలూ యింత తేలికగా పరిష్కారం కావడం ఏమిటి?" అన్నాడు.

"నిజం బాబూ. అంతా ఆ దైవ మహిమే;" అన్నది జానకమ్మ.

"మరీ......ఇంతకాలం ఇన్ని కష్టాలు పడ్డాం కదా, ఎందు కంటారు ? అప్పుడు దేవుడు మనల్ని రక్షించలేదేం?" అనడిగింది కమల, ఒక వంక అత్తగారికి బెదుర్తూనే.

ఆనందంగా వున్న జానకమ్మ తేలికగా నవ్వేసింది. "పిచ్చి పిల్లా, రక్షించి కాపాడుతున్నాడు గనుకనే కర్మానుసారం కష్టా లనుభవించినా ఎక్కడివాళ్ళక్కడే క్షేమంగా వుండి తుళ్ళీ కల్సుకోగలిగాం. మరీ పూలబాటలా సాగిపోతాయా జీవితాలు ?

"కష్టా లనుభవించి రగడ తేలనిదే జీవితానికి సంపూర్ణత్వం లేదన్నమాట. ఆనంద విచారాలమధ్య ఊగే ఉయ్యాల ఈ మానవజీవితం. అవతార పురుషులకే, ఆ శ్రీ మహావిష్ణువుకే తప్పలేదు కష్టాలు. ఇక మన మెంత ? ఇది తెల్సుకోడానికే మన పురాణాలు. చెడు ముందే మంచి ప్రకాశించేది. కష్టం తర్వాతనే సుఖం రుచీ, జీవితపు విలువా తెలిసేది."

అందరికీ నచ్చాయి ఆ మాటలు. నిండు హృదయాలతో గృహాభిముఖులయ్యారు.

చక్రపాణి అన్నాడు. "అవును కమలా, కష్ట సుఖాలు ఒకే చక్రంలో బిగింపబడిన ఆకులు. జీవన చక్రభ్రమణ వేగోద్ధృతంలో ఏ ఆకు అగ్రస్థానం వహిస్తే దానియొక్క ప్రభావ ఫలితాలను ఆ చక్రపు టంచుపై నడిచే మానవమాత్రులం అనుభవించక తప్పదు. సుఖంలో పొంగిపోక, దుఃఖంలో కృంగిపోక ఆ వెనుకనే రెండవదికూడా అనుసరించగలదనే సత్యం విస్మరింపక అందు కవసర